# స్వరూప జ్ఞాన దర్పణము

తాత్పర్య సహితము





గ్రంథకర్త

శ్రీ సింహంభట్ల రామమూర్తి శాస్త్రి

శుభమస్తు.
శ్రీగణేశాయనమః.
శ్రీ దక్షిణామూర్తిగురవేనమః.

# స్వరూపజ్ఞానదర్పణము

## తాత్పర్యసహితము.

వేదాంతగ్రంథము.

బ్రహ్మశ్రీ సింహాంభట్ల రామమూర్తి శాస్త్రిలవారిచే
తాత్పర్యసహితముగా మూలగ్రంథము రచింపఁబడినది.
వీరు పరికృతమందు తురీయాశ్రమమును పొంది
అవధూతస్థితిలో నున్నందున
వారిముఖ్యశిష్యులచే ప్రచురింపఁబడినది.

శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరు
మన్నెసుల్తాన్ ఆఫ్ ముక్త్యాలసంస్థానం, కృష్ణాజిల్లా.
వారి ధనసహాయమున ముద్రితమైనది.

శ్రీ అవధూత స్వాములవారి ముఖ్యశిష్యులు

1. సింహాంభట్ల లక్ష్మీగణేశ్వర శాస్త్రిగారు,
(ఓవర్ సియర్) మునగాలపరగణా, కృష్ణాజిల్లా.
2. సింహాంభట్ల దక్షిణామూర్తి శాస్త్రులుగారు,
(సంస్కృత యం. ఎ.) ప్రొఫెసర్ అలహాబాదు
3. సింహాంభట్ల సుబ్రహ్మణ్య శాస్త్రిలుగారు
(బి. ఎ. బి. ఎల్.) హైకోర్టువకీలు, అలహాబాదు

వీరిచే ప్రచురింపఁబడినది.


1934 [వెల రు 1—8—0



శ్రీలలితా త్రిపురసుందరీదేవి

శ్లో॥ చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే।
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేకమాతః॥

శ్లో॥ బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వాస్రనాగ దళషోడశ పత్రయుక్తం।
వృత్తత్రయం చ ధరణీ సదనత్రయం చ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః॥

# సూచీపత్రము

(స్వరూపజ్ఞానము)

—:o:—



ప్రథమపాదపూర్తి

రెండవపాద పూర్తి

తృతీయపాదప్రారంభము

తురీయ్యపాదం సంపూర్ణం.

---

శ్రీ

శుభమస్తు.

శ్రీ గణేశాయనమః॥

# స్వరూపజ్ఞానదర్పణము

## దేవతాప్రార్థన.

శ్లో॥ గౌరీపుత్ర గణాధ్యక్ష గజరాజముఖాంబుజ।
నతప్రీత నమస్తేస్తు నతభక్తార్తిభంజన॥౧॥

## బ్రహ్మవిద్యాగురుపరంపర

శ్లో॥ చిదంశవిద్యా గురుమండలాభం
త్రయీమయజ్ఞాన సమృద్ధికామం।
ప్రకాశరూపం శివమాదినాథం
పరాంబికాం శంకర మాదిదేవం॥౨॥

శ్లో॥ నారాయణం పద్మభువం వసిష్ఠం
శక్తించ తత్పుత్రపరాశరంచ।
వ్యాసంశుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్ర మథాస్యశిష్యం॥౩॥

శ్లో॥ శ్రీశంకరాచార్య మథాస్య పద్మ
పాదంచ హస్తామలకంచ శిష్యం।
తంతోటకం వార్తిక కారమన్యా
నస్మద్గురూన్ సంతత మానతోస్మి॥౪॥

శ్లో॥ శ్రీమత్సత్యానందనాథ మంత్రదీక్షాభిధాధరం।
అస్మద్గురువరం సర్వపురుషార్థదమాశ్రయే॥౫॥

శ్లో॥ శ్రీ చంద్రమౌళీశ్వర పాదపంకజం
స్మరామి మచ్చిత్త తమోపశాంతయే।
భజామి శక్రాదిభి రర్చితం శివం
కరోమిపూజాం నిఖిలార్థసిద్ధయే॥ ॥౬॥

శ్లో॥ స్మితముఖచంద్రద్యుతి సంతతి కలధౌత బ్రహ్మాండం।
కరధృత పుస్తకమాలా మృతకలశ జ్ఞానముద్రం।
హరహరి విధిశక్రాదిభి రారాధిత పాదయుగం।
వటమూలనివాసినంనమామిచిన్మయమాదిగురుం ॥౭॥

శ్లో॥ మందస్మిత ముఖాంభోజం కరుణారస మానసం।
గురురూపధరం సాంబం నమామి వినయాన్వితః ॥౮॥

—శ్రీ దేవీ ప్రార్థనం.—

శ్లో॥ శ్రీచక్ర రాజరాజిత శ్రీపీఠవాసినీం నిత్యాం॥ కామేశ్వ
రాంక నిలయాం కరుణారస పూర్ణలోచనత్రితయాం।
స్మితముఖచంద్ర ద్యుతి జితచంద్రాం దర్పణ కపోలాం।
పుండ్రేక్షుపుష్ప బాణాన్పాశాం కుశధారిణీంవందే ॥౯॥

శ్లో॥ కంబుగ్రీవారాజిత నవరత్నగ్రథిత హారాం తాం।
కనకకలశాభశోభిత కుచభార నమన్మధ్యాం।
కింకిణికల నాదాంచిత సువర్ణ కటిసూత్రాంశాంతాం॥
కౌసుంభ దుకూలాంచిత్తను లతికాజితవిద్యుల్లతాం॥౧౦

శ్లో॥ సింజన్మణి మంజీరధ్వని జనితాఖిల శ్రుతిజాలాం।
సితశోణారు చాలంకృత పదపల్లవ కిసలయాం।

సువ్యక్త మయూఖాళిచ్ఛశి రవిశుచిమండలాభాం।
సురపురవాసి పురంధ్రీ పరివారిత భారతీం నౌమి॥ ౧౧

శ్లో॥ శ్రీమత్ జ్ఞానానందనాథ దీక్షానామవిరాజినా।
సింహంభట్ల సువంశ్యేన రామమూర్తి మనీషిణా॥ ౧౨

శ్లో॥ సర్వోపనిషదాం సారంసారం సద్గ్రంథసంచయాత్।
ఉద్ధృత్యరచితం శుద్ధం స్వరూపజ్ఞానదర్పణం॥ ౧౩

శ్లో॥ అస్యావలోకనాత్సర్వే బ్రహ్మసాయుజ్యతాంగతాః।
శివశక్తిసమాయోగచారిత్రం పావనం పరం॥ ౧౪

విజ్ఞాపనం.

అవధారయాంబ విజ్ఞప్తి మాదరేణదయానిధే।
అర్పితం శ్రీ పదాంభోజసన్నిధౌ కుసుమోపమం॥ ౧౫
త్వచ్చారిత్రయుతం స్తోత్రం స్వరూపజ్ఞానదర్పణం
త్వత్ప్రీత్యైరచితం మాత స్త్వయాప్రేరితచేతసా॥ ౧౬

శ్లో॥ సుధాసింధౌమణి ద్వీపేచింతామణి గృహాంగణే।
త్రిమూర్తీశానమంచస్తే సదాశివవినిర్మితే॥ ౧౭
కామేశ్వరాంకపర్యంక స్థాయినేగతమాయినే।
శ్రీపూర్ణగిరిపీఠస్థే శ్రీదేవత్వాం నమామ్యహం॥ ౧౮
శివేశివ పరేమాత పరావాగ్దేవతేశ్శృణు।
శరణాగత దీనార్త జనరక్షాపరాయణే॥ ౧౯
త్వదీయ్యవైఖరీ శబ్దైర్నిర్మితం భావగర్భితం।
వినిర్మితమిదందేవి స్వరూపజ్ఞానదర్పణం॥ ౨౦
త్వన్నామాంకితపూతంచ స్వరూపజ్ఞానదాయకం।
అస్యార్థగ్రహణాదేవ కైవల్యంప్రాప్యతేనరైః॥ ౨౧

శ్లో॥ కైవల్యప్రాప్త్యే చేదం కల్పితం భావగర్భితం।
సుకృతైః కేవలభ్యతే సులభం మోక్షసాధనం॥ ౨౨
సర్వేత్తే వైఖరీశబ్దాః భవన్నామాని భాంతి।
లోకే యే మూర్తయస్సర్వాః రూపాణి తవ చాంబికే॥ ౨౩
త్వన్నామసుధయా ధౌతం మాతః స్వీకురు నిర్మలం।
బహిర్మజ్ఞానప్రదం నృణాం స్వరూపజ్ఞానదర్పణం॥ ౨౪
త్వన్ముఖచంద్రప్రచ్యావిత సుధయా చ కలధౌతం।
అత్యధికనిర్మలత్వం యాచే త్వాం పూర్ణదాత్రీత్వం॥ ౨౫
శ్లో॥ లోకే ముకురా బహవస్సన్తి బహిర్జగత్కలనాః।
స్యాంతర్జగత్కలనతా అంతర్ముఖవృత్తితాస్యాం॥ ౨౬
ప్రతిబింబితశైలాదికరూపం విహాయమాయేతి।
కేవలదర్పణతాయా యద్గ్రహణం స కేవలీభావః॥ ౨౭
మాతస్త్వత్పదపద్మసంస్మృతివశాత్సం జాతవాఙ్నిర్మితం।
త్వచ్చారిత్రయుతం విచిత్రరచనాయుక్తం పవిత్రం

నృణాం।

అంబ త్వత్పదయోస్సమర్పితమభూద్విజ్ఞప్తిపూర్వం శివే।
స్వాకారస్మృతిదానదర్పణమిదం సేవావిధా స్వీకురు॥ ౨౮
ఇతి విజ్ఞప్తిః॥

---



శ్రీ జ్ఞానానంద తీర్థావధూత స్వాములవారు.

శ్రు॥ సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన।
బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి, బ్రహ్మవి దాప్నోతి పరం॥

శ్లో॥ తావత్ గర్జంతి శాస్త్రాణి, విపినే జంబుకా యథా।
నగర్జతి మహాశక్తో యావద్వేదాంత కేసరీ॥

శుభమస్తు॥

# బ్రహ్మానుచింతనాష్టకము

జ్ఞానానంద తీర్థ అవధూత స్వాములవారిచే రచించబడినది.

శ్లో॥ అహంబ్రహ్మ సదాముక్తో బ్రహ్మణోన్యం నకించన।
విస్మృతం స్మృతిమాపన్నం శ్రీ గురోఃకృపయాధునా॥౧॥

శ్లో॥ ఆనందోహమసంగోహం సర్వసాక్షీహ్యహంశివః।
ప్రపంచజాగరావస్థా స్వప్నతుల్యా తురీయ్యకే॥౨॥

శ్లో॥ చిత్యాసంకల్పజం చైత్యం సా స్వతంత్రాహి సర్వదా।
చైత్యంత్యాజ్యం చితింజ్ఞాత్వా దర్పణప్రతిబింబవత్॥౩॥

శ్లో॥ స్వస్వరూపంతు చిన్మాత్రం చైత్యంమాయాపరికల్పితం।
చిదహంచిదిదం సర్వం చిత్యాసర్వంప్రకాశతే॥౪॥

శ్లో॥ మిథ్యాభావాత్సత్యతాస్యా జడాభావాచ్చిదీరితా।
దుఃఖాభావాత్తదానందం సచ్చిదానందతా తతః॥౫॥

శ్లో॥ సర్వవేదాంతసిద్ధాంత స్సర్వంబ్రహ్మేతి నిశ్చయః।
తస్మాత్సర్వం పరిత్యజ్య స్వస్వరూపే వసేన్నరః॥౬॥

శ్లో॥ తత్రైకైవల్య మితిప్రోక్తం సజీవన్ముక్త ఈరితః।
ఇతఃపరంతు వక్తవ్యం శ్రోతవ్యం వా నకించన॥౭॥

శ్లో॥ చిదాకాశే విరాజంతే యస్మాద్బ్రహ్మాండకోటయః।
చిదాకాశస్వరూపోహంతస్మాన్మానం పరంసుఖం॥౮॥

శ్రీరస్తు.

# అనుమోదకులు

---

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శృంగగిరి భారతీ పీఠాధీశ్వర జగద్గురు శ్రీచంద్రశేఖర భారతీ స్వాములవారిచే సమ్యక్పరిశీలితమై అనుమోదించబడినది.

---

శుభమస్తు.

శ్రీ గణేశాయనమః

# శ్రీ దక్షిణామూర్త్యష్టకము

శంకరాచార్య కృతం

## ధ్యానం

శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్వం యువానం
వర్షిష్ఠాంతే వసదృషి గణైరా వృతం బ్రహ్మ నిష్ఠైః।
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్రమానందమూర్తిం।
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే॥

ఉపోద్ఘాతము॥

అవతారిక:- వెః క- సనకసనందనాది మహాఋషులు- ఆత్మనిశ్చయమునుకోరి పరమేశ్వరునిగూర్చి తపస్సుచేయగా వారికి బ్రహ్మతత్వనిశ్చయము నుపదేశించడముకు పరమేశ్వరుడు భాండీరమనె వటవృక్షమూలమందు- మౌనము చిన్ముద్రనూ ధరించి దక్షిణాభి ముఖముగా నవతరించినారు.

వారికి దక్షిణామూర్తి అనినామప్రసిద్ధి కలిగినది. వారి దరిశనమాత్రమున సనకాదిమహాఋషులకు- సకలసంశయములుపోయి బ్రహ్మవేత్తలైనారు- వారుఅద్వైతమతముకున్ను-

బ్రహ్మాది దేవతలకు- సనకాది సిద్ధులకు- వ్యాసాదిమానవఋషు
లకు- బ్రహ్మవిద్య నుపదేశించుటకు ఆదిగురువుగానున్నారు.

కొంతకాలమునకు- లోకమందు వేదవిరుద్ధమైన అనేక
దుర్మతములుకలిగి ప్రబలమై అద్వైతమతము- బ్రహ్మజ్ఞానము
లుప్తమైనందున- పరమేశ్వరుడు- శంకరాచార్య రూపముతో
కేరళదేశమందవతరించి- సకలదుర్మతములను ఖండించి- దిగ్వి
జయమును పొంది- అద్వైతమతమును సర్వత్రాప్రతిష్ఠాపన చేసి
నారు. ఇంగాక- బ్రహ్మజ్ఞానసాధనములుగా ననేకగ్రంథములను
లోకసంగ్రహార్థముగా వ్రాసిరి. ప్రస్థానత్రయ భాష్యత్రయ
ములను రచించినారు.

వారు బ్రహ్మజ్ఞానాపేక్షగల జిజ్ఞాసులకు సులభముగా
బ్రహ్మజ్ఞాన బోధ కలగడమునకు వేదాంతశాస్త్రమందుగల
ముఖ్యాభిప్రాయాంశములనుచేర్చి ఆదిగురువులగు దక్షిణామూర్తి
కృతితో గురువందనాష్టకముగా నీశ్లోకములను రచించినారు.

వేదాంతగ్రంథములందు- నామరూపములుకలిగి ప్రత్య
క్షముగానున్న జగత్తు అసత్యమనియు, నామరూపరహితమైన
నిర్గుణబ్రహ్మ- పరమాత్మ నిజమని బోధించుటకు- కార్యకార
ణధర్మము, మృద్ఘట దృష్టాంతము, తంతుపటన్యాయము, దధి
క్షీరన్యాయము, రజ్జుసర్ప దృష్టాంతము మొదలగునవి నిరూ
పించబడినను అవన్నియు దార్ష్టాంతికమందు సరిపడక దోష
యుక్తములైనందున- నిరాక్షేపణగాను దార్ష్టాంతికమందు
సరిగా వర్తించే దర్పణప్రతిబింబన్యాయము- స్వప్నజాగ్రతల

దృష్టాంతమునున్నూ వీరుగ్రహించి మరికొన్ని సులభసాధనలను చేర్చి బ్రహ్మజ్ఞానముకొరకు ఈ అష్టకమును రచించినారు.

లోకమందు ప్రపంచ సుఖములనిచ్చె అనేక విద్యలున్నవి. సకలజనులకు- జననమరణ ప్రవాహముగల సంసార సముద్రమును తరించడముకు, శాశ్వతసుఖమును పొందుటకు, బ్రహ్మవిద్యతప్ప వేరుసాధనములు లేవు. అన్నివిద్యలకన్న బ్రహ్మవిద్య అసాధ్యమైనది- అట్టిదానిని సులభముగా గ్రహించడముకు ఈగ్రంధము నావ [పడవ] గా నున్నది.

బ్రహ్మజ్ఞానముకు ఫలము- సర్వాత్మత్వము, ఈశ్వరత్వము సిద్ధించడమున్ను; జీవన్ముక్తి, మోక్షములు, లభించడము ఫలముగానున్నది. అవి ఈఅష్టకమందున్న అర్థానుసంధానమువలన- సులభమై అప్రయత్నముగా సిద్ధించును॥

మూలశ్లోకములందు అర్థము గంభీరముగా నిమిడియున్నందున- దానిని వెల్లడించి- మందాధికారులు తరించుటకై ఆంధ్రభాషలో తాత్పర్యము వ్రాయడమైనది.

శ్లో॥ విశ్వందర్పణదృశ్యమాననగరీ
తుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివో
ద్భూతం యధానిద్రయా।
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే
స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయేనమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే ॥౧॥

తా॥ లోకమందున్న సకలజనులున్ను- ఈశ్వరసంబంధమైన- ఇచ్ఛాశక్తిస్వరూప మాయాశక్తివలన- మోహమును పొందినవారై అనేకవిధములుగ భేదముగల ప్రపంచజ్ఞానము కలవారై నామరూపములుగల ప్రపంచము సత్యమనినమ్ముచున్నారు.

దీని నిజస్థితిని విచారించగా సృష్ట్యాదిని- బ్రహ్మతేజస్సు అఖండాకారముగా ఈప్రపంచము లోపలను పైని వ్యాపించి చిదాకాశమున్నది. దానియందుమాయాశక్తి క్రమక్రమముగా కార్యకారణ భావముతో యీప్రపంచమును సృజించి- అందున్న జనులకు- తన మోహశక్తిని కలుగజేసినది. అందువలన- ఈప్రపంచము తమశరీరాదులు నిజమని నమ్ముచున్నారు॥

దీనివాస్తవము- గొప్పఅద్దమందు ప్రతిబింబించిన పట్టణమువంటిది. అద్దమువంటి చిదాకాశమందుగల ప్రతిబింబపట్టణమువంటిది అనిగ్రహించవలెను. అయితే అద్దమందు ప్రతిబింబమునకు బింబాపేక్ష కలదుగదా- ప్రకృతమందున్న జగత్ప్రతిబింబమునకు కారణము బింబమేదని ఆక్షేపణ కలుగును.

యీ మాయాశక్తి జడము. విచారించగా లేనిది. దీనికి మూలప్రకృతి అని నామాంతరము కలదు. అది ఈశ్వరసంకల్పమే అట్లు పరిణమించినది. ఈశ్వరుడు- సకలశక్తులుగలవాడు గనుక వారి సాన్నిధ్యమువల్ల జడమైన దీనికిన్ని సకలశక్తులు కలిగినవి. ఘటనాఘటన సమర్థత కలదిగాన దీనికి బింబాపేక్ష లేకనే ప్రతిబింబమును ఉన్నట్లు చూపించగలదు.

అద్దమందున్న ప్రతిబింబము అజ్ఞానులకు నిజమువలెను విచారించినవారికి- అద్దముయొక్క నునుపువల్ల కలిగినదని అద్దముకన్న వాస్తవము రెండవది లేదనేజ్ఞానముకలుగును॥

అదేరీతిని- ప్రపంచజీవాదులు నిజమనేనమ్మిక యున్న అజ్ఞానులకు- ఈశ్వరుడు గురురూపముగా వచ్చి ప్రపంచము యొక్క నిజమును తననిజమును బ్రహ్మజ్ఞానమును- బొందిన పైని- చిదాకాశమందు ప్రపంచము కల్పితమనియు అందరికీ చిదాకాశము నిజరూపమని దానియందు కల్పితము అసత్యమనినిస్సంశయముగా తెలియును. అందువల్ల అట్టిబ్రహ్మజ్ఞానము స్వరూపజ్ఞానమువల్ల- సంశయములు పోవును- అట్టిగురుస్వరూపులగు దక్షిణామూర్తికి ఈ నమస్కారము అని భావము॥

శ్లో॥ బీజస్యాంతరివాంకురోజగదిదం
ప్రాఙ్నిర్వికల్పంపున
ర్మాయాకల్పితదేశకాలకలనా
వైచిత్ర్యచిత్రీకృతం।
మాయావీవ విజృంభయత్యపి మహా
యోగీవయస్స్వేచ్ఛయా
తస్మై శ్రీ గురుమూర్తయేనమఇదం
శ్రీ దక్షిణామూర్తయే॥ ౨॥

తా॥ ఈజగత్తు సృష్టికి పూర్వమందు- బీజమందంకురము వృక్షము ఇమిడియున్నట్లు- బ్రహ్మయందు. (చిదాకాశమందు) ఇమిడియున్నది. ప్రపంచాకారము కావలెనని పరమేశ్వర సంకల్పము కలిగినపుడు వారిఇచ్ఛాశక్తియే మాయా

శక్తిగా నావిర్భవించి- దేశకాలవస్తు భేదముకలిగి- అతివిచిత్రముగా- కార్యకారణ భావముతో గోడమీాద చిత్రములు వలెను- చిదాకాశమునం దీ ప్రపంచము కల్పించబడినది.

ఈసృష్టిన్ని జడమైనందున బ్రహ్మశక్తివల్లనే చేతనత్వము కలిగి ప్రకాశించుచున్నది. ఈప్రపంచ సృష్టి, స్థితి, లయమును పరమేశ్వరుడు ఒక ఇంద్రజాలకునివలెను తానే చేయుచున్ననూ తనకు సంబంధములేక అసంగ చిదూ్రపుడై యోగీశ్వరుని వలెను- చిదానందముతో స్వరూపస్థితితో నుండును. ఇట్టిమహిమగల సర్వగురువులగు దక్షిణామూర్తికి ఈనమస్కారము॥

ఇందువల్ల పరమాత్మ సృష్టియొక్క ఆదిమధ్యావసానములందు చిదాకాశ స్వరూపముతో ఏవికారములులేక ఏకాకారముగాయున్నాడనియు, జగత్తు-శరీరజీవాదులు- మాయాశక్తిచె కల్పితములు- జడములు- అని తెలుసుకొని- వాటియందున్న- సత్తా పరమాత్మకల అని తెలుసుకుని- సృష్టి ఇంద్రజాలము వంటిది (లేనిది) అని తెలుసుకుని- దీనియందు సత్యమనేబుద్ధిని విడచి- సదానిత్యమైన తననిజరూపము చిదాకాశ సంబంధమైన కలయని నమ్మవలెనని భావము॥

శ్లో॥ యస్యైవస్ఫురణం సదాత్మక
మసత్కల్పార్థగంభాసతే
సాక్షాత్తత్వమసీతి వేదవచసా
యోబోధయత్యాశ్రితాన్ ।

యస్సాక్షాత్కరణాద్భవే న్నపునరా
వృత్తిర్భ వాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం
శ్రీదక్షిణామూర్తయే॥౩॥

తా॥ ఎవరిసంబంధమైన స్ఫురణశక్తి- చిచ్ఛక్తి అయి ననూ- అజ్ఞాన స్వరూపముగా ప్రకాశించుచున్నదో; అనగా సకలజనులకు తమలోనున్న సాక్షిజ్ఞానము నిత్యము- అదిబ్రహ్మకల, అదేతన నిజరూపము- శరీరజీవాదులు నేననేది మోహము గనుక తమలోనున్న జ్ఞానము ఈశ్వరసంబంధమైననూ- మాయచే మోహితులయి- ప్రపంచము సత్యమని శరీరజీవాదులు తానని భ్రమను పొందినారని భావము॥

అట్టి అజ్ఞానులు- ఈశ్వరోపాసనను చేసినపుడు- ఏపరమేశ్వరుడు గురుస్వరూపముగా వచ్చి- తత్వమస్యాది మహావాక్యోప దేశముచేసి- ఆత్మసాక్షాత్కారమును కలుగజేయుచునారో; ఏపరమాత్మ తనకు ఆత్మసాక్షాత్కారము చేయడమువలన- అనగా- ఈశ్వరప్రార్థన వలన- ఈశ్వరుడే గురురూపముగావచ్చి మహావాక్యార్థ బోధచేసి- శరీర జీవాదులు నీవుకావు; సర్వపరిపూర్ణముగా నున్న చిదాకాశము నీనిజరూపమని బోధించగా వాడు ముక్తుడగును- సంసారమందు పునర్జన్మ వానికి కలుగదు. గనుక- ఎవరిఅనుగ్రహమువల్ల ఇట్టిలాభమో అట్టి దక్షిణామూర్తిస్వరూప పరమేశ్వరునకు ఈ నమస్కారము.

శ్లో॥ నానాఛిద్రఘటోదరస్థితమహా
దీపప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాది కరణ
ద్వారా బహిస్స్పందతే।
జానామీతి తమేవ భాంతమను భా
త్యేతత్సమస్తం జగత్।
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే॥ ౪॥

తా॥ చుట్టునూ అనేకరంధ్రములుగల ఘటమందుంచిన గొప్ప దీపకాంతి రంధ్రములద్వారా పైకివచ్చి ఆయాస్థలములను ప్రకాసించినట్లు సకల జనుల హృదయకమలమందు చిత్కళ ప్రకాశించుచు నేత్రశ్రోత్రాది ద్వారములనుండి పైకివచ్చి ఆయాపనులను చేయుచున్నది.

అన్నిటిని గ్రహించేది ప్రపంచాకారముగా ప్రకాశించేదే చిదాకాశము. దానిని తెలుసుకొనక భేదజ్ఞానము కలుగడమే అజ్ఞానము. ఇదిగాక తనలోనున్న జ్ఞానము నేత్రద్వారా వచ్చి ఎదటను ప్రకాసిస్తున్న వస్తువును చూచినాను విన్నాను అని తెలుసుకొనుచున్నాడు.

ఇదంతయు చిదాకాశమందే యున్నది. ఎట్లనగా- ప్రపంచమందుగల సూర్యచంద్రాగ్నులుకూడ బ్రహ్మతేజస్సువల్లనె ప్రకాశించుచున్నారు. అదిలేనిది జడము పనికిరాదు. గనుక ఆ చిత్కళయొక్క ప్రకాశమే జ్ఞానము, అందరి నిజరూపమున్ను, అయియున్నందున ఒక జ్ఞానమే ప్రపంచమును

ప్రకాశింపజేయుచున్నది. అదే చూచేవానియందుండి చూచి నాను-ఉన్నది- లేదు అని ఒక్క జ్ఞానమే తెలుసుకునేది తెలియబడేది అని భావము. అట్టి జ్ఞానస్వరూపమైన గురువులగు దక్షిణామూర్తికి నమస్కారము.

శ్లో॥ దేహం ప్రాణ మపీంద్రియాణ్యపి చలాం
బుద్ధించ శూన్యం విదుః
స్త్రీబాలాంధజడోపమాస్త్వహమితి
భ్రాంతా భృశంవాదినః।
మాయాశక్తి విలాసకల్పిత మహా
వ్యామోహ సంహారిణే
తస్మై శ్రీ గురుమూర్తయేనమఇదం
శ్రీదక్షిణామూర్తయే॥౫॥

తా॥ సకలసాధనములుగల సకలపురుషులున్న శరీరము, ప్రాణము, జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, చలనస్వభావముగల బుద్ధి, ఇవన్నియు తనలోనుండి వేరు వేరు ధర్మములు కలిగి సాక్షిస్వరూపమై జ్ఞానశక్తిచేత తాము జడములైననూ ప్రకాశించుచు తమతమ పనులను చేయుచున్నవి. ఇట్లుండగా వీరు మాయాశక్తివశులై మోహమునుపొంది అవివేకులై శరీరప్రాణాదులను శూన్యముగా తెలుస్తున్నారు. ఇంతేగాక స్త్రీలవలెను చంచలత్వము, బాలులవలెను అజ్ఞానము, గుడ్డివానివలెను ఎదురుగా ప్రకాశించుచున్న బ్రహ్మతేజస్సును ఏమీలేదని చూడలేకనూ, (తెలుసుకొనలేకనూ) శరీరజీవులు నేననే దురహంకారము, స్వపరభేద

ముకలిగి దేముడులేడు అగుపడడు అనే శూన్యవాదులగుచున్నారు. అట్టి అజ్ఞానులను వారి పూర్వపుణ్యముచేతను ఈశ్వర భక్తిపూజా ఉపాసనాదులు చేసినపుడు ఏ పరమేశ్వరుడు గొప్పదైన మాయాశక్తియొక్క విలాసరూపమైన మహామోహమును పోగొట్టి వారికి జ్ఞానము కలుగజేసి ఇహాపర సౌఖ్యములిచ్చి తమ నిజరూపజ్ఞానము, బ్రహ్మజ్ఞానమును, కలిగేలాగు ననుగ్రహిస్తున్నారో అట్టి గురుస్వరూపులగు దక్షిణామూర్తికి నా నమస్కారము.

శ్లో॥ రాహుగ్రస్త దివాకరేందు సదృశో
మాయా సమాచ్ఛాదనా
త్సన్మాత్రః కరణోప సంహృతరతో
యోభూత్సుషుప్తః పుమాన్।
ప్రాగస్వాప్స మితిప్రబోధసమయే
యః ప్రత్యభిజ్ఞాయతే।
తస్మై శ్రీ గురుమూర్తయేనమ ఇదం
శ్రీదక్షిణామూర్తయే॥౬॥

తా॥ సకలజనులందును జీవస్వరూపముగా చిత్కళ ఉన్నది. శరీరత్రయము పురములని వాటియందున్నందున పురుషుడనియు దేహేంద్రియాదులను తన కాంతిచే ప్రకాశింపజేయుచు వాటికన్న వేరుగానున్నందున ప్రత్యగాత్మ అని నామములుకలిగి జాగ్రదావస్థలో ప్రకాశించుచున్నాడు.

అట్టివానిని మాయాశక్తి నిద్రారూపముగా నావరించగనే రాహువుచేత కప్పబడిన సూర్యచంద్రులవలెను

ప్రకాశత లేనివాడగును. అందువల్ల సకలేంద్రియములు శక్తి లేక సన్నగిలును. అందువల్ల ఆపురుషునకు అది నిద్రావస్థ అగుచున్నది. అందులో ఏ దుఃఖములు లేనందున సంప్రసాదావస్థ అనిపించుకొనును.

తరువాత తెలివిరాగానే ఆ మాయాశక్తి తొలగినపుడు మామూలుగా జాగ్రదవస్థ కలిగి ప్రకాశించుచు వెనకటి అవస్థలో సుఖముగా నిద్రించితినని తలచును. ఇందువల్ల సాక్షిస్వరూపుడైన పురుషుడు జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడవస్థలయందునూ ఒకడే యున్నాడనియు అతనికి దేని సంబంధము అపేక్ష లేనందున అసంగుడని ప్రకాశతకలవాడు గనక చిత్కల అని పేర్లుకలిగి యున్నాడు. నిత్యుడని తెలియుచున్నది.

ఏ పరమాత్మ ప్రతి శరీరమందునూ చిద్రూపముగా పురుషస్వరూపముగా నున్నాడో అట్టి ఆదిగురువగు దక్షిణామూర్తికి నమస్కారము.

శ్లో॥ బాల్యాదిష్వపిజాగ్రదాదిషు తథా
సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తాదను వర్తమాన మహమి
త్యంత స్ఫురంతం సదా।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం.
యోముద్రయా భద్రయా।
తస్మై శ్రీగురుమూర్తయేనమఇదం
శ్రీ దక్షిమూర్తయే ॥౭॥

తా॥ వెనుక శ్లోకమందుచెప్పిన నిత్యత్వమునే ఇందు విరివిగా చెప్పుచున్నారు. బాల్య యౌవ్వన కౌమార వార్ధక్యములనే అవస్థలయందును జాగ్రిత్స్వప్న సుషుప్తి తురీయ్యాములనే అవస్థలయందును; జనుల లోపలనున్న సాక్షి అనే పురుషుడు అన్ని అవస్థలయందు తాను ఏకాకారముగానున్నాడు. ఈ అవస్థలు వకదానిలోనొకటి లేవు. సాక్షి అన్నిటినీ తెలుసుకొనుచున్నాడు. గనుక నిత్యుడని తెలియుచున్నది. అందరికీ ఆసాక్షియే తమతమ నిజరూపము.

అది పరమాత్మలోకల ఒక అంశము. శరీరమనే ఉపాధిలో నున్నందున ప్రత్యగాత్మ అనియు, సర్వవ్యాపకమై అఖండాకారముగా నున్నది పరమాత్మ అని సంజ్ఞకలిగినది.

ఆ ఈశ్వరుడు దక్షిణామూర్తిగా చిన్ముద్రియు మౌనమూకలిగి అవతరించినారు. వారి చిన్ముద్రివలన తమ శిష్యులకు పరమాత్మస్వరూపమును తమతమ నిజరూపముగా సూచనచేయుచున్నారు. అది ఎట్లనగా అంగుష్ఠ, తర్జనీల చివరలుకలిపి తక్కిన మూడంగుళములు నిడువుగానుంచినపుడు చిన్ముద్రిఅగును. అపుడు అంగుష్ఠతర్జనీల మధ్యను వర్తులాకారము ఏర్పడును. అది అఖండాకారముగా నున్న చిదాకాశమును చూపించుచున్నదిగనుక ఈశ్వరుని ఆకారము ఇది ఇట్టిది అని ఈ చిన్ముద్రివల్ల సూచనచేయుచున్నది అని గ్రహించవలెను. అట్టి గురువులకు ఈ నమస్కారమని భావము.

శ్లో॥ విశ్వంపశ్యతి కార్యకారణతయా
స్వస్వామి సంబంధత
శ్శిష్యాచార్య తయా తథైవ పితృ
పుత్రాద్యాత్మనా భేదతః।
స్వప్నేజాగ్రతివా యఏషపురుషో
మాయాపరిభ్రామిత
స్తస్మైశ్రీగురుమూర్తయేనమఇదం
శ్రీదక్షిణామూర్తయే॥౮॥

తా॥ సకలజనులు సృష్టి స్థితి సంహారకర్తయగు మాయాశక్తికి వశులై భ్రమనుపొంది నిజరూపమును మరచి భేదజ్ఞానముకలిగి మాయాకల్పితమైన స్వప్నావస్థలోను ప్రత్యక్షముగా నున్న జాగ్రదవస్థలోనూ గూడ ప్రపంచమును భేదముగా చూస్తున్నారు. ఆ భేదదృష్టి ఎట్టిదనిన కార్యమని కారణమని తాను తమ ప్రభువు తండ్రి కుమారుడు గురువు శిష్యుడు అని భేదదృష్టి కలవారై యున్నారు. ఈ నామరూపములను విడిచినపుడు జ్ఞానదృష్టిచేత చూచినపుడు వీటియందు ఉన్న పురుషుడు ఒకడే. ఉపాధుల భేదమువల్ల ఇన్నివిధములుగా జలచంద్రుడువలె నగుపడుచున్నాడని తెలియును.

స్వప్నజాగ్రతలు సమానమని చెప్పినందున విశేషమేమనగా స్వప్నావస్థ మాయాకల్పిత ప్రపంచము (లేనిదని) జాగ్రతలో వాసనయు నిద్రావస్థలో కొంతయు కలసి స్వప్నము వాస్తవములు. జాగ్రన్నిద్రలు రెండవస్థలు. స్వప్నావస్థలో నున్నపుడు అది అసత్యమని స్వప్నమని ఎవరికిని తెలియదు.

అది నిజమనె భ్రమతో సుఖదుఃఖము లనుభవించును. జాగ్రతకలుగగానే వెనకజరిగిన చర్య స్వప్నముగనుక అస త్యము (లేనిది మాయవల్ల భ్రమకలిగినది) అని తలుస్తు న్నాడు. తెలుసుకొనుచున్నాడు. ఇందుకు నిజమా అబద్ధమా అని ఎవరినీ అడుగనక్కరలేదు. ఏ ప్రమాణమునూ కోరదు గనుక జాగ్రదవస్థయు దానిలో చర్య ప్రపంచముకూడ తుర్యావస్థ కలిగినపుడు నిజమైన బ్రహ్మజ్ఞానము కలిగినపుడు స్వప్నావస్థతో సమానమే యగును. ఇదియు మాయగానే తోచునుగనుక అట్టిజ్ఞానమునిచ్చే గురువులగువారికి ఈ నమ స్కారమని భావము.

శ్లో॥ భూరంభాస్య నిలోనలోం బరమహా
ర్నాథోహిమాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మక మిదం
యస్యైవ మూర్త్యష్టకం।
నాన్యత్కించన విద్యతే విమృశతాం
యస్మాత్పరస్మాద్విభో
స్తస్మై శ్రీగురుమూర్తయేనమఇదం
శ్రీ దక్షిణామూర్తయే॥౯॥

తా॥ ఇంతవరకు ఎనిమిది శ్లోకములచేతను సృష్ట్యాది నన్న నిర్గుణ బ్రహ్మస్వరూపము వర్ణించబడినది. ఇందు ప్ర పంచముకున్ను బ్రహ్మకు భేదములేదని తెలియుటకై సగుణ బ్రహ్మస్వరూపమును ఇందు వర్ణించుచున్నారు.

తా॥ సృష్టి క్రమముగా ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, సూర్యుడు, చంద్రుడు, జీవస్వరూప పురుషుడు, ఈ ఎనిమిదింటిచేతనూ చరాచరాత్మకమైన ఈ జగత్తు ప్రకాశించుచున్నది. ప్రపంచాకారమును పొందడమందు ఈశ్వరేచ్ఛకలిగినపుడు తానే ఈ ఎనిమిదివిధములుగా కారణ కార్యక్రమముగా అయినాడు.

ఈ జగత్తులో ఇంతకన్న వేరు కించిద్దైనా లేదు. ఇవి స్వతహా జడములు. వీటియందు బ్రహ్మశక్తి కలసినందున ప్రకాశించుచున్నవి. గనుక ఇది సగుణబ్రహ్మ స్వరూపము. ఈ రహస్యము విమర్శశక్తి కలవారికె తెలియును. సామాన్యులకు తెలియదు. గనుక ఈ ఎనిమిదిన్ని ఈశ్వరుని భవాద్యష్టమూర్తులని వేదమందు చెప్పబడినది. ఎవరు ఈ ఎనిమిది విధములుగా నున్నారో అట్టి గురుస్వరూపులైన దక్షిణామూర్తికి నమస్కారము.

శ్లో॥ సర్వాత్మత్వమితిస్ఫుటీకృతమిదం
యస్మాదముష్మింస్తవే
తేనాస్యశ్రవణా త్తదర్థమననా
ద్ధ్యానాచ్చసంకీర్తనాత్॥
సర్వాత్మత్వ మహా విభూతిసహితం
స్యాదీశ్వరత్వంస్వత
స్సిద్ధ్యేత్తత్పునరష్టధా పరిణతం
చైశ్వర్యమవ్యాహతం॥౧౦॥

## ఫ ల స్తు తి.

తా॥ ఈ స్తోత్రమందు పర్యవసానము [సారాంశము] సర్వాత్మత్వము అనగా జగత్తంతయు చిదాకాశరూపముతో పరమాత్మ పూర్ణముగా నిండియున్నదనియు, ఆత్మలేనిది కించిత్తైనా లేదని స్పష్టమగుచున్నదో అందువల్ల ఇది వినడము దీని అర్థానుసంధానము ఈశ్వరధ్యానము స్తోత్రము (పఠన) వీటివలన భక్తునకు సర్వాత్మత్వము ఈశ్వరత్వము జీవన్ముక్తి బ్రహ్మజ్ఞానము అప్రయత్నముగా వాటంతటవే సిద్ధించును.

తరువాత పైనిచెప్పిన అష్టమూర్తులు తానే అయినందున ఏ ప్రతిబంధకములు లేని జగదాకారమైన మహదైశ్వర్యము సిద్ధించును.

లోకమందుగల సకలకర్మలు తపస్సులు దానములు పుణ్యకర్మలు నిజమైన ఆత్మజ్ఞానము కలగడము ఫలముగా నున్నవి. ఈ స్తోత్రమువల్ల ఏశ్రమయు అక్కరలేకనే ఈశ్వరత్వమే సిద్ధించుచున్నందున అన్నిటికన్ననూ ఇది మోక్షేచ్ఛ గల పుణ్యపురుషులకు ముఖ్యసాధనముగా నున్నది.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్యవర్య శ్రీ
శంకరాచార్య భగవత్పాద విరచితం గురువంద
నాష్టకంనామ దక్షిణామూర్త్యష్టకంసంపూర్ణం
శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య జ్ఞానానంద
తీర్థావధూత స్వాములవారిచే రచించబడిన దక్షిణా
మూర్త్యష్టకమునకు ఆంధ్రభాషా వ్యాఖ్యానం
(తాత్పర్యం) సంపూర్ణం

శుభమస్తు.

# స్వరూపజ్ఞాన దర్పణము

## ఉపోద్ఘాతము

సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మ వస్తువు విచారించగా చతుర్దశ భువనములందునూ చిదాకాశ రూపములో వ్యాపించి జడములగు నామరూపములనే ఉపాధియందు సత్తాస్వరూపమై సర్వత్రా ప్రత్యక్షప్రమాణ సిద్ధముగా నున్నది.

ఈ పరమాత్మ ప్రపంచమునకు సర్వకారణ వస్తువు. సర్వశక్తి సంపన్నుడు. లోకత్రయముయొక్క సృష్టిస్థితిలయములనే క్రీడయందు దుద్యుక్తుడై తనయందున్న మాయాశక్తి చేత ఈ ప్రపంచమనే ఇంద్రజాలమును కల్పించి తాను అసంగ చిదూపుడై సాక్షిగా తటస్థుడైయున్నాడు.

వీరి సంకల్పమే మాయా స్వరూపమైన ప్రకృతిగా నున్నందున సృష్టిఅంతయు ప్రకృతి పురుష మేళనగాయున్నది. పురుషుడు సర్వజ్ఞుడైననూ మాయా సంబంధముచేత ప్రపంచ

మునందు తన స్వరూపమును మరచి వ్యష్టిభావము భేదజ్ఞానముకలవాడై స్వపరభేదముగల జీవత్వమును పొంది ప్రకృతిచేత ఆవరించబడి మాయావశుడై కర్తృత్వభోక్తృత్వములను పొంది సుఖదుఃఖములు కలవాడై జన్మ పరంపరల ననుభవించు చున్నాడు. ఈ ప్రపంచమునందు పురుషప్రకృతుల మేళనము రెండు విధములుగా నున్నది. ఎట్లన పురుష భాగాధికము, శక్తిభాగాధికము అని.ఇందులో ఒకటి అధికమైనపుడు రెండవది తగ్గి దానియందు లీనమైయుండును. అధికభాగ ధర్మము కలదగును.

ఈ రెండును శివశక్తులని, పురుష ప్రకృతులని, స్త్రీ పురుషులని, జ్ఞానాజ్ఞానములని, పుణ్యాపాపములని, సుఖదుఃఖములని ద్వంద్వములుగా నున్నవి.

ఇచట జ్ఞానమనగా ప్రపంచజ్ఞానము, అజ్ఞానమనగా జడము మూఢత్వము అని గ్రహించవలెను. ఈప్రపంచజ్ఞానము బ్రహ్మజ్ఞానముకు అంధత్వము వంటిది. ప్రపంచజ్ఞానమందు పండితులు బ్రహ్మజ్ఞానముగురించి అంధులుగా నున్నారు.

ప్రపంచమునందు జనులు పామరులని పండితులని బ్రహ్మవేత్తలని మూడు తరగతులుగా నున్నారు. అది ఎట్లనగా ప్రపంచము, తమ శరీరము మాత్రము నిత్యమని ఇంతకన్న వేరు ఏమియు లేదనే నమ్మకముగలిగి ప్రపంచజ్ఞానము గలవారు పామరులని;జీవేశ్వరులు పుణ్యాపాపములు స్వర్గ నర

కములు వేదశాస్త్రములు విధినిషేధములు సుఖ దుఃఖములు కలవనే భేదజ్ఞానముకలవారుపండితులనియు(వీరు బ్రహ్మ అనే వస్తువు కలదనే పరోక్షజ్ఞానము కలవారు ద్వైతులనియు) సకల ప్రపంచమున్ను తానును కాలత్రయమందునూ చిన్మయమనియు నామరూప భేదములు మాయా కల్పితములనియు తన నిజరూపము సాక్షిగానున్న చిద్రూపమని తెలుసుకుని సకలమును చిన్మయముగా భావించువారు బ్రహ్మవేత్తలనియు తెలుసుకొనవలెను.తమ నిజరూపమును తెలుసుకున్నవారు అపరోక్షజ్ఞానముకలవారని ప్రత్యక్షప్రమాణ సిద్ధమని సర్వోత్తములని తెలుసుకోవలెను. వీరిలో తక్కువ తరగతివారు ఎక్కువతరగతిని కోరడము సహజము. మరిన్ని ఉత్తమమైన బ్రహ్మజ్ఞానమును తెలుసుకోవడముకు సాధారణముగా వేదశాస్త్రములు ఉపనిషత్తులు అనుభవ వేత్తలగు పూర్వాచార్యులచే రచింపబడిన గ్రంథములు అనేకము లున్నవి.

అది పండితజనసాధ్యముగా నున్నందున వాటియందుతత్వము నానాజాతి పుష్పములందు మకరందమువలెను విరళముగా నిమిడియున్నది.

దానిని మధుమక్షికమువలెను సంగ్రహించి మధుకరండము (తేనెపట్టు)వలెను స్వరూపజ్ఞానదర్పణ మనే ఈ గ్రంథము రచింపబడినది.

ఇందు స్వరూప విచారణ ముఖ్యాంశము. ఇది యే బ్రహ్మజ్ఞానమగును. ఇందువలన బ్రహ్మపరోక్షవృత్తి సులభ

ముగా లభించును. ఇదియే బ్రహ్మవస్తువుగా నున్నది. ప్రత్యక్షముగా నున్న ప్రపంచము మాత్రము నిజమనే నమ్మికగల పామరజనులకు మనోవాక్కుల కగోచరమైన బ్రహ్మవస్తువును బోధించి సాక్షాత్కారమును చేయుటకు సులభ సాధనములు ఇందనేకములున్నవి. వాటిలో తురీయ్యావస్థ ముఖ్యాంశము. దానిపైది తురీయాతీతము కైవల్యము. ఆపైని పదవి లేదు. అదియే స్వస్వరూపస్థితిగాను బ్రహ్మవస్థగాను ఉన్నది.

ప్రపంచక సుఖములను పూర్తిగా మరిగిన జనులు తమకు ఇదియేచాలుననియు అసాధ్యమైన బ్రహ్మజ్ఞానము మాకు అక్కర లేదనియు చెప్పడమేగాక ఆవిచారణ వ్యర్థమని వృథా కాలముపోవుననియు దలతురు. వీరు ప్రపంచ జ్ఞానము పూర్తిగా కలవారైననూ వీరే అజ్ఞానులు మూఢ జనులుగా నున్నారు.

ఎట్లనిన పాలరుచి ఎన్నడూ తెలియక గంజిదాగువాడు తనకు పాలుఅక్కర లేదని ఇదియే పాలు అని (తలచును) నమ్మును. ప్రపంచసుఖములు నిత్యములనే వారి నమ్మిక. ప్రపంచమందు సమస్తజనులు ప్రపంచ సుఖములను కోరి అన్నివిధములనూ ప్రయత్నిస్తున్నారు. ఈసుఖములు వ్యయప్రయాసలుగలవి. క్షణికములు. అంతమందు ఉత్తర క్షణమందే దుఃఖ ప్రదములుగా నున్నవి. జన్మ పరంపరలను గలుగ జేయుచున్నవి.

ఇక బ్రహ్మానందసుఖము ఎట్టి కష్టమూ లేనిది. నిత్యమైనది. ఇంతటనుంచి జననమరణప్రవాహమునుండి తప్పించేది. సంపూర్ణము అభయము తృప్తియు కలది. ప్రతిజీవియూ సృష్ట్యాదినుంచి ఇంతవరకూ అనేక హీనజన్మలను పొంది పుణ్యావశము చేత ఈ మానవజన్మను పొందినారు. దీనియందు లాభనష్టములు గ్రహించే శక్తికలిగినందున ఇది ఉత్తమమైనది. ఇపుడు ప్రపంచమందు తమకన్న హీనజాతుల కష్టములను ఇదివరకు తమరనుభవించిన గర్భనరకములను తలచుకోక ఈ జన్మయే ఉత్తమమని తలచుచున్నారు. అన్నిజంతువులుకన్నను సూకరము హీనజాతి. అదియు తన పాపముచేత ఇట్టి హీనజన్మ కలిగినదని విచారించక తనకు ఈ జన్మయే సుఖముగా నున్నదని తలచును. ఈ జన్మతో చిరకాలము వుండతలచును. జీవులకు మానవజన్మ కలిగినందుకు ఫలమేమనగా తన వెనకటిజన్మలను ఆయాగర్భనరక బాధలను స్మరించుట లోకమందు జనులు అనుభవించుచున్న దుఃఖములను జూచి చర్వితచర్వణములుగా నున్న ఈ ప్రపంచక సుఖములందు విరక్తుడై శాశ్వతసుఖములను కోరడము అందునుగురించి విచారణచేయడము ఇది ఆవశ్యకమై యున్నది.

మనకు పూర్వులగు మాంధాతాదిచక్రవర్తులుగూడా సంసారమందున్న సుఖము లనిత్యములని తలచి మరలినవారై నిత్యమైన బ్రహ్మానందసుఖమునుపొంది స్వస్వరూపజ్ఞానము కలవారైరి. రామకృష్ణాద్యవతార పురుషులుగూడా ప్రకృతిసంబంధమైన మానవజన్మ కలిగినందున గురుజనుల వలన తత్వబోధను పొందిరి. మనకుగల సుఖము లెంత లోవో, ఎంత శాశ్వతమైనవో ఆలోచించవలెను. ఇట్టి ఉత్త

మపదవి మనకు లభించునా? అని ఉపేక్షా అశ్రద్ధ ప్రధమ విఘ్నములు ప్రయత్నించినయెడల ముక్తాపేక్ష (కోరిక) గల వారికి ఈశ్వరానుగ్రహము తప్పక కలుగును.

ఇందుకు దైవభక్తి పరోక్షజ్ఞానము బ్రహ్మావస్తు వనేది కలదనే నమ్మిక ప్రధమసాధనము. తన నిజారూపమెట్టి దని దనకు ఈసంసారబంధమెట్లుకలిగినదని విచారణరెండ వసాధనము. మూడవది తురీయ్యావస్తువు అనగా తురీయ్యావ స్తను తెలుసుకొనుట. ఈతురీయ్యావస్తనుగురించి॥

శ్లో॥ వక్తా శ్రోతా చదుర్లభః॥

అనగా చెప్పేవారు వినేవారుకూడా దుర్లభముగానే యున్నారు. అట్టి తురీయ్యావస్తను సులభముగా తెలుసుకుని సకలజనులు శాశ్వతసుఖమును పొందవలెననే కోరికతో ఈ గ్రంథమును రచించడమైనది. అట్టితురీయావస్తకు (తురీయ్యా జ్ఞానముకు పూర్వమందున్న జాగ్రత్స్వప్న సుషుప్తులనే అవస్తాత్రయము ప్రతిబంధకముగా నున్నది గాన వాటి నిజస్థితిని ముందుగా విచారించి అటుపైని తుర్యావస్తను విచారించవలెను. తురీయజ్ఞానముకలిగినపైని తుర్యాతతము కైవల్యము అనేపదవులు కరతలామలకములై సులభముగా నుండును. ఈతుర్యావస్థబ్రహ్మవేత్తల అనుభవములోనున్నది. సర్వజనానుభవములోనున్న జాగ్రదాద్యవస్థాత్రయములో జాగ్రతావస్థయే ఉత్తమమని లోకులనమ్మిక. ఇది నిజమైన బ్రహ్మజ్ఞానమును చూచుటకు గాఢమైన అంధత్వమువంటిది. జాత్యంధుడు సూర్యుడు లేనేలేడని చెప్పును. వానికిమరియొక అం

ధుడుసాక్షియైనట్లు జాగ్రదవస్థలోపండితుడు ఇంతకన్న వేరు లేదని చెప్పును. అట్టివారుతురీయమునుగురించి అంధులు గానున్నారు. ఈజాగ్రదవస్థన స్వానర్థములకు మూలమైనదిగా చెప్పతగినది గానబుద్ధిమంతులు జాగ్రత్స్వప్నసుషుప్తతురీయ తురీయ్యాతీతములు అనేపంచావస్థలను తెలుసుకునినపుడు ముక్తులుకాగలరు. అందువలన తురీయ్యతుర్యాతీతములు విరివిగా ఇందుచూపించబడినవి. దీనినిపూర్తిగాచదివిగ్రహించిన వారు ఈగ్రన్థముకన్న ఉత్తమముకాని సమానముగాని మరియొకగ్రంథములేదని ఎంచగలరు.

—♦ ఈ గ్రంథమందు వివరించినముఖ్యాంశములు ♦—

గురుశిష్యసంవాదము, సృష్ట్యాదినున్న బ్రహ్మవస్తునిర్దేశము, పరశివపరాశక్తులురాజదంపతులుగాసాక్షాత్కారము, మూలప్రకృతిఉత్పత్తి, మాయాజగన్నిర్మాణము అసంగ చిద్రూపునియన్దుజీవత్వారోపణము, స్వరూపజ్ఞానవిస్మృతికల్గుట, చిద్రూపుడు ప్రాకృతుడై సుఖదుఃఖానుభవము వైరాగ్యోత్పత్తి ఈశ్వరానుగ్రహముచేత మోక్షాపేక్షకలుగుట, పరాశక్తిగురురూపముతో తత్వోపదేశము బ్రహ్మజ్ఞానసాధనములనేకములుఉపదేశము, జాగ్రదాద్యవస్థలవివరము, తురీయ తురీయ్యాతీత కైవల్యపద సంప్రాప్తి, జీవన్ముక్తి విదేహ ముక్తుల వివరము.

ఈమొదలగు మోక్షసాధనములను ఒకరాజదంపతుల చరిత్రలో రహస్యార్థములుగా నిమిడ్చి ఈగ్రంథమును ము

క్త్రాపేక్షగలసర్వజనోప యోగమునుకోరి గద్యపద్యాత్మకము గా రచిన్పబడి ఆన్ధ్రభాషతో తాత్పర్యముకూడ యీగ్రన్థకర్త చేతనే వ్రాయబడినది. కాబట్టి సత్పురుషులైనవారు శ్రద్ధగా పరిశీలించి సార్థకమునకు తేగలందులకు వేడుచున్నాడను. సజ్జనులు ఇందుగలలోపములను సవరించ కర్తలు.

ఉపోద్ఘాతము సంపూర్ణము.

ఇట్లు విద్వజ్జనవిధేయుడు,

సింహాంభట్ల రామమూర్తిశాస్త్రి.

---

శ్రీ ర స్తు॥

శ్రీగణేశాయనమః॥

# స్వరూపజ్ఞాన దర్పణము

## ప్రథమ పాదః॥

శ్లో॥ అన్త ర్బహి ర్వ్యాప్య విరాజమానం । శ్రీసచ్చిదానంద
సులక్షణాస్పదం । అసత్యరూపాంధతమోపహారిణం
స్వరూపవిజ్ఞాన ఘనం స్మరామి॥ ౧॥

తా॥ బ్రహ్మాండములోపలను పైనిపిండాండములోపలనూ పైని వ్యాపించిప్రకాశించుచున్నట్టియు అజ్ఞానమనే దట్టమైన చీకటినిపోగొట్టేదియు నిర్మలమైనజ్ఞానమేఆకారము (శరీరము) గాగలదియు త్రికాలాబాధ్యమైన సత్తున్ను ప్రకాశమైన చిత్తున్ను పూర్ణస్వరూపమైనఆనందము ఈమూడులక్షణములుగల జగద్గురువగు పరబ్రహ్మను గ్రంథకర్తస్మరించుచున్నాడు॥

శ్లో॥ సింహంభట్ల సువంశ్యేన రామమూర్తిమనీషిణా
సర్వోపనిషదాం సారం సారః సద్గ్రంథసంచయాత్॥ ౨॥

శ్లో॥ ఉద్ధృత్య రచితంశుద్ధం స్వరూప జ్ఞానదర్పణం
అస్యావలోకనా త్సర్వే బ్రహ్మసాయుజ్యతాంగతాః॥ 3॥

శ్లో॥ చతుష్పాద సమాయుక్తం కలా షోడశసంయుతం
శివశక్తి సమాయోగ చారిత్రం పావనం పరం॥ ౪॥

తా॥ సింహాంభట్ల రామమూర్తిశాస్త్రిలవారు జ్ఞాన సాధనములుగా నున్న పూర్వాచార్యులచే రచింపబడిన గ్రన్ధ సముదాయము వల్లనున్న సకలోపనిషత్తుల యొక్కయు సారభూతమైన ముఖ్యాంశములను సంగ్రహించి నాలుగుపాదములుగాను పదియారుకళలుగాను ఏర్పరచి శివ శక్తిసామరస్యమును స్వరూపజ్ఞాన దర్పణమనే ఈగ్రంధమును రచించిరి. ఈగ్రన్థావలోకన చేసిన సకలజనులు పరబ్రహ్మ సాయుజ్యపదవిని పొందినవారే అని భావము.

శ్లో॥ సర్వేషా మితిహాసానా మయం సార ఉదాహృతం
శ్రుతేస్మిన్నిర్మలే యస్మా జ్జీవన్ముక్తత్వ మవ్యయం॥ ౫॥
శ్లో॥ ఉదేతి స్వయమేవాన్తరిద మేవ విచారయ
స్థితమేవాస్తమాయాతి జగద్దృశ్యం విచారణాత్॥ ౬॥

తా॥ అగుపడుచున్న యీజగత్తు ఈగ్రన్థవిచారణవల్ల మాయగాతెలిసి ఉండగానే లేనిదగుచున్నది. నాశరహితమైన జీవన్ముక్తి కలుగుచున్నది. కనుక సకల గ్రంధములకన్నను ఈగ్రంధము శ్రేష్టమైనది. స్వరూపజ్ఞానమును కలుగ చేశేది అని భావము.

ఈగ్రంధ విచారణచేసిన మోక్షేచ్ఛగల సకల జనులకు ఇతర గ్రంధాపేక్ష అక్కరలేకనే మోక్షసాధనములగు ఇతర ప్రయాసలులేకనే ప్రపంచముయొక్కయు తనయొక్కయు పరమాత్మయొక్కయు నిజము తెలిసి నిర్మలమైన జ్ఞానము కలవారై బ్రహ్మసాక్షాత్కారమునుపొందుదురు. నిజమైన తమపూర్వరూపమును గ్రహించగలరని భావము॥

# కథాప్రారంభః

ఘనప్రజ్ఞుడనే ఋషికుమారుడు తపోవనప్రవేశము

శ్లో॥ అస్తి కశ్చి ద్దృషివరస్థిత ప్రజ్ఞేతి విశ్రుతః॥
తస్య పుత్రోతికుశలో నిగమాగమ పారగః ॥ ౭॥

శ్లో॥ ఘనప్రజ్ఞేతివిఖ్యాత శ్చిన్తాక్రాన్తో నిరుత్సుకః
ఏవం విచారయామాస చిత్తతాపోపశాన్తయే॥ ౮॥

తా॥ పూర్వకాలమందు ప్రసిద్ధుడైన స్థితప్రజ్ఞుడనే ఒక మహాఋషిశ్రేష్ఠుడు గలడు. ఆఋషికి వేదవేదాంగములనభ్యసించిన ఘనప్రజ్ఞుడనే పేరుగల ఒకకుమారుడుండెను. అతను ఈప్రపంచమందు అనేకక్లేశములను పొందుచున్న జనులనుచూచి విషాదము వైరాగ్యము గలవాడై తనచిత్తమందు కలిగిన తాపము పోగొట్టుకునేఇచ్ఛగలవాడై ఈరీతిగావిచారించెను.

శ్లో॥ కోహంకథమిదంజాతం సంసారాడంబరం మహత్
కుతోబద్ధః కథం ముక్తో, భవిష్యామి నిరాకులః ॥౯॥

తా॥ నేను ఎవరు? ఈగొప్పదైన సంసారము (ఉద్రేకము) ఎందువల్లకలిగినది? ఎందువల్లబద్ధుడనైనాను? నిర్విచారమైన ముక్తినిఎట్లు నొందగలను? అని విచారించినవాడాయెను.

త్రికాలవేది అనేఋషి దరిశనము.

శ్లో॥ వైరాగ్య సత్య సంపన్నో గృహం త్యక్త్వా వనంయయా
తత్రా పశ్య ద్దృషివరం త్రికాల జ్ఞాన వేదినం॥ ॥౧౦॥

తా। వైరాగ్యము సత్వగుణముకలవాడై గృహమును విడచి తపోవనములోనికివెళ్లెను. కొంతదూరము వెళ్లగా త్రికాలజ్ఞానవేదిఅనే మహాఋషి అగుపడెను.

శ్లో॥ దృష్ట్వా ప్రదక్షిణీకృత్య దణ్డవత్ప్రణతో భువి
సనామాగ్రేస్థితస్తూష్ణీం స్వోదన్తం వక్తుముత్సుకః॥ ౧౧॥

తా॥ ఆమహాఋషినిచూచి ఆయనకు ప్రదక్షిణంచేసి సాష్టాంగ నమస్కారముచేసి తనచర్యను చెప్పకోరికగలవాడై వారికెదురుగా కూర్చుండెను॥

శ్లో॥ స్వాగ్రేస్థితం ఋషిర్దృష్ట్వా పరిమ్లాన ముఖాంబుజం
మోక్షాభిలాషిణంబాలం తమువాచముదాన్వితః॥ ౧౨॥

తా॥ గురువగుఆమహాఋషి విచారముచే వాడినముఖము న్ను మోక్షమందుకోరికయు గలతమఎదురుగానున్న ఆబాలునిచూచిసంతోషముకలవారై పలుకుచున్నారు.

—♦ గురువు శిష్యుని ఓదార్చుట ♦—

శ్లో॥ వత్స మాభీర్భజస్వాస్థ్యం కృతకృత్యో భవిష్యసి
తవాభిలషితం జ్ఞాతం జీవన్ముక్తో భవిష్యసి ॥౧౩॥

తా॥ ఓ చిన్నవాడా భయపడకుము. భయము విడవతగినది. నీవువచ్చినపని తెలిసినది. నీవు కృతకృత్యుడవు కాగలవు. జీవన్ముక్తి కొద్దికాలములోనే నీకు సిద్ధించగలదు.

శ్లో॥ పురాతనం చేతిహాసం వక్ష్యామి శ్రుణు పుత్రక
స్వరూపజ్ఞాన విజ్ఞాన భోగ మోక్ష ప్రదం నృణాం॥౧౪॥

తా॥ ఓ శిష్యుడా తన నిజరూపమును తెలిపేదిన్ని బ్రహ్మజ్ఞానమును ఇచ్చేదిన్ని మనుష్యులకు ఏకకాలమందు

ఈజన్మమందే భోగమును మోక్షమును ఇచ్చేదిన్ని ఒక పూర్వకాలపు చరిత్రను చెప్పుచున్నాను వినుము. సృష్ట్యాది వృత్తాంతమని సూచన.

## —♦ స్వయంప్రకాశుడనే రాజుచరిత్ర ♦—

శ్లో॥ స్వయంప్రకాశ నామేతి విఖ్యాతో భువిభూసురః ।
అస్తికశ్చిన్మహాసత్వో రాజాభూద్రాజ్య ధారణాత్ ॥౧౫॥

తా॥ లోకమందు బలపరాక్రమములుగల స్వయంప్రకాశుడనే ఒకబ్రాహ్మణుడు గలడు. అతను రాజ్యమును పాలించుటచేత రాజనివాడుకకలదు. అందువల్ల రాజైనాడు.

## —♦ విమర్శశక్తి అనేరాజుభార్యా చరిత్ర ♦—

శ్లో॥ విమర్శశక్తినామ్నైకా కన్యాతస్యానురూపిణి
సర్వలక్షణసంపన్నా జ్ఞానవిజ్ఞానపారగా ॥౧౬॥
శ్లో॥ తాముద్వాహ్య గృహస్థోభూద్రాజావిఖ్యాతకీర్తిమాన్।
తయోర్జీవిత చారిత్రం శృణు వక్ష్యామిపావనం ॥౧౭॥

తా॥ ఆరాజుతో సమానమైనదిన్ని సకల సులక్షణములు గలదిన్ని ప్రపంచజ్ఞానము బ్రహ్మజ్ఞానము గలదిన్ని విమర్శశక్తి అనే పేరుగల ఒక స్త్రీ గలదు. దానిని ఆ రాజు వివాహము చేసుకుని గృహస్థు అయినాడు. ఆరాజ దంపతుల జీవితకాలచర్యను వినుము. అది వినినందున అజ్ఞానము పోయి నిత్యసుఖమును స్వరూపజ్ఞానము మోక్షమున్ను లభించును.

## —♦ గురుశిష్యుల ప్రశ్నోత్తరములు ♦—

గద్య॥ ఋషికుమారః భగవన్ మమాభిలషితం శ్రవణం వినా భవద్భిః జ్ఞాతమివభాతి తస్మాన్మమ మనోరథం సఫల మితిమన్యే భవంతః త్రికాలవేదినః తధాపిబాలభావేనకించి త్ప్రష్టుకామోస్మి ॥౧౮॥

తా॥ ఋషికుమారు డడుగుచున్నాడు. ఓ గురువర్యా నేను నాకోరికను చెప్పకమునుపే తమరు నాయభిప్రాయమును తెలుసుకున్నారు. గాన నాకోరికసఫలమగును అని తలుస్తాను. అయినను తెలియనివాడను గాన కొంచెము అడగవలసినది గలదు.

గ॥ గురుః వత్స యస్సంశయస్సోవశ్యం ప్రష్టవ్యఏవకుమారః భగవన్‌చిత్తశాంత్యర్థం వనమాగతోస్మి రాజకథా శ్రవణేన మనుమనశ్శమనం కథంవినోదాయ వనం నాగతః తయోస్సంబంధః కథం తయోః వివాహానం తరం వృత్తాంతం శ్రోతుమిచ్ఛామి. ॥౧౯॥

తా॥ గురువు శిష్యునిచూచి నీకుగల సంశయము తీరే లాగు నవశ్యము అడగవలసినదేను. సంశయమువిడువతగినది.

శి॥ గురువర్యా నామనస్సు స్థిరపడక జ్ఞానముకోరి వనమునకు వచ్చితినిగాని వినోదముకోరకు రాలేదు. రాజ కథా శ్రవణమాత్రమున నామనశ్శాంతి ఎట్లగును? అయినను ఆరాజు ఎవరు? ఆ స్త్రీ ఎవరు? వారికి సంబంధమెట్లుకుదిరినది? వారి వివాహానంతర వృత్తాంత మేమిజరిగినది? అంతయువిన గోరుచున్నాను.

## —◆ చిత్త చాంచల్య కారణం ◆—

శ్లో॥ గురుః॥ శ్రుతి తాత్పర్య మఖిల మబుధ్వా భ్రామ్యతేజడః
వివేకీత్వఖిలంబుధ్వా తిష్టత్యానంద వారిధౌ ॥౨౦॥

తా॥ గురువుచెప్పుచున్నారు. ఓశిష్యుడా మన్దబుద్ధిగల వాడుశ్రుతులతాత్పర్యమునుసరిగా తెలుసుకోనక ధైర్యము లేని వాడై తిరుగును. శృతులు అధికారిభేదమునుద్దేశించి బహువిధములుగానుత్పన్నమైనందున అనేకభేదములుగా అగుపడుచున్నవి. వివేకముగలవాడు సకలమును తెలుసుకుని సమన్వయముచేసుకుని ఆనందసముద్రమందుండగలడు॥

## —◆ వివేకలక్షణము విచారణ ◆—

శ్లో॥ స్వవిచారణయైవాశు శామ్యత్యన్తర్మనోమలం
కోహంకథ మిదంకింవాకథంమరణజన్మనీ
విచారయాన్తరేనత్వం మనోనిర్మలతాంవ్రజేత్ ॥౨౧॥

తా। హేవత్స నీలోనీవు ఆలోచించుము. ఎట్లనగా నేనెవరు ఈజగత్తుఎట్టిది జననమరణములు ఎట్లువచ్చినవి అని నీస్వరూపముయొక్క నిజమును తెలుసుకునేకొరకు విచారించుము. ఈవిచారణవలన నిజము తెలిసి మనస్సుతనంతటతానే నిర్మలమగును॥

శ్లో॥ విచారేణపరిజ్ఞాత స్వభావస్యసతస్త్వ
మనస్వరూప ముత్సృజ్యశమమేష్యతవిజ్వరం
తిష్ఠ దేవమనోరూపంపరిత్యక్ష్యతి తేనఘ ॥౨౨॥

తా॥ అట్టివిచారణచేత నీనిజరూపమును తెలుసుకుని నీవుసద్వస్తువే అగుచున్నావు. అపుడునీమనస్సు తనరూపమును విడచి సంతాపరహితమైన శాంతిని పొందుచున్నది. నీవునిజమును తెలుసుకోగానే నీమనస్సుండగానే తనరూపమును విడచుచున్నది నీవుచూడగలవు.

శ్లో॥ అహంబద్ధోవిముక్తస్స్యా దితికస్యాస్తి నిశ్చయః
నాత్యన్తమజ్ఞోనోతజ్జః సోస్మిఞ్ఛాస్త్రేధికారవాన్ ॥౨౩॥

తా॥ ఆత్మవిచారణకు అధికార్లనుచెప్పుచున్నాను వినుము. నేనుబద్ధుడను. సజ్జన సహవాసముచేతను శాస్త్రజ్ఞానముచేతను ముక్తుడనుకాగలను అనికోరికగలవారును కేవలమూర్ఖుడుకానివాడును పూర్ణమైన బ్రహ్మవేత్తకానివాడును ఈగ్రన్థవిచారణకు అధికార్లుగానున్నారు॥

శ్లో॥ కోహంకథమిదందోష స్సంసారాఖ్యఉపాగతః
న్యాయే నేతి పరామర్శోవిచారఇతికథ్యతే ॥౨౪॥

తా॥విచారణఅనగా నేనుఎవరు? ఈసంసారమనేదోషమెట్లు కలిగినది అనివిచారణ, మరిన్నితనబుద్ధిచేత పశ్చాత్తాపముగలవాడై యథార్థమును తెలియకోరుటయే విచారణ అనబడును.

శ్లో॥ శాస్త్రావబోధామలయాధియా పరమపూతయా
కర్తవ్యఃకారణజ్ఞేన విచారోవిశదాత్మనః॥ ౨౫॥

తా॥ శాస్త్రజ్ఞానమువల్లనిర్మలమైనట్టిన్ని స్వచ్ఛమైనట్టిన్ని సర్వకారణ వస్తువును తెలిసినట్టి గురువుల సన్నిధిని ఈవిచారణ చేయతగినది. అట్టివిచారణ నిర్మలాంతఃకరణగలవారికి లభించును.

శ్లో॥ రాజన్ స్వాత్మవిచారోఽయం కోఽహంస్యాదతిరూపకః
చిత్తదుర్ద్రుమబీజస్య దహనేదహనస్మృతః॥౨౭॥

తా॥ ఓశిష్యుడా నేనుఎవరుఅనేదియే ఆత్మవిచారణ. ఈవిచారణ చిత్తమనే దుర్వృక్షముయొక్క బీజమునుదహించుటకు అగ్నివంటిది॥

గ॥ శ్రీగురో స్వవిచారణేన కథమాత్మలాభః కిమాయాతమితి? లోకః, అజ్ఞః, వివేకీ, పండితః, బ్రహ్మవేత్తా, ఇతిచాతుర్విధ్యం స్థూలశరీరాభిమానీవిశ్వోఽజ్ఞః (పామరః) జీవభావాపన్నస్సూక్ష్మశరీరాభిమానీవివేకీజీవః, కారణశరీరాభిమానీపండితః (ప్రాజ్ఞః) మహాకారణంనామతురీయ్యంతదభిమానీబ్రహ్మవేత్తా అహంసాక్షీతియోహి (తమాత్మానంవేత్తి) సముక్తః ॥౨౮॥

తా॥ గురువును శిష్యుడడుగుచున్నాడు. ఈవిచారణవల్ల ఫలమేమి? గురువు. ఓయీశిష్యుడావినుము. లోకము నాలుగువిధములుగానున్నది. ఎట్లనగా స్థూలదేహమే నేననేవాడు పామరుడు. సూక్ష్మశరీరమనే జీవుడను నేననేవాడు మధ్యముడు. కారణశరీరము నేననేవాడు ప్రాజ్ఞుడు. తుర్యాధిపతి అనేసాక్షిని నేననేవాడు ముక్తుడు. వాడుబ్రహ్మత్వమును పొందినవాడని తెలుసుకోవలెను॥

## —మనస్వరూపము—

యోగవాసిష్ఠే.

శ్లో॥ ప్రబుద్ధానాం మనోరామ బ్రహ్మైవేదం హి నేతరత్
సర్వశక్తి పరంబ్రహ్మ నిత్యమాపూర్ణమద్వయం॥ ౨౯॥

తా॥ హే శ్రీ రామచన్ద్రా బ్రహ్మ సకల శక్తులుగల వాడు. నిత్యుడు. సర్వపరిపూర్ణుడు. అన్తకన్న అధికమైన మరివకవస్తువు లేదు. ప్రాజ్ఞులయొక్క మనస్సు బ్రహ్మమే కాని వేరుకాదు. అనివసిష్ఠు రాములవారి కుపదేశించెను॥

శ్లో॥ నతదస్తినతస్మిన్యద్విద్యతే వితతాత్మని । యయోల్లసతిశ
క్త్యాసా ప్రకాశం సోధిగచ్ఛతి॥ ౨౭॥

తా॥ ఆత్మ సర్వవ్యాపకము గల్గినదని తెలియ బడు చున్నది. అట్టి ఆత్మయన్దుమనస్సనే వేరువస్తువు లేదు. ఆత్మ తనయందుగల ఏవస్తుశక్తితో కలసి ఉల్లాసమును పొందునో ఆశక్తియే ప్రత్యక్షమగును.

శ్లో॥ చిచ్ఛక్తిః బ్రహ్మణోరామ శరీరేషూపలభ్యతేస్పందశక్తి
శ్చ వాతేషు దార్ఢ్యశక్తిస్తథోపలే॥ ౨౮॥

తా॥ వాయువందుస్పందనశక్తియు, శిలలయందు కాఠిన్యము, సకలశరీరములయందు నామభేదములుగల్గి బ్రహ్మశక్తియగుచిచ్ఛక్తియు ఈలాగున అంతటనూ వ్యాపించిఉన్నది. బ్రహ్మకన్న మనస్సని వేరువస్తువు లేదు. మనస్సనెడిదియు బ్రహ్మకలగానే ఉన్నదని భావము॥

శ్లో॥ యథాణ్డాన్తర్జలే బర్హి స్సర్వోస్తీదం తథాత్మని
ఫలపత్రలతా పుష్ప శాఖావిటపమూలవాన్
వృక్షబీజే యథావృక్షస్తథేదం బ్రహ్మణిస్థితం॥ ౩౦॥

తా॥ నెమలిగుడ్డులోనున్న జలమందు నానారంగులు గల నెమలి ఏలాగు యిమిడియున్నదో, వృక్షబీజమందు ఫల పుష్ప లతా శాఖలుగల వృక్షమూలము ఏలాగు యిమిడి యున్నదో, ఆలాగుననే బ్రహ్మయందు ఈ జగత్తును, జగత్తు

యందు బ్రహ్మయు యిమిడియుండిరని తెలుసుకోవలెను.

శ్లో॥ సఆత్మా సర్వగో రామ నిత్యోదితమహావపుః
యన్మనాఙ్మననీం శక్తిం ధత్తేతన్మన ఉచ్యతే॥ ౩౦॥

తా॥ ఓరామచంద్రా పరమాత్మ సర్వదా సర్వ వ్యాపకమైయున్నది. ఒకప్పుడు మనశ్శక్తితోకలసినపుడుమనస్సనేపేరుకలిగినదిగాన మనస్సుపరమాత్మయెగాని వేరుకాదు. పరమాత్మసంకల్పమెమనస్సని తెలుసుకొనుమనివసిష్ఠుచెప్పెను.

శ్లో॥ రామాస్యమనసోరూపంనకించదపిదృశ్యతే।
నామమాత్రాదృతేవ్యోమ్నోయథాశూన్యజడాకృతేః॥౩౨॥

తా॥ ఓరామా! యీమనస్సుకు కించిత్తైననూ రూపములేదు. శూన్యమైనఆకాశముకు నైల్యముమాత్రమువలె శూన్యమేఅని తెలుసుకోవలెను.

శ్లో॥ సాధోయదేతదర్థంసం ప్రతిభాసం ప్రధాంగతం
సతోవాప్య సతోవాపి తన్మనోవిద్ధినేత్తరత్॥౩౩॥

తా॥ ఓరామా ఈమనస్సనే ప్రసిద్ధి (వాడుక)పరంపరాగతము. పరోక్షమందుగాని అపరోక్షమందుగాని వస్తుజ్ఞానమేదికలదో దానినే మనస్సని వాడుచున్నారు. కాని అంతకన్న వేరులేదు॥

శ్లో॥ యదర్థప్రతిభానంత న్మన ఇత్యభిధీయ్యతే
అన్యన్నకించిదప్యస్తి మనోనామకదాచన ॥౩౪॥

తా॥ పదార్థములను స్మరించుటయే మనస్సు. అంతకన్న మనస్సనే వస్తువు కించిత్తైనా వేరుగా మరియొకటి లేదు. నామమాత్రము మనస్సని వాడుకగలదు॥

శ్లో॥ సంకల్పనం మనోవిద్ధి సంకల్పాత్తన్నభిద్యతే
యత్రసంకల్పనం తత్ర మనోస్తీత్యవగమ్యతాం॥ ३४॥

తా॥ సంకల్పమేమనస్సని తెలుసుకోవలెను. మనస్సు సంకల్పము కన్న వేరు కాదు. ఎచట సంకల్పమున్నదో అచట మనస్సువున్నదని తెలుసుకోవలెను.

## —♦ మనస్సు పేర్లు ♦—

శ్లో॥ సంకల్ప మనసీభిన్నే నకదాచన కేచన
అవిద్యాసంస్మృతిశ్చిత్తం మనోబన్ధోమలంతమః
ఇతి సంకల్పజాలస్య నామాన్యేతానిరాఘవ
సంకల్పజాలేగళితే స్వరూపమవశిష్యతే॥ ३౬॥

తా॥ సంకల్పముకు మనస్సుకును భేదములేదు. అవిద్య, సంసారము, చిత్తము, మనస్సు, బంధము, మలము, తమస్సు, ఇవన్నియు మనస్సుపేర్లు. సంకల్ప సమూహము పోగా స్వరూపముమాత్రము మిగులును.

ఇతి శ్రీమత్పద వాక్యప్రమాణ పారవార పారీణధురీణ - సత్యానన్ద నాథ గురు కరకమల సంజాత శ్రీజ్ఞానానన్ద నాధాపరపర్యాయ శ్రీదక్షిణామూర్తిచరణ సేవాలబ్ధప్రతీ భాభాసుర సింహంభట్ల రామమూర్తివిద్వద్విరచిత బ్రహ్మజ్ఞానసాధనోపాయభూత - స్వరూపజ్ఞానదర్పణే ప్రథమఃపాదః
సంపూర్ణం

# ద్వితీయ్యా పాద ప్రారమ్భః

## —♦ రాజకథా ప్రారంభః ♦—

గద్య॥గురుః॥ వత్స! రాజదంపతీచారిత్రేణైవ తే సర్వం సంపాదితంభవిష్యతి. కృతకృత్యోభవిష్యసి. సరాజాఆదావేకఏవ ॥శ్రు॥ ఏకమే వాద్వితీయంబ్రహ్మ సర్వం ఖల్విదంబ్రహ్మ నద్వితీయోస్తి ॥౩౭॥

తా॥గురువు ఓ ఋషికుమారా వెనుకటి రాజదంపతుల యొక్క వృత్తాంతమును చెప్పుచున్నాను వినుము. అందువల్ల నీవు సమస్తమును తెలుసుకుందువు. కృతకృత్యుడగుదువు. సృష్ట్యాదిని ఒకరాజు ఏకాకిగా అవతరించెను. మొదట అతను ఒక్కడేకాని రెండవ పదార్థము లేదు. అతను సర్వ పరిపూర్ణుడు. సచ్చిదానంద స్వరూపుడు. ఇట్లుండగా ఇతనిని శృతులుగూడ చెప్పుచున్నవి॥

శ్రు॥ సోబిభేత తస్మాదేకాకీబిభేత ద్వితీయాద్వైభయంభవతి యస్మాన్మదన్యంనాస్తి కుతోభయం ॥౩౮॥

తా॥ ఆరాజు నలుదిక్కులనూ చూచి భయమును పొందినాడు. ఎక్కడనైననూ రెండవవస్తువ యున్నచోట భయము కలుగుట సహజము. ప్రస్తుతము నాకన్న వేరు వస్తువు లేదు. నాకు భయము ఎందుకు కలుగవలెనని మనస్సు దృఢపర్చుకొని వివేకము కలవాడాయెను. అందువల్ల ఆ భయము పోయెను॥

శ్రు॥ తస్మాదేకాకీనరమతే ఆత్మానంద్వేధావిభజ్య పతిశ్చ పత్నీచాఽభవత్ ॥౩౯॥

తా॥ తరువాతఆరాజకుమారుడు ఏకాకినిగాన ఉత్సాహముకలుగనేరదని ఆలోచించి క్రీడార్థము సంకల్పము గలవాడై తనఆత్మను రెండుభాగములుచేసి వామభాగముస్త్రీరూపముగాను,దక్షిణభాగము పురుషరూపముగాను, తేజోమయాకారముగలవారాయెను. వారిరువురును భార్యాభర్తలైరి. ఆపురుషుడు స్వయంప్రకాశుడు అనేరాజు.ఆస్త్రీ విమర్శశక్తి అనిభావము.

—:రాజుకు క్రీడాసంకల్పము.:—

శ్రు॥సోకామయత బహుశ్యాం ప్రజాయేయేతి సఈక్షత॥౪౦॥

తా॥ అప్పటికిభావి జగదావిర్భావకాలము సమీపించినందున ఆరాజుకు నిస్తరంగ సముద్రమందు తరంగములు పుట్టినట్లు నిర్వికార బ్రహ్మస్వరూపమందు అనేక రూపములు గల బ్రహ్మాండాకారమును పొందుదామనే తనలో నిమిడి ఉన్న ఇచ్ఛాశక్తి ఉద్రేకించినది. అపుడు భార్యనుచూచెను.

గ॥విమర్శశ్శక్తి; రాజన్?సర్వసంపూర్ణోసి,అసంగచిద్రూపః॥ ఆవయోరానందఏవ స్వరూపం స్వసంకల్పమేవ బంధహేతురితి ప్రసిద్ధం,భవదంశఏవ విమర్శరూపాహమస్మి.ఆవయోరంతరంనాస్తి, ఆత్మారామోయదిపరమసుఖమితిమన్యే

శ్రు॥ ప్రకాశస్యాత్మనో జ్ఞానే విమర్శం సమపేక్షతే।
తస్మాద్విమర్శే విస్ఫూర్త్యా ప్రకాశం సమపేక్షతేతి॥

తా॥ రాజాభిప్రాయమును భార్య అయిన విమర్శశక్తి తెలుసుకుని ఓ రాజా! నీవు సర్వపరిపూర్ణుడవు, అసంగుడవు, చిద్రూపుడవు, ఆనన్దమే స్వరూపముగాగలవాడవు. నీకుయిటువంటిసంకల్పము పుట్టకూడదు. నీకు నేనును నాకు నీవును సహాయులము. అంతర్ముఖుడవై ఆత్మక్రీడ గలిగియుందుము. సంకల్పము బంధహేతువుఅని ప్రసిద్ధికలదు గాన మనము అన్యోన్య సహాయము గలవారము. ఆత్మయన్దుజ్ఞానము కలగ గానే విమర్శను అపేక్షిస్తున్నది॥ విమర్శస్ఫురించినప్పుడు జ్ఞానము నపేక్షిస్తున్నదిగాన వీటికి ద్వంద్వము సహజము, అని భార్యమందలించిననూ రాజు చిత్తము మారలేదు॥

గద్య॥ ఇతిభార్యయా విమర్శశక్త్యా విజ్ఞాపితోఽపి భావికాల ప్రేరితో న విరరామ॥౨౧॥

తా॥ ఈరీతిన రాజుకు తనభార్యయగు విమర్శశక్తి బోధించిననూ భావిజగదుత్పత్తి కాలము తటస్థించినందున తన సంకల్పమును మళ్ళించుకొనలేదు.

గ॥ విమర్శశక్తిః, (స్వగతం;) భావికార్యానుసారేణ ప్రభూణాం మహతాంచిత్తవృత్తిః భవితవ్యంభవత్యేవ. ఏతావదేవ మమోచితం. భావిజగన్నిర్మాణం సర్వం మిథ్యారూపేణ రాజసంకల్పానుసారేణ భవితవ్యం. మమ ఛాయాశక్త్యా సర్వం సాధయామీత్య చింతయత్ ॥౨౨॥

తా॥ విమర్శశక్తి అయిన భార్య రాజు అభిప్రాయమును చక్కగా తెలుసుకుని, సత్పురుషులకు భావికార్యానుసారముగా సంకల్పము గలుగును, కాగల కార్యము కాక మానదు. కాన రాజ సంకల్పానుసారముగా మిథ్యా

మునుచూపించవలెను గాన నాచ్ఛాయను ఈపనిమీద నియమించి భర్తతో నేను తటస్థముగా నుండెదను. రాజుమాయా గ్రస్తుడైనపుడు తిరిగి స్వరూపమును బోధించవలెనని తనలో తాను ఆలోచించుకొనెను॥

## —ఐంద్రజాలికా స్త్రీ ప్రవేశము.—

గ॥ తతో రాజదంపతీ సన్నిధౌ ఇంద్రజాలికా స్త్రీ ప్రాదురభూత్. రాజా తామాకారేణైవ జాలికేతి మత్వా, విస్మితో దేవీం నిరీక్ష్య ప్రియే మమసంకల్పానురూపా జాలికా ప్రవిష్టా, మమ వినోదాయభవతు॥ ౮౩

తా॥అంతట రాజదంపతులు ఎదురుగా ఒక ఇంద్రజాలిక, స్త్రీ ప్రత్యక్షమైనది. దానిని రాజుజూచి ఇది ఇంద్రజాలమును చూపించేదని గ్రహించి ఆశ్చర్యముతో భార్యను చూచి ఓప్రియురాలా! నాకోరికప్రకారము వినోదార్థము ఈస్త్రీ వచ్చినది గాన దీనివిద్యనుచూచి వినోదింతమనెను.

గ॥ దేవీ,రాజానం రహస్యస్థలం నీత్వా; రాజన్? సా మాయికా,బహువిధమాయాభిర్వంచయిత్వా భవన్తం స్వవశంనయతి.వ్యసనాసక్త స్సర్వాపదామాలయో భవతి.తస్మాత్కౌతుకం బంధహేతుర్భవతి. కించిత్పారితోషికం దత్వా తాంనయస్వే త్యవోచత్॥౮౪॥

తా॥ రాజభార్య రాజును రహస్యస్థలమునకు పిలచి ఈస్త్రీ మాయావి, అనేకమాయలు చూపించి మనుష్యులను స్వవశము చేసుకొనును. దానిమాయకు లోబడినపుడు అనేక

ఆపదలు సంభవించును గాన వ్యసనాసక్తి కూడదు. కొంచెము బహుమానమిచ్చి దానిని పంపుమని బోధించెను.

గ॥ రాజా, ప్రియే? అహంధైర్యవా న్నానయా వంచితవ్యః జాలికే? కుతఆగతాసీత్యవ్రోచత్. జాలికా, స్వామిన్? ప్రభూణాం సంకల్పఏవాఽవాసస్థానమస్మాకం. జన్మ కల్పే కల్పేరాజ్ఞాం వినోదాయభవతిహి॥౪౫॥

తా॥ రాజు భార్యనుచూచి నీవు పిరికిదానవు, స్త్రీవి, అందువల్ల అధైర్యమును పొందుచున్నావు. మేము పురుషులము ధైర్యశాలులము. దీని మాయలకు లోబడేవారముకాము. అని భార్యను సమాధానపరచి ఇంద్రజాల స్త్రీనిచూచి, ఓజాలికే? నీవు ఎచటనుండివచ్చితివని అడిగెను. మాయావి చెప్పుచున్నది. హేరాజన్? ప్రభువుల సంకల్పమే మాకు వాసస్తానము. ప్రతికల్పమందును రాజులవినోదార్థము మా ఉత్పత్తి అని చెప్పెను॥

గ॥ రాజా, జాలికే? కిమాశ్చర్యకరం త్వయాక్రియతే. జాలికా, రాజన్? మాయా జగన్నిర్మాణం తత్రబహూని విచిత్రాణి ప్రదర్శయామి. సర్వమోహాసీతి మమనామ, సార్థకం కర్తుం సమర్థాస్మీతి. "బహూని నామరూపాణి సృజామి విసృజామిచ॥"

తా॥ రాజు, మాయావినిచూచి నీవు ఏమేమిచిత్రములు చూపించగలవని అడిగెను. స్వామీ! మాయాప్రపంచనిర్మాణము, అందు అనేకచిత్రములు, ప్రభువుల సంకల్పానుసారము సర్వము ప్రత్యక్షము చేయగలను. సర్వమోహిని అనినాపేరు. సార్థకముగా నాశక్తిని చూపించగలను. అనేక

నామరూపములను సృష్టిలయములను చేయగలను, అని పలికెను.

శ్లో॥ తతోజాలికా రాజాజ్ఞాం గృహీత్వా ప్రణమ్య రాజన్ భవంతౌ దంపతీ ద్వంద్వమేకమేవ. భవదన్యత్ కిమపినాస్తిఖలు భవత్సంకల్పాదేవ మమాగమనం. అహంద్వితీయ్యా మాయావినీ స్థానమాపన్నా మద్విద్యాబలేన భవత్సంకల్పసహాయేన । బహూనిరూపాణిసృజామి. విసృజామి చ ఇత్యుక్త్వా రిక్తహస్తద్వయం ప్రదర్శ్యవస్త్రేణాఛాద్య అభిమన్త్య్రాఆచ్ఛాదితవస్త్రంవిసృజ్య రాజపురోభాగే ఏకంచిత్రపటం । కరాటత్రయం।-కందుకద్వయం।- తాళద్వయం । పురోభాగే -ప్రత్యక్షీకృతా॥ర 2॥

తా॥ ఆఇంద్రజాలికాస్త్రీ రాజాజ్ఞనుపొంది నమస్కరించి ఓ రాజా! మీదంపతులుఇద్దరుభేదము లేనివారు. ఏక శరీరముగలవారు. మీకన్న రెండవవస్తువ లేదు. మాయానిర్మాణకర్తనేన నేను రెండవస్థానమందున్నాను. ఇన్తకన్న వేరులేదు. నేను సర్వమోహినిని. నాపేరు సార్థకముగా చేయగలను. నావిద్యాబలముచే మీసంకల్పమును ప్రత్యక్షముచేయుటయే నాశక్తిచూడండి. నావద్ద శూన్యహస్తములుతప్ప వేరు ఏపదార్థమున్ను లేదు. చూడుడు అనిహస్తద్వందమును విప్పిచూపించెను. పిమ్మట వస్త్రమాచ్ఛాదించి మంత్రాక్షతలుజల్లి వస్త్రమును విసర్జించగా ఒక చిత్రపటము -మూడుభరిణలు రెండుకందుకములు (బంతులు) రెనుతాళపు చిప్పలు ప్రత్యక్షమైనవి॥

## —♦ ఇంద్రజాల ప్రారంభము ♦—

గ॥ మోహినీ, రాజన్? జాగరూకోభవేత్యుక్త్వా కరాటత్రయ ముఖం నిరస్యతత్రస్థ చూర్ణత్రయం, శ్వేత, రక్త,నీల వర్ణం దర్శయా మాస. తచ్చూర్ణత్రయాత్కించిద్గృహీత్వా రాజపురోభాగేఽన్తరాళే । అవాకిరత్ ।తచ్చూర్ణప్రభావేన రాజదంపతీ । హంసదమ్పతీ అభూతాం ॥ చిత్రపటంప్రసారయామాస । త్రైలోక్యంమిథ్యాజగన్నిర్మాణమభవత్ ।కందుకద్వయ । మాకాశేక్షిపత్ సూర్యచంద్రౌ భూత్వాకాశే భ్రామితౌ. తాళద్వయ మప్యాకాశేవ్యసృజత్ సర్వేషాం మానవానాం పక్షద్వయంభూత్వా కాలంనయతః॥౨౮॥

తా॥ మోహినిస్త్రీ ఓ రాజా! జాగరూకత గలిగి చూడుము అని-చెప్పి-తనవద్దనున్న భరిణలమూతలుతీసి అందున్న తెలుపు నలుపు ఎరుపు రంగులుగల చూర్ణమును కొంత హస్తమందుంచుకొని రాజు ఎదురుగా ఆకాశమందు చల్లినది . ఆచూర్ణప్రభావముచేత - రాజదంపతులు హంసద్వంద్వమాయెను. చిత్రపటము, ప్రసరింపగా త్రైలోక్యములతోగూడిన - ప్రపంచము ప్రత్యక్షమాయెను - ఆ బంతులు రెండు పైకి విసరగా । సూర్యచంద్రులు ప్రత్యక్షమై ఆకాశమందు తిరుగుచున్నారు. తాళపుచిప్పలు రెండును పైకివిసరగా సకలజనులకును కనురెప్పలై కాలమును గడుపుచున్నవి॥

—◆ ౨. మాయాజగన్నిర్మాణము॥ ◆—

గ॥ తథా, రాజసభాయాంమూర్తిత్రయంఇంద్రాద్యష్ట దిక్పాలాః, సర్వేదేవగణాః సప్తర్షయో రంభోర్వశ్యాది దేవ కన్యకాస్సర్వాః రాజానుగ్రహాకాంక్షిణ్యః ప్రత్యక్షాబభూవుః రాజసభా సకలసామంతమన్వితా ప్రకాశమానాబభూవ॥ ౪౯॥

తా॥ ఆకాలమందు చూర్ణప్రభావముచేత, చిత్ర పటప్రసారణముచేత, రాజసభలో త్రిమూర్తు లున్ను, ఇన్ద్రాద్యష్ట దిక్పాలురున్ను, ఇతర దేవగణములును, దేవకన్యకలు, రాజానుగ్రహామునుకోరి ఉన్నట్లు ప్రత్యక్షమై నది. రాజసభ సకలసామంతులతోగూడి రాజానుగ్రహామును కోరుచు ప్రకాశించుచున్నది॥

—◆ హంసరూపమును పొన్దిన ఆరాజదంపతులు మాయవలన హంసద్వంద్వమగుట ◆—

గ॥ తతః, రాజదంపతీ అన్యోన్యావలోకనంచక్రతుః, విస్మృతఇవపరిజ్ఞాంపారివ్య. రాజా పత్నింవీక్ష్యప్రియే? మోహి న్యా స్వరూపమన్యథాభవత్. పత్నీ రాజన్? పూర్వమేవ మయాఉక్తం సర్వం భవతునామ భవంతఃఅసంగచిద్రూ పా, భవతః వికారానస్పృశంతీతి ఆవయోః. ఏతద్రూపం సంకేతరూపేణ జ్ఞానకాంక్షిణా ముపాసనాయోగ్యం శివశక్తి ద్వద్వం భూయాత్॥ ఇతిపతి మాశ్వాసయామాస॥

శ్లో॥ శాన్తాన్తం శక్తిగస్యోక్తాతదంతం. బీజముచ్యతే అనయోస్సామరస్యంహి హంసఇత్యభిధీయ్యతే॥ ౫౦॥

తా॥ పిమ్మట రాజదంపతులు అన్యోన్యముఖావలోకనచేసుకుని నిద్రనుంచి మేల్కొనినట్లు తెలివితెచ్చుకుని రాజు భార్యనుచూచి ప్రియురాలా! మోహిని శక్తిచేత మనమిద్దరము హంసలమైనాము యిటుపైని యేమి చేయవలెనని అడిగెను. స్వామీ! ఆదిని నేను చెప్పినపుడు మీరు వినలేదు. అయినను మరి యేమియు తొందరలేదు. మీరు అసంగచిద్రూపులు మీకు యీ మాయలు యేమియు అంటవు. ఈరూపము, బ్రహ్మవేత్తలకును, జ్ఞానమును కోరువారికిని, సంకేతరూపముగా శివశక్తిద్వందమును బోధించును. అని రాజుతో భార్య పలికెను. శవర్ణముపైది షకారము దానిపైది సకారము [శక్తిస్వరూపము] దానిపైనున్న హకారముశివస్వరూపము గానుండి ఈ హంసద్వంద్వముయోగులకు ఉపాసన మన్త్రమగునని బోధించెను. అహమనేది హంసమన్త్రమేను. ఆత్మమంత్రముగా నుండునని భావము॥

గ॥తతః రాజపత్నీ, రహసి మోహినీంవీక్ష్య, సఖే! తవవిద్యాబలం ప్రదర్శితం ఉచితమేవ. లోకేసామాన్యస్త్రియః పతిం సంపూర్ణంవంచయన్తి, అస్మాదృశానాంతథా భర్తృవంచనం నోచితమిత్యుక్త్వా. మోహినీ, స్వామినీ! తదపరాధఏవ క్షంతవ్యం తదపిరాజ్ఞః స్వసంకల్పఏవతథాపరిణతః. తథాపి భవదాజ్ఞానుసారేణ కరోమీత్యుక్త్వా పున శ్చూర్ణం కించిద్గృహీత్వారాజద్వంద్వే అవాకిరతు. ద్వే తచ్చూర్ణ ప్రభావేన విస్మృత్య స్వస్వరూపం సామాన్యపురుష ఇవ మాయాగ్రస్తః సంసారీవ త్రైలోక్యం సరాజా భార్యయా సహ రాజ్యకార్యాణికుర్వన్న పాలయద్రాజ్యం॥

తా॥ తరువాత రాజపత్ని రహస్యమందు మోహినిని చూచి, ప్రియే! నీ విద్యాబలమును చూపించితివి సంతసించినాను. కాని, లోకమందు సామాన్యస్త్రీలవలెను మనము పతి వంచన పూర్తిగా చేయకూడదు.

మమ్మును హంసలుగా చేస్తివి యిది బాగు లేదని అడిగెను. మోహిని,విని ఓ తల్లీ! నా అపరాధము క్షమింపుము. వారి సంకల్పమే అటుల పరిణమించెను. అయినను మీ అభిప్రాయముచొప్పున చేయుగలను అని తిరిగి చూర్ణము కొంచెము తీసి రాజదంపతులపై చల్లగా వారు హంసరూపములను విడచి మనుష్యరూపము గలవారైరి. పామరులువలె సంసారమగ్నులై రాజ్యమును పాలించుచుండిరి. అన్ను రాజు స్వరూపవిస్మృతికలవాడై ఉండెను. విమర్శ శక్తిస్వరూప జ్ఞానము కలదైనను భర్తననుసరించి ఉండెను.

గ॥ ఋషికుమారః, శ్రీగురో! రాజదంపతీచారిత్రం చిత్రతరం భాతి. ఆదావేక ఏవ,తతో,దంపతి,తతఃజాలికాస్త్రీ తయాఇంద్రజాలం ప్రదర్శితం. కౌ, రాజదంపతీ! కుతః కా ఇంద్రజాలికా! తత్వంబ్రూహీతి॥ ౪౩॥

తా॥ ఋషికుమారుడు గురువునుచూచి స్వామీ! రాజ దంపతులచరిత్ర వింతగానున్నది. మొదట ఒకరాజుమాత్రముండుట, తరువాత దంపతులగుట, తరువాత మోహినీస్త్రీ పుట్టి ఇంద్రజాలము జూపుట, ఇదంతయూ జూడ వింతగా యున్నది. ఆ రాజ దంపతులెవరు? ఐంద్రజాలినియెవర్తె? నిజము జెప్పుము; అని అడిగెను.

—— ♦ గురువు రాజదంపతులు శివశక్తులని బోధించుట ♦ ——

గ॥ గురుః,కుమార! శృణు తద్రాజచారిత్రం.అద్భుత మేవ స్వయ మేక ఏవ తత్సర్వం,స్వసంకల్ప ఏవ తథాపరిణతః, తదేవలోకత్రియ సృష్టిక్రమః, సరాజాపరమపురుషః, కార్యార్థం స్వసంకల్పః॥ సోనిత్యః, స్వప్రకాశః, విమర్శరూపిణీతస్యేచ్ఛాశక్తిః, ప్రాదుర్బభూవ. శక్తి, శక్తిమతోర్భేదోనాస్తి. జాలికామూల ప్రకృతిఃసామాయా విమర్శశక్తేః ఛాయా రూపా॥ ౫౮॥

శ్రు॥ ద్వే విద్యే వేదితవ్యే, విద్యాచాఽవిద్యాచ, అవిద్యయా మృత్యుంతీర్త్వా, విద్యయా మృతమశ్నుత ఇతి, తే,విద్యాఽవిద్యారూపిణావితి । ౫౫॥

తా॥గురువు ఋషికుమారునికి చెప్పుచున్నాడు.ఓచిన్నవాడా వినుము. ఆ రాజదంపతులకథ చిత్రమైనదే? అదంతయు రాజసంకల్పమే అట్లు పరిణమించినది. అదియేప్రపంచముయొక్క సృష్టిక్రమము. ఆరాజపురుషుడు పరమాత్మస్వరూపుడు నిత్యుడు, స్వయంప్రకాశమానుడు, పూర్ణుడు. అతని ఇచ్ఛాశక్తియే విమర్శశక్తిగా విభాగమైనట్లు ప్రత్యక్షమైనది. శక్తికి శక్తిగలవానికి భేదములేదుగాన వారిరువురు ఏకరూపమేను. వారికన్న ద్వైతము,రెండవవస్తువులేదు. మాయాశక్తి, విమర్శశక్తియొక్కఛాయ. అదియే మూలప్రకృతిగా,అదియే ద్వైత వస్తువుగా నగుపడుచున్నది. ద్వైతమంతయు దానివికారముగాన ద్వైతము (భేదకల్పన)మాయామయము. అద్వైతమే వాస్తవము. ఆమోహినిచే రచించబడిన ఇంద్రజాలమే

మాయయొక్క ప్రభావము, ప్రపంచాకారముగా అగుపడు చున్నది. కాని వాస్తవము (నిజమైనది) అంతయూ చిన్మయమే. అని తెలుసుకొనుము॥

౯॥ ఋషికుమారః భగవన్ మాయాస్వరూపం బ్రూహీతి.

తా॥ శిష్యుడు మాయా స్వరూపమును చెప్పమని అడిగెను

—*మహామాయాస్వరూపము*—

గురుః॥ శ్లో॥ జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హిసా
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి॥

తా॥ పరాశక్తి, సంకల్ప సహాయము గలదియు, ప్రపంచసృష్టిస్థితి సంహారకారణమైన మోహినీ స్వరూపమైన మాయాశక్తి, జితేంద్రియులగు జ్ఞానులమనస్సును కూడ బలాత్కారముగ హరించి (స్వాధీనపరచుకుని) వారికిగూడ మోహమును కలుగజేయుచున్నది॥

పరమేశ్వరః॥"ఇయం సాపరమాశక్తిః
మన్మయీ బ్రహ్మరూపిణీ।
మాయా మమ ప్రియానంతా
యయేదం మోహితం జగత్॥"

తా॥ పరమేశ్వరుడు ఋషుల కుపదేశించుచున్నాడు. ఓ మహా ఋషులారా! సకల ప్రపంచము దేనిచే మోహమును పొందుచున్నదో ఆ యీ మాయాశక్తి మాకు ప్రియురాలైన పరాశక్తి చ్ఛాయా స్వరూపముగనుక బ్రహ్మశక్తిగానే ఉన్నది. గనుక నాకు ప్రియురాలు। దీనికిని ఆద్యంతములు లేవు. పరమేశ్వర సంకల్పమే మాయకు స్వరూపమని భావము.

సృష్ట్యావిర్భావ కాలమందు పరమాత్మ స్వరూపుడగు పురుషునకు జగద్రూపమును పొంద సంకల్పము కలుగగానే పరాశక్తి గ్రహించి సృష్టి స్త్రీ వ్యక్తియందున్నందున తన ఛాయను (వెనకచెప్పిన మోహినీని) మూలప్రకృతిని; సృజించినది. దాని స్వరూప మెట్టిదనిన జనన మరణరహితమైనది. ఏకాకినీ. గుణత్రయ సంకలిత స్వరూపము. చరాచర జగత్తును పుట్టించేది. ప్రతివస్తువందునూ గుణభేదముకలది. సకల జగన్మోహనమైన ఆకారముగలది. ఇదియే ప్రథమ సృష్టి; మూలప్రకృతి అని భావము.

బ్రహ్మయందు సకల శక్తులు ఉన్నందున మాయాశక్తి ఉద్రేకమును పొందినదని, ముందుకలిగే సృష్టిఅంతయు దీనివల్ల పుట్టినందున, మాయాస్వరూపమని భావము.

శ్రు॥ మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతుమహేశ్వరం
అస్యా వయవభూతాంతు వ్యాప్తం సర్వమిదం జగత్॥

తా॥ సకల వేదశాస్త్రములందు ప్రసిద్ధమైన మాయ అనేదే మూలప్రకృతి. పరమాత్మయందే కలిగినందున, సగుణ స్వరూపుడగు ఈశ్వరుడు దీనికి ప్రభువు. వీరి ఇద్దరివలన గుణత్రయము, పంచభూతములు, ౨౪ తత్వములు, పుట్టి లోకమంతయు వ్యాపించియున్నవి. లోకమందు గల నామరూపములు ప్రకృతిభాగములు, జడములు. వాటియందున్న సత్తా, అస్తి భాతి ప్రియములు, ఈశ్వరునివి. ఇట్లు వీరిరువురిచే వ్యాప్తమై జగత్తు ఉన్నదని భావము.

శ్రు॥ ద్వేవిద్యే వేదితవ్యే ఇతి హాస్మయద్బ్రహ్మ విదోవదంతి।
పరాచైవా పరాచ। తత్ర పరాబ్రహ్మ విద్యారూపా।
అపరా ప్రపంచాకారా॥ సా మాయా॥

తా॥ విద్యా, అవిద్యా, అని విద్యయు, మాయాశక్తియు రెండురూపములుగలదని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. అవి పరాఅని అపరాఅని నామములుకలవి. అందులో పరాశక్తి నిర్గుణము. బ్రహ్మాకారముగలది. బ్రహ్మవిద్యఅని వాడుక. రెండవదిఅపరా; జగదాకారముగా నున్నది. అదియే, మాయాశక్తి, మూలప్రకృతి, మోహినీ, నామములుగలది. పరాశక్తి మోక్షమునిచ్చేదిగా, మోహినీత్రివర్గము నిచ్చేదిగా నున్నారని బంధకారణమని భావము.

గ॥ ఋషికుమారః॥ భగవన్-మాయాయాః పరిహారో స్తివానవా॥ అస్తిచే ద్బ్రూహీతి॥

తా॥ ఋషికుమారుడడుగుచున్నాడు॥ గురువర్యా ఇట్టి మహామాయకు పరిహారము కలదా లేదా? ఉన్నయడల శల, వియ్యవలెను.

మ హా మా యా ప రి హా రః

వేదాన్తపంచదస్యాం॥ శ్లో॥ తుచ్ఛా నిర్వాచ నియ్యాచ। వాస్తవీ చేత్యయంత్రిధా॥ జ్ఞేయామాయా త్రిభిర్బోధైః శ్రౌత యౌక్తికలౌకికైః॥

తా॥ ప్రపంచమందు జనులు, పామరులు; పండితులు; బ్రహ్మవేత్తలు, అని మూడువిధములుగా నున్నారు. మాయ అనేది వీరికి మూడువిధములుగా బోధఅగుచున్నది. శ్రుతిని

నమిశ్రం బ్రహ్మవేత్తలకు, స్త్రీవేషధారిఅయిన పురుషుడు వలెను తుచ్ఛముగానున్నది. పండితులకు అనిర్వచనియ్యముగా నున్నది. పామరులకు వాస్తవముగానున్నది. ఇట్లు బోధ అగుచున్నది.

శ్లో॥ సతిదీప ఇవాలోకః సత్యర్క ఇవ వాసరః।
సతిపుష్ప ఇవామోద శ్చితిసత్యాంజగత్తథా॥ కథాం

తా॥ మాయకు ప్రపంచమే ఆకారము
నిజమని తోచుటయే మాయాకార్యము. ప్రపంచచరిత్రను సత్యములతో కలసిఉన్నది. నామరూపములు మాయ ముల| వాటికి చైతన్యమునిచ్చె సత్తా బ్రహ్మభాగము. లేనపుడు నామరూపములు పనికిరావు. ఈ అర్థమునే పై శ్లోకము తెలుపుచున్నది. దీపమువల్లనే పదార్థజ్ఞానము; సూర్యునివల్లనే పగలని రాత్రిఅని వ్యవహారము; పుష్పము వల్లనె పరిమళము; ఎట్లు కలుగుచున్నదో అటులనే బ్రహ్మ భాగమైన చిత్కలవల్లనే, జగత్తు ఉనికి, అని గ్రహించవలెను.

శ్లో॥ ప్రతిభానత ఏ వేదం నజగత్పరమార్థతః॥
జ్ఞానదృష్టౌ ప్రసన్నాయాం ప్రబోధ వితతోదయే॥

తా॥ ఈజగత్తు జలఘటములందు సూర్యచంద్ర ప్రతిబింబములువలెను, అద్దమందుగల పర్వతాదికమువలెను, అగుపడుచున్నది; గాని వాస్తవముకాదు. నిర్మలమయిన జ్ఞానముకలిగి ఆత్మానాత్మల విచారణవల్ల బ్రహ్మ తత్వము బోధ కలవారికి ప్రపంచము మాయ అని తెలియును. మాయాస్వరూపము పామరులకు నిజమని తోచును.

శ్లో॥ సర్వం బ్రహ్మేతియస్యాంతర్భావనాసాహిముక్తిదా।
భేదదృష్టి రవిద్యేయం సర్వథా తాం విసర్జయేత్॥

తా॥ ప్రపంచజ్ఞానము [భేదబుద్ధి] అజ్ఞానమును మాయయుబంధకారణము, గనుక నామరూపములందున్న సత్తా బ్రహ్మ కలగనుక సర్వము బ్రహ్మాకారముగా, చిన్మయముగా ...ించుట, ముక్తిని కలుగజేయును. అన్నివిధముల భేదబు

శక్తి ... నిర్గు...ము.

వాసుక. రెండవది ...

మాయాశక్తి ...ద్యతే తద్ధి పదముక్తుయ్యముచ్యతే।
పరాశక్తి ...జాతేయమితి తేద్విజ మాస్తువిచారణా।
సునా... మాంకథ మహం హాన్మి త్యేవం తేస్తు విచారణా॥

తా॥ జ్ఞానవంతుడగువాడు భేదభావనను విడచి సకలము బ్రహ్మాకారముగా జ్ఞానదృష్టిచేత భావించిన బ్రహ్మత్వము సిద్ధించును. ఓయీ! ఈ మాయ ఏరీతిని పుట్టినదనే విచారణము మానుము. దీనిని ఎట్లు నసింపజేయుడమనివిచారించుము.

శు॥ భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయ్యంతే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరాపరే॥

తా॥ భూలోకమందున్న మనుష్యులకన్న దేవతలు శ్రేష్ఠులు. దేవతలందరికన్ననూ, బ్రహ్మ, విష్ణు, రుద్రులు, అధికులు. చిద్రూపుడగు పరబ్రహ్మ వద్ద, అత్రిమూర్తులుఅల్పులు. అట్టిబ్రహ్మకల తనయందు సాక్షిస్వరూపముగా నున్నదనియు, అదియే తననిజరూపమనియు, శరీర జీవాదులు మాయాకల్పితములనియు, తెలుసుకున్నప్పుడు జీవత్వముః నిజమనే గ్రంధి

విడిపోవును. సకలసంశయములు వదలును. పునర్జన్మకు కారణము లగు, ఆగామి; సంచితము; ప్రారబ్ధము; లనే కర్మత్రయమూ నశించును. అందువలన బ్రహ్మత్వము సిద్ధించునని భావము. ఇదియంతయు శిష్యుడు విని రాజవృత్తాంతము - అటుపైని యేమి జరిగినదని అడిగెను.

రాజు పుత్రకాముఁడగుట.

గ॥ శిష్యః- భగవన్? తదనంతరం- రాజ కథాం బ్రూహీతి॥

తా॥ శిష్యుడు- స్వామీ! తరువాత రాజచరిత్రను చెప్పవలెనని ప్రార్థించెను.

గురుః॥ తతోరాజా ప్రాకృతఇవ రాజ్యం పాలయన్ పుత్రహీనః, తద్విచారేణ విరక్తః, రాజ్యకార్యేషు, గృహకృత్యేష్వపి విరక్తోభూత్. తదారాజ్ఞీ రాజానం వ్యసనినం జ్ఞాత్వా, రాజన్? కిము. విరక్తి ఇవభాసి? రాజా, ప్రియే? సంసారవృక్షస్య పుత్రప్రాప్తిరేవ ఫలం. తద్భాగ్యం మయానప్రాప్తం. సర్వం వ్యర్థమివ దృశ్యతే ఇతి॥౫౯॥

తా॥ తరువాత రాజు ప్రాకృత జనుంవలెను, మాయామోహితుడై, రాజ్యము నేలుచు పుత్రహీనుడైనందున, విరక్తుడై యుండఁగా, భార్యచూచి ఓరాజా! విరక్తి హేతువేమి యనిఅడిగెను. రాజు, సంసారమందు పుత్రోత్పత్తియే ఫలము "శ్రు॥ అపుత్రస్య గతిర్నాస్తి" అని యున్నది కాబట్టి సంతానము లేనందున విచారముగా నున్నది, అని రాజుచెప్పెను.

గ॥ భార్యా; రాజన్! పౌరుషేణసర్వం సాధ్యం భవతి.

"శ్లో॥ యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం
తత్సర్వం తపసా ప్రాప్యం తపోహిదురతి క్రిమః"
తపసా సర్వం సాధితం భవతి. పరమేశ్వరం
తపసా తోషయ. తే వాం ఛ్ఛాసిద్ధి ర్భవతీత్యుక్తా॥౬౦॥

తా॥ రాజుభార్య, రాజునుచూచి ఓ స్వామీ పురుష కారముచేత సర్వము సాధ్యమగును. పౌరుషములేనిది ఫలము లభించదు. తపస్సుచేత సర్వము లభించునుగానపరమేశ్వరునిగు రించితపస్సుచేసితి రేని మీకోరిక సఫలమగును అనిచెప్పెను.

గ॥ రాజా పుత్రికామీ సన్నీశ్వరముద్దిశ్య తపః కర్తుం దీక్షాంప్రాప్య షాణ్మాసం హావిష్యాశీ షణ్మాసం ఫలాహారీ తప్యతే ॥౬౧॥

తా॥ రాజు, పుత్రకాముడై ఈశ్వరునుద్దేసించి తపస్సున రాంభించెను ఆరుమాసములుహావిస్సుభక్షణయు ఆరుమాస ములు ఫలహారముచు చేసి తపస్సుచేయగా॥

రాజు శివునింగూర్చి తపస్సు చేయుట.

గ॥ వర్షాంతే పరమేశ్వరః ప్రసన్నోభూత్వా, రాజన్? భవదాశయం జ్ఞాతవానస్మి. తవ తపసా తుష్టోస్మి. తవ పుత్రి లాభోభవతి. మద్దర్శనేన అస్మిన్నేవజన్మని తత్వోపదేశం ప్రాప్య, జీవన్ముక్తోభవిష్య సీత్యుక్త్వాంతర్ధాన॥ రాజా॥ దీక్షాంతే ఈశ్వరదర్శనాదికం పత్న్యైప్రోవాచ. సాశ్రుత్వా మనసి మోహినీ ప్రభావం సంస్మృత్య విస్మితా. పూర్ణ కామస్యాపి ఈదృశ మోహపాశః! ఇతరేషాం కాగణనా ఇతిమత్వా; రాజన్? తపసాశాంతోసి కృతకృత్యః. స్వస్థోభవే త్యాశ్వాసయామాస॥౬౨॥

తా॥ వర్షాంతమందు రాజును పరమేశ్వరుడు ప్రసన్నుడై ఓరాజా! నీమనోభీష్టము నాకు తెలిసినది. కొద్దిరోజులలో నీకు పుత్రలాభమగును. నీతపస్సునకు చాలా సంతోషించితిని. నాదర్శనమువలన కొద్దికాలములోనే నీవు తత్వబోధను పొంది జీవన్ముక్తుడవు కాగలవని ఈశ్వరుడు అంతర్ధానమాయెను. తరువాత రాజు భార్యకు ఈశ్వర వరదానము మొదలగు సంగతులు చెప్పెను. రాజుభార్య తన మనస్సులో: పూర్ణకాముడు, సచ్చిదానందపురుషుడు, అయిన యిట్టిరాజుకున్ను మోహినీప్రభావము ఇన్నిపాట్లు పెడుతున్నది యితరపురుషులకు లెఖ్ఖయేమి! అని ఆలోచించి మాయా మోహామహిమకు విస్మయమంది హేరాజా! తపస్సుచేత శ్రాంతులైతిరి వరమును పొందితిరి యికపైని స్వస్థతను పొందుదురుగాక అని ఉపచరించెను.

## రాజుకు పుత్రోత్పత్తి.

గ॥ గురుః॥ కుమార! శృణు. ప్రకృతిమహిమానం, వర్షమధ్యే ఈశ్వర వరప్రభావేన రాజమహిషీ గర్భవతీబభూవ. దశమేమాసి సుపుత్రో జాయత. రాజా పుత్రోత్పత్తింశ్రుత్వా స్నాత్వా, పుణ్యాహవాచనాదికం నిర్వర్త్య, ఆనందమగ్నోభూత్. ఏకాదశేహని జాతకర్మాదికం కృత్వా కులదీపకఇతినామకరణం కృత్వా, పూర్ణకామః రాజ్యమపాలయత్ ॥౽౩॥

తా॥ కుమారా! మాయాప్రభావము వినుము. రాజుకు ఈశ్వరవరప్రాప్తి అయిన సంవత్సరములోగా రాజుభార్య గర్భముధరించెను. పదియవమాసమందు సుపుత్రుడు జన్మిం

చెను. రాజు పుత్రజన్మమువిని ఆనందభరితుడై స్నానముచేసి పుత్రోత్సవాదికములు జర్పి ఆనందముగా నుండెను. పదకొండవరోజున, జాతకర్మ, నామకరణములు, జరిపెను. కులదీపుడని పేరుపెట్టి సంతోషయుక్తుడై రాజ్యపరిపాలనాసక్తితో కాలముగడుపుచుండెను.

రాజకుమారుని చోరులపహరించుట.

గ॥ తత ఏకదా సూతికాగృహాచ్చోరైః రాజపుత్రో పహృతః. అరణ్యవాసీ నీషాదకులజో కశ్చిత్ పంచమః అపుత్రోభూత్. తస్మైవిక్రీతస్సశిశుః పంచమైః పుత్రవాత్సల్యేన పాలిత స్తస్థౌ. రాజాచోరవృత్తాంతం శ్రుత్వా చిన్తాక్రాంతః విరక్తోభూత్.

తా॥ తరువాత వకసమయమందు రాజగృహములో చోరులు ప్రవేసించి సూతికాగృహమందున్న బాలునపహరించి అరణ్యమందున్న ఛండాలులగు బోయవాండ్లలో ఒకడు సంతానముకొరకు విచారించుచుండగా వానికి నాశిశువును విక్రయించిరి. ఆరాజకుమారుడు ఆ బోయవానిచేత పుత్రవాత్సల్యతతో సంరక్షించబడుచుండెను. రాజు చోరులవలన జర్గినపనికి చింతాక్రాంతుడై విరక్తుడై యుండెను.

ఇంద్రజాలమహిమ

గ॥ ఋషికుమారః భగవన్ స రాజా పరమపురుష ఇతి తస్యభార్యాజ్ఞానస్వరూపిణీ, విమర్శశక్తిరిత్యాదాభవద్భిః ప్రతిపాదితంతస్య తద్దైవసుఖం తద్దైవదుఃఖం కథమాయాతం ఈశ్వర వరలబ్ధః పుత్రః కథంచోరై రపహృతః ఇంద్ర

జాలమోహః యావత్ప్రసరతి తస్య పరిమాణో నాస్తివా మాయా పరిభావం శ్రోతుమిచ్ఛామి॥ అనుగృహ్య వక్తవ్య మితి ప్రార్థయామాస॥౬౫॥

తా॥ ఋషికుమారుడు గురువుని అడుగుచున్నాడు.

ఓ గురువర్యా! ఈరాజు పరమపురుషుడని, రాజు భార్య జ్ఞానస్వరూపమైన విమర్శశక్తిఅని, ముందుశెలవిచ్చితిరి. అట్టిరాజునకు అపుడేసంతోషము అపుడేదుఃఖము కలుగుటకు కారణమేమి? ఇంద్రజాలమువల్ల కలిగిన మోహమునకు రాజు ఎందుకు వశుడైనాడు? ఈసంశయము నాకు నివారణ చేయుమని శిష్యుడు ప్రార్థించెను.

౭॥ గురుః॥ సాధవో నస్సుషావాదినః. రాజవృత్తాంతం పూర్వోక్తం సర్వంసత్యమేవ. సపురుషఃపురాణఏవ. సావిమర్శ రూపిణ్యేవ. సరాజా ఇంద్రజాలపరిభావేణా క్రాంతః. స్వరూప విస్మృతింప్రాప్తః.సరాజా పరమాత్మస్వరూపః ఏకఏవ.మాయా ప్రభావేణజలచంద్రవదుపాధివశాద్బహుధాదృశ్యతేతన్మాయా దృష్టిః జ్ఞానదృష్ట్యా వాస్తవత్వా దద్వైతైకఏవాఖండాకారః విభాతి. అజ్ఞానదృష్ట్యా జగత్సత్య మివభాతి. తదేవ మాయా బలం జ్ఞానదృష్ట్యా మృగతృష్ణవత్ జగన్మిథ్యైవ. యావత్ స్వస్వరూపం యథార్థం సర్వశరీరేషు సాక్షిరూపేణస్థితం తురీయ్యం నజానంతి తావన్మాయయా బద్ధాఏవ. యదాస్వాంత స్థం తురీయ్యం సాక్షిణం స్వస్వరూపమితిజ్ఞాస్యతి తదైవముక్తః తదేవ మాయాయా అవధిః. మాయాపరిభావేణ కంఠస్థస్వ మణింవిస్మృత్య తదర్థంపర్యటనమితి తద్దైవ జన్మపరాంపరం

ప్రాప్య నరో భ్రమతి. శ్రు॥ "మనఏవమనుష్యాణాం కార ణం బన్ధమోక్షయోః" తస్మాదాత్మా స్వసంకల్పేనైవ ఇం ద్రజాలకౌతుకః సంసారరూప మాయాకాన్తః వనగఃఇవ బద్ధః. స్వరూపవిస్మృతో భ్రాంత్ ॥౬౬॥

తా॥ గురువు శిష్యునకు ఉపదేసిస్తున్నాడు. ఓయీ సాధువు!బంధమూడదు. ఆ రాజు పురాణపురుషుడు. చిత్కళా స్వరూపుడు. అతని భార్య విమర్శశక్తి అగును. జలచంద్రుడు వలెను మాయాప్రభావముచేత ఒకడే అనేకజీవులుగా ప్రకా సిస్తున్నాడు. ఈ అగుపడు జగత్తు మాయాదృష్టిగల వారికి సత్యముగా అగుపడును. జ్ఞానదృష్టికి మిథ్యగానున్నది. మీద చెప్పిన చిత్రపటమె జగత్తు. దానిప్రసారము సృష్టి నిర్వసనము ప్రళయము. స్వరూపజ్ఞానమే మాయకు అవధి. ప్రతిశరీరమునం దునూ సాక్షిస్వరూపముగానున్న తురీయుడే తననిజరూపము. దానిని మరచుటయు, స్థూల సూక్ష్మ కారణములనే శరీర ములు నేననే అజ్ఞానము బంధహేతువు. ఆ అజ్ఞానమున్నంత కాలము జనన మరణ ప్రవాహమందు మునుగుచు తేలుచు వుండవలెను. తననిజరూపమును తెలియుటయే మాయకు అంతము గాన, ఈరాజు తన సంకల్పముచేతనే బద్ధుడైనాడు. స్వరూపజ్ఞానము కలిగే వరకునూ సుఖదుఃఖములు వదలవు. ఎపుడు ఉచితమైన గురువువలనను శాస్త్రప్రమా ణమువలననూ తన నిజరూపమును జ్ఞానమునూ తెలుసు కొనునో అపుడు ముక్తుడగును. స్వరూపజ్ఞానమే బ్రహ్మజ్ఞాన ము. అదికలుగుటయే నిజమైన సుఖముగాని ఈ సంసార మందుగల సుఖములు నిజమైన సుఖములుగావు.

రాజకుమారునికి చండాలత్వముకలుగుట

గ॥ ఋషికుమారః॥ శ్రీగురో తద్రాజపుత్ర చరితం బ్రూహీతి. గురుః॥ సబాలకః చండాలైః పోషితః, క్రమేణ దశవర్షికః నవయోభిర్బాలకైః క్రీడాసక్తః. అహంచండాల ఇతి జ్ఞానయుక్తః సహవాసదోషేణ స్వకులాగత చోరపానాది దుర్వృత్తిం ప్రాప్తః షోడశవార్షికః దుర్మార్గప్రవృత్తిః పోషకైః పితృమాతృభిస్త్యక్తః క్రమేణ సహచరైరపి త్యక్తః ఏకాకీ అలబ్ధ జీవనాధారః వనేపర్యటన్ పథిక మేక మాశ్రిత్య స్వజన్మపట్టణం ప్రాప్తః ॥౬౭॥

తా॥ ఋషికుమారునికి గురువు చెప్పుచున్నారు. ఆ చిన్నవాడు కిరాతులైన మాలలచే పోషింపబడి పది సంవత్సరములు వయస్సుగలవాడై తన సమానవయస్సుగల చండాలబాలురతోగూడి క్రీడాసక్తుడై క్రమముగా చండాలవృత్తి గలవాడై చోర సురాపానాదులు మొదలైన దుర్వృత్తులయందాసక్తి గలిగినందున పదియారుసంవత్సరముల ప్రాయము వచ్చినతరువాత వీని ప్రవర్తననుజూచి పోషకులైన మాతాపితరులు (అబోయులు) విడిచిపెట్టిరి. తరువాత స్నేహితులతోగూడి కొంతకాలము గడపెను. అంతట వారు విడిచినందున వనమందు ఏకాకిగా ఆహారములేక తిరుగుచూ కొంతకాలమునకు ఒకమార్గస్థునితోకలసి తానుజన్మించిన పట్టణము చేరెను.

గ॥ సః విపణ్యాం ప్రవిష్టః దీనవదనః స్వం చండాలం మత్వా జనస్పర్శనభీత్యా దూరస్థః భిక్షాటనేన జీవ

న్తస్థా. తదాదినక్రమేణ పురజనైః పరిచితః స్వవృత్తాంతం చండాలత్వం దైన్యంచ విజ్ఞాపితః. కశ్చిద్దయాళునా ఏవం చోదితః. రేరే వృథాపర్యటనం మాకురు. రాజసభా ప్రవిశ్య రాజాజ్ఞయా అశ్వశాలాయాం స్వకులజాః బహవస్సంతి తేషు త్వమపి అశ్వపాలకోభూత్వా జీవితకాలం నయేతి హితోపదేశం ప్రాప్తః॥౽౦॥

తా॥ ఆచండాలుడు పట్టణమందు బాజారున ప్రవేశించి దీనముఖముగలవాడై చండాలుడననే నమ్మికతో జనులదగ్గిరకు పోవుచుచు, భిక్షాటనముచేసి జీవించుచుండగా, క్రమముగా పురజనులు పరిచితులైరి. అందు దయాళు డొకడు వీనినిచూచి వృథా కాలయాపన యెందుకు చేసెదవు. ఈరాజుగారి అశ్వశాలయందు నీకులస్థులగు అశ్వపాలకులు అనేకులు గలరు. నీవును రాజుగారి దర్శనమును చేసినయెడల ఆ స్థానమును సంపాదించి జీవించగలవని హితోపదేశము చేసెను.

గ॥ తత స్స త దుపదేశం మనసినిధాయ రాజదర్శన కాలం జనైః జ్ఞాత్వా భీతభీతః రాజగృహం ప్రవిశ్య సభా సమీప భూమౌ స్థితః॥ కాలక్రమేణ. స రాజా సభాంప్రవిశ్య అవశ్యకకార్యజాలంనిర్వర్త్య నవీనజనా నాలోకయన్ ఏనం సభాద్దూరస్థందృష్ట్వా చండాలఇతిజ్ఞాత్వా, అస్యాకారంతు స్వకులవిరుద్ధం దృశ్యతే। అవస్థావశేన ఆకారేణ చండాలః అన్యకులజ ఇవభాతి. క్రమేణ జ్ఞాతవ్యమితి మత్వాతూష్ణీం బభూవ॥౽౧॥

తా॥ ఆమాలడు సజ్జనోపదేశమును స్మరించి రాజదర్శనకాలమును తెలుసుకుని భయయుక్తుడై రాజగృహమందుప్రవేశించి రాజ సభాసమీప భూమియందుండగా కొంతకాలమునకు ఆరాజు సభలో ప్రవేశించి అవసరకృత్యముల నెరవేర్చి నూతనజనులను పరీక్షించుచుండగా రాజు ఈచిన్నవానినిజూచి సభకు దూరస్థుడై యున్నందున చండాలునిగాపోల్చి నిదానించి వీనిఆకారము చండాలునివలెలేదు. హీనస్థితివలన కళాహీనుడుగామన్నాడు. వీడితరకుల మందుపుట్టి వ్యక్తిచేత చండాలుడు కావచ్చునని ఊహించి క్రమముగా విచారింతమని ఊరుకొనెను.

రాజు మాలవానిని తనకుమారుడని పోల్చుట.

గ॥ సచండాలః పరదినేపూర్వవత్సభాంప్రవిష్టః.నరాజా చండాలం దృష్ట్వా స్వమనసి అయమాకారేణ మత్సమాన లక్షణః। మమబాలకః పూర్వేచోరైరపహృతః। దైవవశేన జీవితోయది యీదృశవయోయుక్తః తత్ప్రభృతి తద్వృత్తాంతం నక్షత్రం। విచారయామీతిమత్వా దౌవారికమాజ్ఞాపయతి। అయం నవీనః కిమర్థమాగతః, అస్యపూర్వ వృత్తాంతఃకథం, కీదృశఇతి, సచండాలః రాజభృత్యేనపృష్టః। స్వవృత్తాంత మాగమనకారణం చోక్తవాన్. రాజా శ్రుత్వా సంశయగ్రస్తః ప్రత్యహమాగంతవ్యం కాలక్రమేణ కార్యం భవిష్యతి జీవనార్థం ప్రత్యహం తండులాదికం గ్రాహ్యం ఇత్యవోచత్ ॥౭౦॥

తా॥ ఆచిన్నవాడు మరునాడు మామూలుగా రాజసభాసమీపమునకు వెళ్లుచుండగా రాజు వీనినిచూచి వీడు

వచ్చి పదిదినములు కావచ్చినది, వీడి ఆకారముచూడగా నాతో సమానముగా నగుపడుచున్నాడు. జన్మచేత చండాలుడుగా నగపడడు. అవస్తవలన దీనదశలోనున్నాడు. చోరులచే దొంగిలించబడిన తనబాలుడు దైవసహాయముచే సజీవుడయినయెడల వీని వయస్సుగలవాడగును. అని తనలోనూహించి క్రమముగా విచారించదలచి తనభృత్యునివలన సకల వృత్తాంతమును విని వానిని ప్రతిదినమును రావలెనని నియమించి వాని జీవనమునకు కావలసిన తండులాదికములను ప్రతిదినమునూ యిచ్చుటకు రాజు ఆజ్ఞయొసంగెను.

చండాలునికి బ్రాహ్మణత్వము సిద్ధించుట

గll ఏకదా కశ్చిద్వృద్ధ బ్రాహ్మణః బాలకందృష్ట్వా అస్యవృత్తాంతం సర్వం జ్ఞాత్వా హేబాలక ప్రత్యహం రాజసభాంప్రవిష్టః కిమర్థమితి పృష్టః। బాలకః స్వవృత్తాంతం కథయామాస। శృత్వా బాలక తవ జన్మప్రభృత్యేతావత్పర్యంతం చరితం మయాజ్ఞాతం త్వం విప్రకులజః నచండాలః। అజ్ఞానాత్త్వం విస్మృతోసి। త్వం రాజపుత్రః బాల్యేచోరైరపహృతః మమ తపఃప్రభావేణ తవ ఆగంతుకచండాలత్వం నివార్య విప్రం,త్వాం కరిష్యామి. త్వం యువరాజో భవిష్యసీత్యుక్తః। సబాలోవిస్మితః, బ్రహ్మన్ భవంతః సర్వసమర్థాః। అహంబాలకః. దీనావస్థాయాం స్థితోస్మి, ఇత్యుక్తే పరస్మిన్దినే సవిప్రః బాలకంనదీం నీత్వా, సబ్రాహ్మణ స్సపరికరః క్షౌరకర్మాదికం కారయిత్వా విధివత్ప్రాయశ్చిత్తంకృత్వా పునః జాతకర్మాది ఉపనయనాంత సంస్కారాన్ విధాయ

బ్రాహ్మణా కర్మణా చకార, తస్మిన్ దినే స్వగృహం నీత్వా రరక్షు. బాలక శ్వః రాజసభాంనీత్వా రాజానమహం విజ్ఞాపయామీత్యుక్తః॥౭౧॥

తా॥ ఒకనాడు ఒక వృద్ధబ్రాహ్మణుడు ఆబాలుని చూచి వీనివృత్తాంతమంతయు జ్ఞానదృష్టిచేత తెలుసుకొని ఓయీ నీవు ప్రతిరోజు నారాజసభకు వచ్చుచుంటివి. నీ వృత్తాంత మేమి యని అడిగెను. బాలునివల్ల అంతయువిని వాని జన్మప్రభృతి సర్వమునుజెప్పి నీవు బ్రాహ్మణకుల మందు జన్మకలవాడవు. నీకుఆ గంతుకమైన చండాలత్వమును నేను పోగొట్టి బ్రాహ్మణునిగా చేసెదను. నీవు యువరాజువు కాగలవు. అని ఆవృద్ధబ్రాహ్మడు చెప్పగా ఆబాలుడువిని ఆశ్చర్యమగ్నుడై స్వామీ మీరు సర్వసమర్థులు, దయాళులు. తమ ఆజ్ఞాప్రకారము బద్ధుడను. అని చెప్పగా వానిని మరు సటిదినము ఉదయకాలమందు సపరికరములతో నాబ్రాహ్మణుడు నదీతీరమునకు తీసుకొనిపోయి క్షౌరాదికమును జరిపించి స్నానాదికార్యమును విధియుక్త ప్రాయశ్చిత్తాదికమును నివర్తించి జాతకర్మాది ఉపనయనాంత సంస్కారములు గావించి పరిశుద్ధునిగాజేసెను. పిమ్మట తనగృహము నందు ఆదినముంచి మరుసటిదినము రాజ దర్శనమునకు తీసుకు వెళ్ళెను.

చండాలుడు యువరాజగుట.

గ॥ పరదినే సబాలః స్నానసంధ్యాదికం విధాయ. బ్రాహ్మణతపశ్శక్త్యా సర్వజ్ఞః, పూర్ణచంద్ర ఇవ విరాజమానముఖః,

గురుణాసహ రాజసభాంప్రాప్య నిస్సంశయః రాజసింహాసన సమీపంగత్వా రాజానం ప్రణమ్య తూష్ణీంస్థితః. సర్వేసభా జనాః విస్మితాః. రాజాస్వగతం ఏతావత్పర్యంతం మమహృదయగతం సంశయం నిశ్చిత మభవత్ అయం మమపుత్రః కేనాపి మహాత్మనా స్వానస్య జ్ఞాతపూర్వమభవత్। తథాపి భవితవ్యం భవిష్యతీతు క్తోం; కఃస్త్వమిత్యుక్తః బాలః శివోహమిత్యవోచత్ కుతఆగతః కస్యపుత్రః బాల. అహంనజానే పంచభూతాని పృష్టవ్యానీత్యవోచత్ తదా సభాయాం వృద్ధ బ్రాహ్మణ ఉత్థాయ రాజన్నయంబాలః చోరైరపహృతః తవపుత్రః దిష్ట్యాజీత ఆగతః। అస్య ఆగన్తుక చండాలత్వం మయాపనీతం శుద్ధోభవత్। అయంసర్వేషాం యువరాజాభవితు మర్హతీత్యుక్త్వా విరరామ। సర్వేసభికాః సమ్మతాః రాజాపుత్రమాలింగ్య అంతఃపురంనీత్వా భార్యామైదదా సర్వేమిళిత్వా ఆనందమగ్నాస్థితాః॥

తా॥ మరచటిదినమున ఆ బాలుడు స్నానసంధ్యాదులను ఆచరించి గురువుగారియొక్క తపశ్శక్తిచేత సకలవేద వేదాంగములను గ్రహించినవాడై పూర్ణచంద్రునితో సమానమైన ముఖకాంతియు ధైర్యస్థైర్యములు గలవాడై గురువుతోకూడా రాజసభకు వెళ్ళి రాజసింహాసన సమీపమునకు వెళ్ళి రాజుకు నమస్కరించి నమ్రుడై యుండగా సభాసదులందరు చూచి హాశ్చర్యయుక్తులై యుండగా రాజు తన మనసులో తాను ఆలోచించెను. ఇంతవరకు వీనిని గురించి నాకు గల సంశయము పోయి నిశ్చయమైనది. వీడు నాబా

లుడు ఇంతవరకు స్వస్వరూపమును మఱచినందున దీనుడై సకలదుఃఖముల కాస్పదమైనాడు. ఎవరో బ్రహ్మవేత్తలచే బోధితుడైనాడు. ఇపుడు స్వారాజ్యాస్థుడైనాడు. అని నిశ్చయించుకుని అయినను సభవారి విశ్వాసముకొరకు నమ్మకముకొరకు రాజు అడుగుచున్నాడు. ఓ చిన్నవాడా నీవు ఎవరు? ఎచటనుంచి వచ్చితివి? బాలుడు చెప్పుచున్నాడు. నేను సర్వసాక్షియగు శివస్వరూపుడను. యిదివరకు పోనూలేదు ఇపుడు రానూలేదు నాభ్రాంతియే వచ్చినదీ పోయినదీ; రాజు. నీవు ఎవనికుమారుడవు. బాలుడు నాకు తెలియదు. పంచభూతములను అడుగుము. అని బాలుడు రాజుకు ప్రత్యుత్తరువు చెప్పెను. రాజు నిశ్చేష్టుడైయుండగా సభామధ్యనుండి బ్రహ్మవేత్తయగు వృద్ధబ్రాహ్మణుడు లేచి; రాజా! ఈబాలుడు పూర్వము చోరులచే నపహరింపబడిన నీకుమారుడు. విధివశముచేత చండాలత్వమునుపొంది నాచే విముక్తుడై బ్రహ్మవేత్తఅయినాడు. సర్వజ్ఞుడైనాడు. గాన యితను మాకందరకు యువరాజుగానున్నాడు. నీవు సంశయ రహితుడవై ఇతనితో సుఖింపుము. అని ఆవృద్ధబ్రాహ్మణుడు చెప్పెను. సభికులందరునూ రాజా వీరు బ్రహ్మవేత్తలు సర్వజ్ఞులు వీరు చెప్పినట్లు యీబాలుని చరిత్రఅంతయు సత్యము ఇందుకు సంశయములేదు. అని చెప్పగా రాజు సంతసించి పుత్రుని కౌగలించుకొని అంతఃపురమునకు తోడ్కొనిపోయిరి. సభికులందరు తమస్థానములను పొందిరి.

## చణ్డాలచరిత్రకు రహస్యము

గ॥ ఋషికుమారః; భగవన్? రాజకుమారచారిత్రేణ మాం ప్రతి భవదుదిత తత్వబోధే కిమాయాత మిత్యవోచత్. గురుః విద్వన్? అనేనైవ స్వరూపజ్ఞానం సర్వజీవానాం సంసారప్రాప్తిః, బంధమోక్షస్వరూపం, ఏవంవేత్తి సుబోధ్యంభవతి. కథమితిచేచ్ఛృణు॥

తా॥ ఋషికుమారుడు గురువును అడుగుచున్నాడు. స్వామీ? యీరాజకుమారచరిత్ర, నాకొరకు మీరు వుపదేశించుచున్న తత్వబోధంలో ఇది నాకు ఏమి ఉపయోగమని అడిగెను. గురువు సమాధానము చెప్పుచున్నాడు. ఈ చరిత్ర వలన సకలజీవులకు సంసారమనే బంధవిముక్తిస్వరూపజ్ఞానము బంధమోక్షముల స్వరూపమున్ను సులభముగా తెలియుచున్నది. వినుము.

## సృష్టిక్రమము కారణము.

గ॥ గురుః సృష్ట్యాదౌ వర్తమాన రాజద్వంద్వం బ్రహ్మస్వరూపం. ఆదిదంపతీ ద్వంద్వం- రాజసంకల్పా దేవ మాయారూప ఐంద్రజాలికాగమనం. సామూలప్రకృతిః॥ తదారభ్య సర్వం మోహినీకృత్యం జాలవిద్యామహిమ్నా మిథ్యైవ. సత్యవద్భాతి సర్వసృష్టిః. సరాజకుమారః! చిదంశ ప్రాయః చిదంశఏవ గర్భస్థజంతుః, మాసత్రయపర్యంతం. జడః తతః తస్మిన్ చిత్కలా ప్రవేశః. జడసంబంధా చ్చిత్కలాయాః జీవసంజ్ఞాప్రాప్తిః. రాజపుత్రశ్చోరై రపహృతః వనమధ్యస్థ చండాలాయక్రీతః చండాలో భూత్వైవ సంసారమవపనం జీవ

త్వప్రాప్తి రేవ చండాలత్వం, ఇంద్రియసమూహం ప్రకృతిశ్చ చోరాః, విషయవాసనాః సహవాసాః, దైన్యాధికమజ్ఞానం, పథికో సజనః, ప్రాకృతభోగో మద్యపానం, పురప్రవేశో విచారాభిముఖ్యం, వృద్ధబ్రాహ్మణోగురుః, అహం నచండాలః రాజపుత్రోహమితి జ్ఞానమేవ స్వరూపజ్ఞానం, చండాలత్వ నివృత్తి రేవ జీవత్వభ్రమనిరాసః తస్యబ్రహ్మత్వప్రాప్తి రేవమోక్షః, రాజపుత్రస్య చండాలత్వవత్ చిద్రూపస్య జీవత్వప్రాప్తి విముక్తౌ కాలత్రయేపి స్వరూపం చిద్రూపమేవ ఆగంతుక జీవత్వభ్రమ నిరసనమేవ స్వరూపజ్ఞానం కాలత్రయేపి రాజపుత్రో యథా బ్రాహ్మణపుత్రః ఏవమేవ సర్వమూహ్యం అనేనరాజపుత్రః స్వరూపజ్ఞానేనతద్వ్యామోహవిముక్తో భవతీత్యుక్తః॥ ౭౮

తా॥ గురువు చెప్పుచున్నాడు. ఓ ఋషికుమారా వినుము ఆ రాజదంపతుల ద్వంద్వము సృష్ట్యాదినిర్గుణ బ్రహ్మస్వరూపము. రాజసంకల్పమే. ఐంద్రజాలికాస్త్రీ సత్యజము ఆ జాలికాస్త్రీయే మూలప్రకృతి. అంతటనుంచి జరిగిన కృత్యమంతయు మాయాబలముచేత సత్యముగాతోచే మిథ్యా ప్రపంచము. గాన మోహినీకృత్యమేను ఆ రాజకుమారుడు చిరంశ అప్రగ్రహించవలెను. గర్భస్థమైన జంతువు మూడుమాసముల పర్యంతము జడస్వరూపము. తరువాత అదు చిత్కలాప్రవేశము. అదియే జీవసంజ్ఞను పొందినది మాయావశముచేత జడమందు చిత్కలాప్రవేశమైనందున జీవత్వమని వాడుకగలదు. అదిని ఈరాజపుత్రునివలె స్వచ్ఛ

మైన చిత్కళలకు మాయవశముచేత జీవత్వమనే చండాలత్వము సిద్ధించినది. పైని చెప్పినవనమే ప్రపంచము సంసారమున్ను ప్రకృతియేమాలత్వము. ఇంద్రియములే స్నేహితులు కోరికయే చోరవృత్తి విషయాభిలాషయే మద్యపానము. మార్గస్తుడే సజ్జనసాంగత్యము పురప్రవేశమే స్వరూపవిచారణాభిముఖము వృద్ధబ్రాహ్మణుడే గురువు. రాజకుమారుని ఉపనైనాదికమే తత్వోపదేశము. చండాలనివృత్తియే జీవత్వ నిరసనము. రాజకుమారుడను అనేజ్ఞానమే స్వస్వరూపజ్ఞానము. తన నిజరూపము చిత్కళఅనియు స్థూలదేహము నేనుకాననియు జీవుడు నేనుకాననియు తనబుద్ధిచేత తాను తెలుసుకుని నేను చిద్రూపుడను అనేధైర్యము పలుకుయే రాజసభాప్రవేశము రాజుకుమారుడని గ్రహించి స్వీకరించుటయే మోక్షప్రాప్తి ఇట్లు రాజపుత్రచరిత్రవలన రహస్యార్థమును గ్రహించవలెను.

లోకమందు జనులకు అజ్ఞానబలముచేతను చిరకాలవాసనచేతను తత్వబోధను యెంతసులభముగా బోధించిననూ నమ్మకము కుదరక నాకు ఇంతవేగము బ్రహ్మజ్ఞానము దొరుకునా నాకు బ్రహ్మత్వము సిద్ధించునా అనే సంశయము వదలదు. అందుకు దృష్టాంతముకొరకు రాజపుత్రునికి చండాలప్రాప్తి విముక్తి రెండును చూపించబడినవిగాన సంశయములను విడచి శాస్త్రమందును గురూపదేశమందును నమ్మకముంచి విచారణచేసినవారికి సులభముగనే స్వస్వరూపజ్ఞానము జీవన్ముక్తియు దొరుకును. శ్రుతి యుక్తి అనుభవములచేత పరమాత్మప్రత్యక్షముగా నున్నది.

ఓయీ ఆ రాజదంపతుల యెదుట మోహినిచే సినగాఢీవిద్య సృష్ట్యాదిని జరిగిన ఇంద్రజాలమేను. అదియే ఇప్పటికిని నడచుచున్నది. గాని స్వవిచారణచేసినవారు ఈ ప్రకృతిని మాయగాను అనిత్యంగాను తెలుసుకుందురు. అందువల్ల యీ ప్రకృతి సంబంధమైన మాయ వారిని భాధించనేరదు. ఆదిని స్వచ్ఛమైన చిత్కళలకు జడస్వభావమైన స్థూలదేహమన్ను ప్రవేశనిర్గమ జననమరణములు కలిగినవని తెలుసుకుని నిజమైన తనస్వరూపము చిత్కళ అని తెలియుటయే పునర్జన్మకారణమైన బీజము నశించుట. అంతనుంచి జీవన్ముక్తుడగునని తాత్పర్యము?

## రాజు విరక్తుడగుట.

గ॥ ఋషికుమారః శ్రీగురో తతో రాజచారిత్రం బ్రూహితి॥ పుత్రప్రాప్త్యనంతరం రాజ్యంపాలయన్ కళత్రపుత్రమిత్ర బంధుసహితః సర్వభోగానను భూయ సర్వంభుక్త పూర్వమితి మత్వా ప్రాపంచికవ్యవహారం స్వప్నంచక్రభ్రమణ వత్ చర్వితచర్వణం పిష్టపేషణం మాయామయంజ్ఞాత్వా హ్యైహిక భోగేషువిరక్తో రహసిభార్యాం సునీలాందృష్ట్వా ప్రియే!మయాసర్వమనుభూతం ప్రత్యహం పూర్వదినచరితమేవనవీనవద్భాతి శ్రాంతోస్మి. ప్రపంచభోగేషువిరక్తోస్మిసంసారసముద్రసారంనజ్ఞాతం సంసారబంధవిముక్తిసాధనం నజానామి వనంగత్వా తపసాకాలం నయామీత్యుక్తః॥

తా॥ ఋషికుమారుడు గురువునుచూచి స్వామీరాజు చరిత్ర తరువాత యేమిజరిగినది తెలపియ్యమని అడిగెను.

గురువుచెప్పుచున్నాడు ఓయీ శిష్యుడా వినుము రాజు పుత్రునితోను భార్యతోను బంధువులు మిత్రులతోనుకలిసి కొంతకాలము సకల భోగములను అనుభవించి ఈ సంసారమందును భోగములందును విరక్తుడై భార్యనుచూచి ఓ ప్రియురాలా? సకల భోగములను అనుభవించితిమిగాని ఈభోగములు అనుభవించినవే తిరిగి నవీనములుగా దోచుచున్నవి. యీ సంసారమందును ప్రపంచమందును నిజమేదియో తెలియదు. కాబట్టి నాకు ప్రపంచమందు సంసారమందూ విరక్తికలిగినది. వనముకువెళ్లి తపస్సువల్ల కాలము గడిపెదనని చెప్పెను.

గ॥ భార్యా రాజన్? భవద్భిః ప్రతిపాదితంసర్వం సత్యమేవ. తథాపివనవాసం కష్టతరం స్వవిచారాభిముఖస్సన్నాత్మానాత్మవిచారేణైవ జ్ఞానోదయః ప్రాజ్ఞానాంగృహమపి వనప్రాయం వనమాగమిష్యామిత్యుక్తావానన్॥

తా॥ రాజుకు భార్యచెప్పుచున్నది స్వామీ మీరు చెప్పినదంతయూ సత్యమేను గాని పరమార్థమును కోరితివేని స్వవిచారణచేయవలె. ఆత్మానాత్మవిచారణవలన జ్ఞానము కలుగును. వనవాసముకష్టము. ప్రాజ్ఞులకు గృహమే వనము అప్రాజ్ఞులకు వనము గృహతుల్యమేను అని చెప్పెను తమకు వనమే ఇష్టమైతే నేనూ వచ్చెదను నాకు మాత్రము గృహామేందుకు అని చెప్పెను.

రాజు తపోవనప్రవేశము.

గ॥ రాజా భార్యాయా అభిప్రాయంజ్ఞాత్వా విరక్తో కస్మిన్ దినే అర్ధరాత్రౌ భార్యాంనిద్రావిమోహితాం విసృజ్య

గృహంత్యక్త్వా వనంయయౌ ప్రాతః దేవీ రాజానమదృష్ట్వా జ్ఞానదృష్ట్యా రాజచేష్టితం సర్వం జ్ఞాత్వా మోహినీకృత మాయాబలం స్మృత్వా మాయయాపరమపురుషోప్యేవం వంచితః పామరోభవత్ తథాపివిరక్తః క్రమేణ బోధయామీతిమత్వా సచివానాహూయ బ్రూతే. భో! భో! సచివా అస్మచ్ఛాసనం శృణుధ్వం. రాజాకార్యాంతరే ప్రవిష్టః రాజ్యకార్యాణి జాగరూకతయా నిర్వర్త్య ప్రత్యహంమాం నివేదితవ్య మిత్యాజ్ఞాపయామాస॥

తా॥ రాజుభార్య అభిప్రాయమును తెలుసుకుని విరక్తి కలిగిన వాడై అర్ధరాత్రియందు లేచి భార్యనిద్రావస్థలో వున్నదని గ్రహించి గృహమువిడిచి వనమునకేగెను. ప్రాతఃకాలమందు రాజుభార్య రాజుచర్యను గ్రహించి॥ పరమపురుషుడైననూ మాయామహిమచేత పామరునివలెను మోహితుడైనాడు అయిననూ విరక్తికలిగినది గాన క్రమముగా బోధించితీసుకురావచ్చునని తలచి మంత్రులను పిలిపించి రాజుగారు కార్యాంతరమందు ప్రవేశించినారు. వచ్చేవరకు రాజ్యకార్యములు జాగరూకతగా జరుపుచు ప్రత్యహమూ మాకు నివేదించవలెనని వారికి నియమించెను. వారు మహాప్రసాదమని వారి ఆజ్ఞను శిరసావహించుకుని వ్యవహరించుతూ యుండిరి.

గ॥ రాజా వనంప్రవిశ్య తపోయోగ్యస్థలంవిచారయన్ ఫలపుష్పసంపన్నం సాంద్రవిశాల వటవృక్షకదంబం నిర్మలనదీతీరంనిరీక్ష్య తత్రపర్ణశాలాంనిర్మాయ కందమూలఫలాశీతత్రకుశ చిత్రాసన కృష్ణాజినాదిసుఖాసనే ఉపవిష్టో నిశ్చింతః తాపసావ్రత్యాతిష్ఠతి॥

తా॥ రాజువనమందు ప్రవేసించి తపోయోగ్యమైన స్థలమును విచారించి సాంద్రమై విశాలమైన మర్రిచెట్టుగలిగి కందమూల ఫలపుష్పభరితమైన ఒకనదీతీరమందు పర్ణశాల నునిర్మించుకుని కుశ చిత్రాసన కృష్ణాజినములయందు కూర్చుని నిశ్చింతగా తపముచేయుచూ ఉండెను.

కృత్రిమ రుషివేషముతో — విమర్శశక్తి రాజువద్దకు వచ్చుట,

గ॥ దేవీస్వగతం రాజాసచ్చిదానందస్వరూపః ఐన్ద్రజాలికయావంచితః సంసారీవభ్రమన్ దుష్కరం వనవాసంకరిష్యతి ఏకవర్షమభవత్ పశ్చాత్తప్తః రూపాన్తరంప్రాప్య రాజానంస్వరూపంబోధయిత్వా సత్యముపదిశ్య గృహంనయామీతిమత్వా స్వశరీరమన్తఃపురే నిక్షిప్య స్వసంకల్పమాత్రేణ కశ్చిదృషికుమారస్య రూపంధృత్వా ఖేచరీభూత్వా మనోవేగేన తపోవనంప్రవిశ్య తాపసం రాజానం దదర్శ॥

తా॥ రాజభార్యయగు విమర్శశక్తి తనలోతాను ఇటుల చింతించెను. రాజు తపస్సుకువెళ్లి వకసంవత్సరమైనది. ఇతను సచ్చిదానంద స్వరూపుడు ఇంద్రజాలశక్తిమహిమచేత మోహితుడై పామరునివలె భ్రమనుపొంది అతికష్టమైన వనవాసమును చేయుచున్నారు. పశ్చాత్తాపమును పొందినారుగాన రూపాన్తరమును పొంది వారికి స్వస్వరూపమును తత్వమును బోధించి ఇంద్రజాలరూపమైన మాయవలన తప్పించి వనమునుంచి గృహమును పొందించవలెనని నిశ్చయించుకొని తనశరీరమును అంతఃపురమందుంచి ఒకరుషికుమారుని స్వరూపమును సంకల్పమాత్రముచేత ధరించి మనోవేగమున ఖేచరగమనముగలదై రాజుయుండే తపోవనమున ప్రవేశించెను.

ఎందుకు నేను సర్వత్యాగినికానని అడిగెను. ముని రాజును చూచి, అంతమాత్రమున నీవు సర్వత్యాగివికానని; చెప్పెను. రాజు; ఓఋషిపర్యా? తెలిసినది ఏనము ఆశ్రమము విడువవలయునుగాబోలు; విడిచెదను;అనగా ఋషికుమారుడు విని అందు వల్లనూ కానేరవనెను. ఇంతట రాజు ఆలోచించి; స్వామీ? తెలిసినది; దర్భాసనము, కృష్ణాజనము, ధరించిన వస్త్రములు విడువవలెను గాబోలు విడిచెదనని అగ్నియందు పారవైచెను. మునిచూచి ఈనటనవలన నీవు సర్వత్యాగివి కానేరవనెను. రాజు బాగాయోచించి దేహముమాత్రము మిగిలినది ఇది ఎప్పుడైననూ పోయేదే అని తలచి; స్వామీ? దేహము మిగిలినది. దీనిని అగ్నియందు త్యజించెదనని తనయెదురుగాఅగ్నిని ప్రజ్వలింపచాయుగా రాజు చర్యనుచూచి; ఓరాజా? నీవు కేవలమూ అజ్ఞానివి శరీరము నిరపరాధి; జ్ఞానసాధనము;దానిని దహించిన నీకేమిలాభమున్నది? అంతమాత్రమున సర్వత్యాగివికానేరవు. అనిన రాజువిని స్వామీ సర్వత్యాగమెట్టిదో మీరే శలవియ్యవలెనని కోరెను.

## సర్వత్యాగలక్షణము

శ్లో॥ సాధోసర్వగతాకారం జీవప్రాణాదినామకం
నజడం నాజడం భ్రాంత్తం చిత్తం సర్వమవస్థితం. ౧

అవ॥ సత్యవాది రాజుకు సర్వత్యాగలక్షణమును చెప్పుచున్నారు.

తా॥ ఓరాజా వినుము ఈ అగుపడే ప్రపంచమందుగల సకల వస్తుస్వరూపమున్నూ, జీవను, ప్రాణము, మొదలగు

పేర్లుగలదిన్ని, జడముకానిది, అజడమున్నుకానిదిగా ప్రకాశిం చుచున్నది. అంతటనూ వ్యాపించియున్నది. చిత్తమని గ్రహించుము.

శ్లో॥ చిత్తం సిద్ధిజగజ్జాలం బంధశ్చిత్త మదీర్యతే
తస్మిన్సాధోపరిత్యక్తే స్యాత్యాగోభవేదితి॥ ౨॥

తా॥ చిత్తమే అగుపడుచున్న జగత్తుగా నున్నది. చిత్తమేబంధమని చెప్పబడుచున్నది. గనుక ఓసాధో? అట్టిచిత్తమును విడిచితివేని సర్వత్యాగివి అగుదువు.

శ్లో॥ జన్మనాం కర్మణాంవాపి చిత్తం బీజ ముదాహృతం
పాదపఃపవనేనైవ దేహశ్చిత్తేన చాల్యతే ॥3॥

తా॥ జన్మలకు కర్మలకు చిత్తము బీజమని చెప్పబడుచున్నది. వాయువుచేత వృక్షము ఎట్లు కదలుచున్నదో అట్లనే దేహము చిత్తముచేతనే చలింపబడుచున్నది.

శ్లో॥ చిత్తత్యాగం విదుస్సర్వత్యాగం త్యాగవిదోజనాః।
చిత్తేత్యక్తే లయం ద్వైత మైక్యం పస్యేచ్చసర్వతః॥ ౪

తా॥ త్యాగశబ్దార్థమును తెలిసినవారు చిత్తత్యాగమే సర్వత్యాగమని తెలిసికొనిరి. చిత్తమును విడచగానే అంతటనూ ద్వైతబుద్ధిపోయి అద్వైతముమిగిలి అగుపడుచున్నది.

శ్లో॥ శిష్యతే పరమంశాంత మేకమచ్ఛమనామయం
సర్వత్యాగః పరానందో దుఖమన్యత్సుదారుణం. ౫.
ఇత్యోన్యమిత్యురరీకృత్య యదిచ్ఛసితదాచర.॥

తా॥ అద్వైతము నిర్మలము శాంతము అఖండాకారము బాధారహితముగా నున్నది. గనుక ఈ చిత్తత్యాగము ముఖ్య

మైన బ్రహ్మానందస్వరూపము. ఇతరమైన చిత్తవృత్తియే దారుణమైన దుఃఖమునకు కారణమగుచున్నది. ఇట్లు చెప్పి ఓం; అని విరమించెను.

శ్లో॥ కృత్వా సర్వపరిత్యాగం శాంతస్స్వస్థో వియత్సమః
సౌమ్యో భవసియద్రూప స్తద్రూపో భవభూపతే॥౬॥

తా॥ ఓరాజా! సర్వత్యాగలక్షణమును చెప్పితిని. నీకు ఏదిఇష్టమో దాని నాచరింపుము. సర్వత్యాగ స్వరూపమైన చిత్తత్యాగమును చేసితివా శాంతిసుఖముగల వాడవగుదువు. ఆకాశమువలె నిర్మలముగా నుందువు. ఎట్టి రూపము సౌమ్యమైనదో అట్టిరూపము కలవాడవగుము.

శ్లో॥ యేనాయం క్షోభ్యతే దేహో యద్బీజం జన్మకర్మణాం।
తత్త్వం త్యజసిచేత్త్యాజ్యం తన్మహాత్యాగవా న్భవేత్॥౭॥

తా॥ చిత్తమే యీదేహమును క్షోభింపజేయుచున్నది. కాన అట్టిచిత్తమును త్యజించితివా నీవు మహాత్యాగివని పించుకొనియెదవు.

రాజోవాచ.

శ్లో॥ చిత్తస్యాదౌ స్వరూపం మే యథావద్భగవన్వద
తతశ్చిత్త పరిత్యాగం వదమే వదతాంవర ॥౮॥

తా॥ రాజు అడుగుచున్నాడు॥ ఓస్వామీ! చిత్తమనగా నేమో, ముందు చిత్తస్వరూపమునుజెప్పి తరువాత చిత్తత్యాగోపాయమును కలపియ్యవలెనని ప్రార్థించెను.

## చిత్తస్వరూపము

శ్లో॥ వాసనైవ సదా రాజన్ స్వరూపం విద్ధి చేతసః
చిత్తశబ్ద స్యపర్యాయో వాసనాయా ఉదాహృతః ॥౯॥

తా॥ ఓ రాజా ఎప్పుడును చిత్తమునకు వాసనయే [జ్ఞాపకశక్తియె] స్వరూపము. చిత్తమనేశబ్దము వాసనకే మరియొక నామముగా నున్నది. చిత్తమన్నా వాసనఅన్నా ఒకే వస్తువుగా యేది చెప్పబడుచున్నదో అది జ్ఞాపకశక్తిగా నున్నది. దానికే స్మరణ అనికూడ వాడుక.

శ్లో॥ అహమర్థోదయో యోయం సర్వానర్థైకభాజనం
ఏతచ్చిత్త ద్రుమస్యాస్య విద్ధిబీజం మహామతే ॥౧౦॥

తా॥ నేను నాది అనే అహంకారము [భేదజ్ఞానము] కలుగుటయే సకల ఆపదలకూ మూలము. ఈ అభిమానము చిత్తమనే వృక్షమునకుబీజముగానున్నది. అని తెలుసుకొనుము.

శ్లో॥ ఏతస్మాత్ప్రథమోద్భిన్నా దంకురోను భవాకృతిః॥
నిశ్చయాత్మా నిరాకారో బుద్ధిరిత్యేవ సోచ్యతే ॥౧౧॥

తా॥ ఈచిత్తవృత్తిమునకు అనుభవము అహంకార బీజముయొక్క అంకురమువంటిది. అనుభవరూపాంకురమే నిశ్చయమనే స్వరూపముగలది. అంతకన్న వేరురూపములేనిది బుద్ధి అని చెప్పబడుచున్నది.

శ్లో॥ అస్యబుధ్యభిధానస్య యాంకురస్య ప్రపీనతా
సంకల్పరూపిణీ తస్మాశ్చిత్తం చేతోమనోభిధాః ॥౧౨॥

తా॥ ఈ బుద్ధిఅనే అంకురము ముదిరినకొలది సంకల్పమనిపించుకొనును. దానికే చిత్తమని, మనస్సని పేర్లుకలిగినవి.

శ్లో॥ ఈదృశస్యాస్య చిత్తస్య వృక్షస్యాస్య ప్రతిక్షణం।
శాఖావిలపనం కుర్వన్మూలకో క్షేపణం కురు. ॥౧౩॥

తా॥ ఈ రీతిని ఉత్పన్నమైన చిత్తమనే విషవృక్షముయొక్క శాఖలు వృద్ధికాకుండ ప్రతిక్షణమందు ఛేదిస్తూ చిత్తమనే వృక్షమునకు బీజరూపమైన అహంకారమును మూలచ్ఛేదము చేయుము.

శ్లో॥ వాసనావివిధాశ్శాఖాః ఫలంత్యో వివిధంఫలం
అభావితాభవత్యంతర్లూనా స్సంవిద్బలేనవై ॥౧౪॥

తా॥ వాసనారూపమైన అనేకవిధములగు సంకల్పములనే శాఖలు అనేకవిధఫలముల నిచ్చుచున్నవని వాటిని స్మరించకుండా ఉన్నపుడు శుద్ధమైనజ్ఞానబలముచేతను (ఆత్మానుసంధానముచేత) లోలోపలనే ఛేదించబడినవగుచున్నవి. స్మరించకుండాఉన్నయడల వాసనలు నశిస్తున్నవని భావము.

శ్లో॥ అసంసక్తమనామానీ శాన్తవాదవిచక్షణః
సంప్రాప్తకారీయస్సోన్తర్లూన చిత్తలతో భవేత్ ॥౧౫॥

తా॥ లయించిన మనసుకలవాడై మౌనముగలవాడై వాదములను మానినవాడై తటస్థమైనదాని నాచరించువాడు లోపలనసించిన చిత్తమనే లతగలవాడగును.

శ్లో॥ రాజన్స్వాత్మ విచారోఽయం కోఽహంస్యామితిరూపకః
చిత్తదుర్ద్రుమ బీజస్య దహనేదహన స్స్మృతః ॥౧౬॥

తా॥ ఓరాజా! నేను ఎవరు? నా నిజమైనరూపమెట్టిది? అని ఆత్మవిచారణ చేయుటయే చిత్తమనే విషవృక్షబీజమును దహించుటకు అగ్నితోసమానమని చెప్పిరి.

## వాసనా త్యాగలక్షణము.

శ్లో॥ భ్రమస్యభావితస్యాస్య జాతస్యాకాశవర్ణవత్।
అపునస్మరణం సాధోమన్యే విస్మరణంపరం ॥౧౭॥

తా॥ ఏమిలేని ఆకాశమందు నీలిమఅనే వర్ణముతోచునట్లు భావనవల్ల కలిగినభ్రమకు భావనమానుటకన్న స్మరించకుండ ఉనికి శ్రేష్ఠమని చెప్పిరి

శ్లో॥ దృశ్యంనాస్తీతి బోధేనమనసోదృశ్యమార్జనం
సంపన్నం చేత్తదుత్పన్నా పరానిర్వాణ నిర్వృతిః॥ ౧౮

తా॥ జాగ్రదావస్థయందు కలిగిన జగద్రూపమైన భ్రమ [అగుపడు ప్రపంచము] అసత్యమని మనస్సుచేత దృశ్యము త్రోసివేసినట్లయితే శ్రేష్ఠమైన మోక్షము సిద్ధించును. అనగా అగుపడుచున్న ప్రపంచము సత్తాలేనిజడము. బ్రహ్మ సత్తావలన ప్రకాసించుచున్నది. బ్రహ్మవస్తువు లేదనియు అబద్ధమైన తానే నిజమనియు, భ్రమను కలుగజేయుచున్నది. కాన అగుపడని సత్తాను మనసుచేత గ్రహించి జడమైనదృశ్యము [ప్రపంచము] త్రోసివేయవలెనని భావము. ఇదియే మోక్షమనిపించుకొనును.

శ్లో॥ అన్యథా శాస్త్రగర్తేషు లుఠతాం భవతామిహ
భవంత్యకృతిమాజ్ఞానాం కల్పైరపినిర్వృతిః ॥౧౯॥

తా॥ బ్రహ్మవస్తువు అగుపడలేదు గనుక జగత్తే నిజమనే అజ్ఞానులు శాస్త్రములనే భావులలో నీవలెనే మునుగుతూ తేలుతూ ఉండుటయేగాని నూరుకోట్ల కల్పములకైనా వారు ముక్తులు కానేరరు.

శ్లో॥ అశేషేణ పరిత్యాగో వాసనానాం య ఉత్తమః
మోక్ష ఇత్యుచ్యతే సద్భి స్సఏవ విమలః క్రమః॥ ౨౦

తా॥ నిశ్శేషముగా వాసనాత్యాగమే మోక్షమనియు ఉత్తమమనియు బ్రహ్మవేత్తలచేత చెప్పబడినది. అదే ఉత్తమమార్గముగా నున్నది.

శ్లో॥ వాసనాద్వివిధాప్రోక్తా శుద్ధాచ మలినాతథా
మలినా జన్మనోహేతు శ్శుద్ధా జన్మవినాశినీ ॥౨౧॥

తా॥ వాసనలు మలినవాసనలని శుద్ధవాసనలని రెండు విధములుగా నున్నవి. అందు మలినవాసనలు పునర్జన్మ కారణములుగాను, శుద్ధవాసనలు జన్మరాహిత్యములుగాను ఉన్నవి. శుద్ధవాసనలు మోక్షకారణములని భావము.

శ్లో॥ అజ్ఞాన సుఘనాకార ఘనాహంకార శాలినీ
పునర్జన్మ కరీప్రోక్తా మలినావాసనా బుధైః॥౨౨

తా॥ అజ్ఞానమే ఆకారముగా గలదియు విస్తారమైన అహంకారము (భేదజ్ఞానము) కలదియు మలినవాసన అని, ఇది పునర్జన్మ కారణమైనదని పెద్దలచే చెప్పబడినది.

శ్లో॥ పునర్జన్మాంకురాం న్త్యక్త్వా స్థితా సంభ్రష్ట బీజవత్
దేహార్థం ధ్రియతే జ్ఞాతజ్ఞేయా శ్శుద్ధేతి సోచ్యతే ॥౨౩॥

తా॥ ఆత్మను (బ్రహ్మస్వరూపమును) తెలుసుకున్న వారి వాసనలు (సంకల్పములు) శుద్ధవాసనలు. పునర్జన్మ కారణమైన అంకురము నసించినవారు శుద్ధవాసనగలవారు. అంకురము నసించిన బీజమువంటి [illegible] వారు జీవన్ముక్తులు దేహయాత్రి మాత్రమునకు సంకల్పాత్మస్వరూపము. ఆత్మకన్న

శ్లో॥ యేశుద్ధవాసనాభూయో నజన్మా నరభాజినః
జ్ఞాతజ్ఞే యాస్తఉచ్యంతే జీవన్ముక్తా మహాధియః ॥౨౪॥

తా॥ ఎవరు శుద్ధవాసనలుకలవారో వారు తెలుసుకొన తగిన బ్రహ్మను తెలుసుకున్నవారు. వారికి తిరిగి జన్మలేదు. బ్రహ్మత్వమును పొందినవారు. జీవన్ముక్తులుగానున్నారు.

## —• చిత్తవ్యాధి చికిత్స •—

శ్లో॥ అస్యచిత్తమహావ్యాధే శ్చికిత్సాయాం వనౌషధం।
స్వాయత్తం శృణువక్ష్యామి సుసాధ్యం స్వాదునిశ్చితం॥

తా॥ ఓ రాజా వినుము. ఈ చిత్తమనే మహావ్యాధి నివారణకు సాధనమును చెప్పెదను. ఈ సాధనము గొప్ప వనౌషధివంటిది సులభముగా సాధ్యమైనది. ఇష్టమైన ది (రుచికలది.) సిద్ధముగానున్నది. అనేక గ్రంధముల వల్లనూ, అనుభవముచేతనూ నిదర్శనముగా నున్నందున పెద్దలచే నిశ్చయించబడినది.

శ్లో॥ త్యజన్నభిమతం వస్తు యస్తిష్ఠతి నిరామయః
జితమేవ మనస్తేన బాహ్యప్రసర ముజ్ఝితా ॥౨౬॥

తా॥ వెనక చెప్పిన సాధనమేమనగా, తనకు యిష్టమై తాను కోరుచున్న వస్తువును విడిచి నిశ్చింతగా నుండి, బాహ్య వృత్తిని విడిచి [illegible]ముఖుడగునేని వానిచేత మనస్సు ముక్తులు కానేరరు. [illegible]లెను.

శ్లో॥ స్వపౌరుషైక సాధ్యేన స్వేప్సిత త్యాగరూపిణా॥
మనఃప్రశమమాత్రేణ వినా నాస్తిశుభాగతిః॥ ౨౭॥

తా॥ ప్రయత్నముచేత తన కోరికను విడచినచో మనస్సు శాంతిని పొందును. అందువలన మిక్కిలి శ్రేయస్కరమైన మార్గమగును. మోక్షమును పొందుటకు మనశ్శాంతికన్న వేరు మంచిమార్గము లేదని భావము.

శ్లో॥ సర్వం సర్వగతం శాంతం బ్రహ్మసంపద్యతే తదా।
అసంకల్ప నశస్త్రేణ భిన్నం చిత్తగతం యదా॥ ౨౮॥

తా॥ తనకోరికను విడిచి అంతర్ముఖుడైనపుడు మనస్సు శాంతించును. అపుడు సర్వప్రపంచము శాంతించి జ్ఞానముపోయి] సకలము చిన్మయముగా (బ్రహ్మ అగుపడును. ఎపుడుసంకల్పరహితమను (శస్త్ర ధముచేత చిత్తము ఛేదించబడునో, అపుడు అ మగునని భావము.

భావించనపుడు గానుండును. ఇట్టి న రహితమైనది. తములు. కాన అవి బ్రహ్మస్వరూపమని

తా॥ ౩౫॥

శ్లో॥ తాం మహాపదవీ మేకాం కామప్య థి
చిత్తం చిద్భక్షితం కృత్వాచిత్తాదసి
సకలవ్యతశక్తయః
వ్యగీక్షణం॥ ౩౬॥

తా॥ సర్వదా సంకల్పమును విడ ర్గము నవలంబించి దానియందు స్థిరముగా మును చిత్కలలో లీనమైనదానినిగా జేసి తాను సాక్షిగా ఉండవలెను. చపలెనని భావము.

శ్లో॥ భవ భావనయా యుక్తో య అపరిమితమైన ఘటపటా
ధార యాత్మాన మప్యగ్రాత్మస్వరూపము. ఆత్మకన్న

తా॥ ఆత్మానుసంధానముచేసి సాక్షిచేత చిత్తము భక్షించబడినదానిగా భావించిన; అట్టిభావన కలిగినపుడు చిత్తము లయించినదగును.

శ్లో॥ పరం పౌరుషమాశ్రిత్య నీత్వాచిత్తమ చిత్తతాం
తాం మహా పదవీ మేహి తత్రనాశో నవిద్యతే॥౩౧॥

తా॥ ప్రయత్నపూర్వకముగా మనస్సును వృత్తిశూన్యముగా జేయుము. అపుడు బుద్ధిమాత్రముసాక్షిగానుండును. శీఘ్రాప్పస్థితి. దానినిపొందితివా దానికి నాశములేదు, అదే శ్రేవస్థ. జీవన్ముక్తావస్థ అనిభావము.

సోహమిదం తన్మే ఏతావన్మాత్రకంమనః
నివారణకు సా మాతేణదాతేణేవవిధూయతే॥౩౨॥

వసోపధివంటిచిత్తమనగా నేను ఇది నాకు కావలెను అనుభేద ది (రుచికలది.)ఐ. దానిని భావించక ఊరకొనుటచే గొడ్డగ వల్లనూ, అనుభగకబడినదగును.

పెద్దలచే నిశ్చయింగ్మతి సంకల్పాత్సుదృఢాద్బధ్యతేమనః
శ్లో॥ త్యజన్నభిమతిం జితమేవ మనస్తేన తి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతేమనః॥౩౩॥

తా॥ వెనకచెప్పిన ఏనుష్యుడను అనె నిశ్చయజ్ఞానమే బంధముగా నిశ్చయభావనయే మోక్షమని

తాను కోరుచున్న వస్తువుచెన్మస్వరూపం
దృష్టిని విడిచి ...న్మ మేతా వద్భవనత్రయే
ముక్తులు కానేరరు. ఇతి నిశ్చిత్యపూర్ణతా॥౩౪॥

అవ॥ మునిపుంగవా! బ్రహ్మస్వరూపము ఎట్టిదో నాకు ఉపదేశము చేయుమని రాజు అడుగుచున్నాడు. ముని చెప్పు చున్నాడు.

తా॥ అగుపడుచున్న ఈమూడు లోకములు బ్రహ్మ మందు కల్పించ బడినవి. స్వతహాగా శక్తిలేని జడములు బ్రహ్మశక్తిచేతనే వృద్ధిక్షయములు కలవిగా నున్నవి. కాన బ్రహ్మవస్తువుకన్న వేరుకానేరవని తెలుసుకోవలెను. కనుక సకలము పరబ్రహ్మ స్వరూపము. ఆత్మయందుగలవి. బ్రహ్మ మందున్నవి గనుక సకలమూ బ్రహ్మస్వరూపము. అందు వలన బ్రహ్మకు సర్వోపరి పూర్ణత్వము సిద్ధించినది.

శ్లో॥ వికల్పరహితాజ్జంతోః పదంత దవశిష్యతే
యతో వాచో నివర్తంతే సమగ్రి కలనాస్యోతాః॥౩౫॥

తా॥ నామరూపములనే వికారములను భావించనపుడు పరబ్రహ్మమాత్రము అంతటనూ పూర్ణముగానుండును. ఇట్టి దని చెప్పుటకు ఊహించుటకును ఉపమాన రహితమైనది. మనస్సున్ను వాక్కున్ను మాయా కల్పితములు. కాన అవి ఆత్మను తెలుపలేవు. వాటికిగలసత్తా బ్రహ్మస్వరూపమని తెలియవలెను.

శ్లో॥ ఇమాఃఘటపటాకారా పదార్థ శతశక్తయః
ఆత్మైవనాన్యదస్తీతి నిశ్చయస్సమ్యగీక్షణం॥౩౬॥

తా॥ మనకు అగుపడుచున్న అపరిమితమైన ఘటపటా దుల యందుగల శక్తిఅంతయు ఆత్మస్వరూపము. ఆత్మకన్న

వేరు లేదు. ఆత్మను సర్వపూర్ణముగా భావించుటయె బ్రహ్మను తెలుసుకోవడమని చెప్పబడుచున్నది.

శ్లో॥ అనాద్యనంతాభాసాత్మా పరమాత్మైవ విద్యతే
ఇత్యేవ నిశ్చయస్సార స్సమ్యగ్జ్ఞానం విదుర్బుధాః ॥32॥

తా॥ పరమాత్మ ఆది అంతము లేనిది. అనేకస్వరూపములుగా ప్రకాశించుచున్నది. కాన పరమాత్మమాత్రమే సకలము అని సంశయ విపర్యయ రహితమైన జ్ఞానము (నిశ్చయము) కలుగుటయే బ్రహ్మజ్ఞానము కలుగుట అని భావము. ఇదియే ఉత్తమమైన జ్ఞానమని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు.

శ్లో॥ సర్వమాత్మైన నిర్దిష్టో భావాభావౌక్వవా స్థితౌ
క్వబంధమోక్షకలనే కిమన్యద్రాజ శోచ్యసి ॥33॥

తా॥ సకలము పరమాత్మస్వరూపముగా నుండగా ఉన్నదని లేదని చెప్పుటకు అవకాశము లేదు. బంధమని మోక్షమని భ్రమయెందుకు? ఓరాజా! ఎందుకువిచారించెదవు? నీవు బ్రహ్మస్వరూపుడవు.

శ్లో॥ నచైత్య మన్యన్నోచిత్తం బ్రహ్మైవేదం విజృంభతే
సర్వమేకం పరంబ్రహ్మ కో మోక్షః కాచబంధతా॥34॥

తా॥ చిత్తున్ను లేదు. చిత్తువల్ల కలిగిన మాయయు లేదు. సకలమును వ్యాపించి బ్రహ్మమే ప్రకాశించుచున్నది. కనుక సకలమూ బ్రహ్మస్వరూపమేను. బంధమోక్షములనునవికూడా భ్రమయేకాని నిజముకాదు.

శ్లో॥ బ్రహ్మేదం ప్రహితాకారం బృహద్బ్రంహ్వాదవస్థితం।
దూరాదస్తమితద్విత్వం భవాత్మైవ త్వమాత్మనా॥౮౦॥

తా॥ ప్రసిద్ధముగా మనకు అగుపడుచున్నది, అగుపడనిది కూడా బ్రహ్మస్వరూపముగా నున్నది, గొప్పది వ్యాపక స్వభావముగలది గాన బ్రహ్మ అని సంజ్ఞకలిగినది. ఓరాజా నీ మనస్సుచేతను నీవు బ్రహ్మస్వరూపుడవని తెలుసుకొనుము. భేదజ్ఞానము సుతరామూవిడచి లోపలను పైని ఉన్న సకలము బ్రహ్మస్వరూపమే అని భావింపుము.

శ్లో॥ ఋతమాత్మా పరబ్రహ్మ సత్యమిత్యాధికా బుధైః
కల్పితా వ్యవహారార్థం యస్యసంజ్ఞామహాత్మనః॥౮౧॥

తా॥ ఋతమని, ఆత్మఅని, పరబ్రహ్మమని, సత్యమని యీ పేర్లు అన్నియు పరమాత్మకే వర్తిస్తున్నవి. ఆత్మను బోధకొరకు వ్యవహారం నిమిత్తము కల్పించబడినవి గాన బ్రహ్మ వస్తువు ఒకటిగానే ఉన్నది. అంతకన్న వేరు కించిత్తైనా లేదు.

శ్లో॥ ఉపదేశాదయం వాదః జ్ఞాతేద్వైతంన విద్యతే॥౮౨॥

తా॥ పామరులకు బోధించుటకు పరమాత్మయందు ఈ నామరూపభేదములు కల్పించబడినవి. ఆత్మ సర్వపరిపూర్ణుడు అని తెలిసినపైని నామరూపములను విడచి సత్తారూపముగానున్న చిత్కళను సర్వవ్యాపకముగా భావించినప్పుడు ద్వైతము నశించును. ద్వైతమున్నట్టు తోచదు. అప్పటనూ అద్వైతము సిద్ధమగును,

## పరమాత్మ స్వరూపము.

శ్లో॥ మహాప్రళయ సంపత్తౌ సర్వకారణ కారణం
శిష్యతేతత్పరబ్రహ్మ తదిదంవర్ణ్యతేశృణు॥ ౪౩॥

తా॥ సకలజగత్తులు ప్రళయకాలమందు నసించగా సృష్టికి సర్వమునకు కారణముగానున్న వస్తువుమాత్రము నాశములేనిదై ఉండును. అట్టికాలమందు మిగిలినదే పరమాత్మ అనియు పరబ్రహ్మమనియు చెప్పబడుచున్నది. దానిని విరివిగా చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ నాశయిత్వా స్వమాత్మానం మనసోవృత్తిసంక్షయే।
యద్రూపం యదనాఖ్యేయం తద్రూపం తస్యవస్తునః ॥౪౪॥

తా॥ సర్వకారణమగు పరమాత్మ ఎప్పుడును వున్నది. అది ఎట్లుతెలుసుకోవలె నంటివేని వినుము. నేను, నాది, అనే భేదజ్ఞానమును విడచి మనస్సు వృత్తిరాహిత్యము కాగా నశించినదని, ఆరీతిని మనస్సు నసింపజేసినపైని బుద్ధిమాత్రము నశించకుండా ఉండవలెను. ఆకాలమందు ఎట్టిస్వరూపముండునో అదియే పరమాత్మ స్వరూపమని తెలుసుకోవలెను. అదియే చిద్రూపమని సర్వపరిపూర్ణమని అద్వైతమని చెప్పబడుచున్నది. అదియేతురీయ్యావస్థ; భూమాస్వరూపము. ఆత్మస్వరూపము. మాండూక్యమందు చెప్పిన తురీయ్యవస్తువు.

శ్లో॥ చితేర్జీవ స్వభావాయ యదచేత్యముఖోవపుః
చిన్మాత్రం విపులంశాంతం తద్రూపంపరమాత్మనః ॥ ౪౫॥

తా॥ జీవస్వరూపమగు చిత్తుయొక్క విషయముల కభిముఖము కానట్టియు, చిత్తుమాత్రము మిగిలియున్నట్టియు,

అనాది ఆగంతుకము అనే మలములు లేనట్టియు, నిర్వికార మగు యేరూపముగలదో అదియే పరమాత్మయగును.

శ్లో॥ మహాప్రళయసంపత్తా వసత్త్వాంస ముపాగతే।
అశేషదృశ్యే సర్గాదా శాంతమేవావ శిష్యతే ॥౭౬॥

తా॥ ప్రళయమందు సకలదృశ్యమూ నసించినపుడున్ను, సృష్ట్యాదిని ప్రకాశమానమైన బ్రహ్మమే ఉన్నదని భావము-

శ్లో॥ ఆస్తే నష్ట్వి-తో భా స్వానజో దేవో నిరామయః
సర్వదా సర్వకృత్పర్వః పరమాత్మా మహేశ్వరః॥౭౭॥

తా॥ సర్వమూ నశించగా పరమాత్మ మాత్రము ఉండునని, ఆపరమాత్మ ఎపుడును సర్వాంతర్యామిగా కలడని అతను నాశనరహితుడని అతడే సకలమునకు ఈశ్వరుడని ఆపరమాత్మస్వరూపము ఒకటేఅని తెలియుటయే కైవల్య ప్రాప్తి అని భావము.

శ్లో॥ యతోవాచో నివర్తంతే యోముక్తై రవగమ్యతే
యస్యచాత్మాదికాస్సం జ్ఞాః కల్పితా నస్వభావతః॥౭౮॥

తా॥ బ్రహ్మమందు సకలమూ కల్పితముగాన ఈ జగత్తుయందు ఆపరబ్రహ్మకు సాటిఅయిన మరియొకవస్తువు సామ్యముగా లేదనియు బ్రహ్మ ఏవికారములు లేనివాడుగాన నిర్వికారుడనియు అట్టిబ్రహ్మను తెలుసుకున్నవాడు ముక్తుడనియుభావము. మనోబుద్ధులు బ్రహ్మయందు కల్పితములుగాన బ్రహ్మను తెలుసుకోజాలవు.

శ్లో॥ సన్నప్యసన్ జగతియో యోదేహస్థోపిదూరగాః
చిత్ప్రకాశస్స్వయం యస్మాదాలోకఇవ భాస్వతః॥౪౯॥

తా॥ సూర్యునివలన ప్రపంచమెట్లు ప్రకాశించుచున్నదో ఏ పరమాత్మయుండియు లేనట్లు అగపడుచున్నదో ఏ పరమాత్మ దేహమందుండియు దూరమందున్నట్లు తోచుచున్నదో అట్టి పరమాత్మకలదు.

శ్లో॥ ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతిపూరుషః
కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమను సంజ్వరేత్॥౫౦॥

తా॥ సాధకుని సిగోమధ్యమున్న చిత్కళ సాక్షిగాను ప్రజ్ఞాన ఘనరూపముగాను ఉండి నఖశిఖపర్యంతమును సకలేంద్రియములకు చేతనత్వమును కలుగజేయుచున్నది. అదియే సాక్షిఅనియు ఆత్మఅనియు బ్రహ్మఅనియు వర్ణింపబడుచున్నది. అది నిత్యము; స్వప్రకాశము; ఆనందస్వరూపము; ఆవస్తువుతాననియు; దేహేంద్రియచిత్త జీవాదులు కల్పితములనియు తెలిసినట్లయితే తాను ఆత్మస్వరూపుడు, సర్వపరిపూర్ణుడుగాన ఇంక తాను కోరవలసినదేమియు లేదు. ఎందుకు శరీరమును తపింపజేయును? జ్ఞానికోరవలసినది. పొందవలసినదియేమియు లేదని భావము.

శ్లో॥ భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతేసర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టేపరావరే॥౫౧॥

తా॥ త్రిమూర్తులకన్న అధికుడైన తన శరీరమందున్న సాక్షిస్వరూప పరమాత్మయే తన నిజరూపమని జ్ఞానదృష్టిచేత నిశ్చయముగా తెలుసుకున్నపుడు శరీరత్రయము నేననే గ్రంధి

త్రియము విడిపోవును. సకల సంశయములు భ్రిమలు పను లును. ఆగామి, సంచిత, ప్రారబ్ధములనే కర్మత్రియము జనన మరణములకు కారణము. అది నశించినందున తిరిగి జన్మకు బీజమునశించి నందున పునర్జన్మలేదు. జీవన్ముక్తుడగును. అదియే ముక్తి అని మోక్షము అని భావము.

శ్లో॥ శుద్ధసంవిన్మయత్వాద్యః ఖంభ వే. ద్వ్యోమ చింతయా
పదార్థచింత యార్థత్వ మివ గచ్ఛ త్యధిష్ఠితః॥ ౫౨॥

తా॥ పరమాత్మ కేవలజ్ఞానమే స్వరూపముగా గలది- ఆకాశమువలె ధ్యానించినపుడు ఆకాశస్వరూపముగాను, ఘట పటాది పదార్థములనుగా భావించినపుడు వాటియందు సత్తా గానుండి పదార్థములుగాను, అగుపడును. బ్రహ్మవస్తువును ఎట్లుభావిస్తే అట్లేయగుపడును. తనజ్ఞానమే ప్రపంచముగా తోచుచున్నందున అంతయు బ్రహ్మమేయని భావము.

శ్లో॥ అస్వప్నాయా అనంతాయా అజడాయా మహామతే
యద్రూపంచిరనిద్రాయా స్తద్రూపం పరమాత్మనః ॥౫౩॥

తా॥ స్వప్నముకానిది, అంతములేనిది, అనగా జాగ్రత కానిది, నిద్రకానిది, బుద్ధిమంతుడవగు ఓరాజా! ఏస్వరూ పము తురీయావస్థయందుగలదో అది పరమాత్మస్వరూప మని భావము. జాగ్రిత్స్వప్న సుషుప్తులకన్న వేరైనది తురీయా వస్థ. అదియే బ్రహ్మావస్థ అని భావము.

శ్లో॥ వేదనస్య ప్రకాశస్య ద్రుశ్యస్య తమస స్తథా
వేదనం యదనాద్యంతం తద్రూపం పరమాత్మనః ॥౫౪॥

తా॥ మనోవృత్తికి, పదార్థప్రకాశమునకు, పదార్థజ్ఞానమునకు, అజ్ఞానమునకు, సాక్షిగనున్న జ్ఞానము పరమాత్మ స్వరూపము.

శ్లో॥ వేద్యవేదన వేత్రృత్వ రూపత్రియమిదం పురా
యతోఽభి దేత్యస్త మాయాతి తద్రూపం పరమాత్మనః॥

తా॥ తెలుసుకునేవాడు, తెలియబడే వస్తువు; తెలుసుకొనట అనే త్రిపుటి, ఆదిని ఎచటపుట్టినదో ఎచట లయమగుచున్నదో అది పరమాత్మస్వరూపము. త్రిపుటికి సాక్షిగాను పైగాను పరమాత్మయే ఉన్నదని భావము.

శ్లో॥ స్థావరాణాం హి యద్రూపం తచ్ఛేదోఽబోధమయం భవేత్
మనోబుద్ధ్యాది నిర్ముక్తం తత్పరేణోప మీయతే ॥౫౬॥

తా॥ బ్రహ్మను బోందించుటకు జగత్తులో వస్తువులను చెప్పుటకు అన్నియూ జ్ఞానస్వరూపముగా నున్నవి. జ్ఞానము లేనపుడు జగత్తులేదు. బోధించుటకు గ్రహించుటకు మనోబుద్ధులురెండును సాధనములుగా ఉన్నవి. ఆరెండును బ్రహ్మసత్తావలననే ఉన్నందున బ్రహ్మను గ్రహించలేవు. కనుక బ్రహ్మను బోధించుటకు ఉపమానము లేదని భావము.

## జీవస్వరూప విచారః
## ఆదౌ సూక్ష్మశరీర విచారః

శ్లో॥ పంచప్రాణ మనోబుద్ధి ర్దశేంద్రియసమన్వితం
అపంచీకృతభూతోత్థం సూక్ష్మాఙ్గం భోగసాధనం ॥౫౭॥

తా॥ ప్రాణాపానవ్యానోదాన సమానములనే ఐదు ప్రాణవాయువులును, మనస్సు బుద్ధి త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములనే జ్ఞానేంద్రియ పంచకము, వాక్పాణిపాద పాయూపస్థలనే కర్మేంద్రియ పంచకము; పంచీకరణము కాని ఆకాశాది భూతపంచకము; (పృథివ్యప్ తేజోవాయు రాకాశ ములు అయిదును) వీటిసమష్టి పదిహేడుతత్వములు కలసి సూక్ష్మశరీర మనబడుచున్నది. ఇదికర్మఫలముల ననుభవించేది.

జీవ స్వరూపము.

శ్లో॥ చైతన్యం యదధిష్ఠానం లింగదేహశ్చయఃపునః
చిచ్ఛాయా లింగదేహస్థా తత్సంఘోజీవ ఉచ్యతే॥౫౭॥

తా॥ సర్వత్ర మనకు అగుపడుచున్న ఆకాశమందు లీనమై సత్తారూపముగానున్న చిత్కళకు చిదాకాశమని సంజ్ఞ కలదు. పైనిచెప్పిన లింగదేహమనే కల్పనకు, చిత్తరువుకు గోడ అధిష్ఠానమైనట్లు, సర్వాధిష్ఠానమైన చిత్కళయున్ను, లింగదేహము యొక్క పదిహేడు తత్వముల సమష్టిన్ని, లింగ దేహమందు కలిగిన చిత్కళా ప్రతిబింబమున్ను కలసి యీమూడింటిమేళన (సముదాయము) జీవుడని వాడబడు చున్నది. వీటిలో మూడవదైన చిత్కళా ప్రతిబింబము ప్రధానమై నేను నాది అనే భేదజ్ఞానముకలిగి వ్యవహరించు బడుచున్నందున, అది జీవసంజ్ఞకలది. ప్రతిబింబము బింబా పేక్షయా మిథ్యగనుక బింబజ్ఞానము స్వస్వరూపజ్ఞానము కలిగినపుడు జీవత్వారోపణ తొలగించుచున్నది. చిదా కాశమందు సకలము కల్పితములైనందున సకలము చిన్మయ

ముగానున్నది. మట్టిగోడయందు నిర్మించిన చిత్తరువులన్నియు విమర్శించగా. మృణ్మయములు ప్రత్యక్షముగా నున్నవి. అటులనే జీవత్వము మిధ్యఅని గ్రహించవలెను.

జీవబ్రహ్మైకులకు అభేదము

శ్లో॥ ద్వైతం యధానాస్తి చిదాత్మ జీవయోః
తథైవ భేదోస్తి నచిత్తజీవయోః
యథైవభేదోస్తి నచిత్తజీవయోః
తథైవభేదోస్తి నచిత్త దేహయోః॥౫౯॥

తా॥ చిన్మయమైన పరమాత్మకు జీవాత్మకు భేదము లేదు. అటులనే జీవునకి చిత్తమునకు భేదము లేదు. అదే రీతిగా చిత్తమునకు జగత్తునకు స్థూలశరీరమునకును భేదము లేదు. కనుక జడములగు నామరూపములను ఉపేక్షించినపుడు వాటియందున్న సత్తాస్వరూపమైన చిన్మయమగు బ్రహ్మ స్వరూపమే మిగులును.

గద్య॥ రాజోవాచ॥ మహాఋషే! గురువర్య! స్వస్వరూపం బ్రూహీతి॥

ఋషిరువాచ॥

స్వస్వరూపము.

మహోపనిషతు. శ్లో॥ తద్బ్రహ్మానందమద్వంద్వంనిర్గుణం నిత్యచిద్ఘనం। విదిత్వాస్వాత్మనోరూపంనబిభేతికదాచన॥౬౦॥

తా॥ బ్రహ్మానందమే స్వభావముగా గలదిన్ని రెండవ వస్తువులేనిదన్ని సత్వాది గుణరహితమైనదిన్ని కాలత్రయములయందున్ను ఏకాకారముగా ఉన్నదిన్ని అఖండాకార

చిన్మయమైనదిన్ని ఈలక్షణములుగల తననిజరూపమును పరమాత్మగా తెలుసుకొన్నట్లయితే తనయందున్న సాక్షియే తననిజరూపమని తెలసినపుడు ఈశరీరమున్నంత వరకు జీవన్ముక్తుడు. తరువాత బ్రహ్మత్వము గలవాడగును. వారికి ఇపుడున్నూ భయములేదు. దేహాంతమందున్ను భయములేదు.

శ్లో॥ స్వరూపావస్థితి ర్ముక్తి స్తద్భ్రంశోహం త్వవేదనం
శుద్ధసాత్త్వికసంవిత్తే స్స్వరూపాన్న చలంతియే।
రాగద్వేషాద్వయోభావా తేషాం నాజ్ఞత్వసంభవాః॥౬౧॥

తా॥ తన నిజరూపము చిన్మయుడగు సాక్షిఅని తెలుసుకుని దానియందు స్థిరుడుగా ఉండడమే ముక్తి. అదిలేక దేహేంద్రియాదులు తాననే బుద్ధికలుగుటయే బంధము. నిర్మలమైన బ్రహ్మజ్ఞానమే తనస్వరూపమని నిశ్చయము కలిగి చలించకుండా ఎవరుఉందురో వారికి రాగద్వేషాదులు కలుగవని భావము.

శ్లో॥ యత్స్వరూపపరిభ్రంశ శ్చేత్యార్థే చితిమజ్జనం
ఏతస్మాదపరో మోహో నభూతో న భవిష్యతి ॥౬౨॥

తా॥ తన నిజరూపము చిన్మయమని మరచి దేహజీవాదులు నేనని వ్యవహరించుట అనేది ఏదికలదో అది చిత్తువల్ల జగత్తు అనేప్రకృతి పుట్టినదని, అట్టి జగత్తుఅనే ప్రకృతియందు చిత్తు మునిగిపోయినదని భావము. ఇంతకన్న వేరే మోహమనేది ఇదివరకులేదు. ముందును కలుగదు. ఇదియే మోహమని భావము. కార్యముపుట్టినపైని దానికి

కారణము లేదనడమే మోహము. ఇంతకన్న మోహమనేది వేరులేదని భావము.

శ్లో॥ అర్థాదర్థాంతరం చిత్తే యాతిమధ్యేతు యాస్థితిః
సాధ్వ స్త మననాకారా స్వరూపస్థితి రుచ్యతే ॥౬౩॥

తా॥ తనమనస్సు ఒకవిషయమును విడచినదై మరియొక విషయమును పొందలేదు. ఆ మధ్యకాలమునందు మనస్సు నిర్విషయముగా నుండును. అదియే తన నిజరూపమని గ్రహించవలెను.

శ్లో॥ సంశాంతి సర్వసంకల్పా యాశిలావదవస్థితిః
జాగ్రన్నిద్రా వినిర్ముక్తా సాస్వరూప స్థితిః పరా ॥౬౪॥

తా॥ మనస్సును వృత్తిశూన్యముచేసి బుద్ధి లయము కాకుండా నిలిపినపుడు మనస్సులేనందున ద్వైతజ్ఞానము లేదు. జాగ్రతకాదు. బుద్ధి లయించలేదు గాన నిద్రకాదు. రాయి వలెను చలించకుండా ఉన్నపుడు స్వస్వరూపమందున్న వారికి ఇదియే తుర్యావస్థయు బ్రహ్మావస్థయు అగును.

శ్లో॥ అహంతాం శేశ తేశాంతే భేదనిష్పంద చిత్తతా
అజడాయా ప్రచకతి తత్స్వరూప మితీరితం ॥౬౫॥

తా॥ నేను నాది అనే భేదజ్ఞానము తగ్గిపోగా చిత్తము చలించకుండాఉండును. బుద్ధి ప్రకాశించుచున్నందున జడత్వములేక ఏఅవస్థ ప్రకాసించునో అదిస్వస్వరూప మనబడును. ఇదియూ తురీయమని చెప్పబడును.

శ్లో॥ పంచకోశపరిత్యాగే సాక్షిబోధావశేషతః
స్వస్వరూపం స ఏవస్యా చ్ఛూన్యత్వం తస్యదుర్ఘటం॥౬౬॥

తా॥ సాధకునికి స్థూలసూక్ష్మ కారణములనే మూడు శరీరములు కలవు. అవియే అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనే పంచకోశములుగా నున్నవి. వీటియందు చిద్రూపుడగుసాక్షి జీవస్వరూపముగా నున్నాడు. పంచకోశములలో పరమాత్మ ఏది అని విచారించగా వకదానికన్న నొకటి అధికముగా నగుపడి ఏదియు నిజముకాకపోయెను. ఇట్లు విచారించగా పంచకోశములను తోసివేయగా వీటిని విచారించిన సాక్షియేమిగిలినది గాన ఆ సాక్షియే స్వస్వరూపముగా నున్నదని భావము. సాక్షి స్వరూపబోధను లేదనుటకు దుర్ఘటముగాన సాక్షి ఉన్నది. అది తన నిజరూపమని భావము.

—◆ప రా హో ప ని ష త్తు◆—

శ్లో॥ స్వస్వరూపంతు చిన్మాత్రం సర్వదా సర్వదేహినాం
నైవదేహాది సంఘాతో ఘటవ ద్దృశిగోచరః॥౬౭॥

తా॥ ప్రతిమనిషికిని ఈ శరీరమున్నపుడును లేనపుడును ఎల్లప్పుడు చిత్కళయే తన నిజరూపముగా నున్నది. ఘటపటాదులవలె అగుపడుచున్న తన శరీరము, ఇంద్రియాదులు తన నిజరూపములుకావు.

శ్లో॥ స్వాత్మనోన్యతయా భాంతం చరాచరమిదం జగత్
స్వాత్మ మాత్రతయా బుధ్వా తదస్మీతి విభావయ॥౬౮॥

తా॥ తనకన్న వేరుగా నగుపడుచున్న చరాచరాత్మకమైన జగత్తు అంతయు ఆత్మస్వరూపమేగాని వేరుకాదని

తెలుసుకొని తనకు, జగత్తుకు భేదములేదని అంతా బ్రహ్మస్వరూపమని, తానునూ బ్రహ్మస్వరూపమని భావించుము.

శ్లో॥ స్వస్వరూపం స్వయంభుక్తే నాస్తిభాజ్యం పృథక్స్వతః
అస్తిచేదస్తితారూపం బ్రహ్మైవాస్తి స్వలక్షణం॥ ౯౯॥

తా॥ బ్రహ్మజ్ఞానము తెలియవలెనని బ్రహ్మానంద మనుభవించవలెనని కోరుటఅజ్ఞానము. తనరూపమును తెలుసుకొని తాను సంతోషించుటయే బ్రహ్మానందమని తెలియవలెను. తనకన్న అనుభవించుటకు వేరు వస్తువు లేదు. అగుపడనిది సత్తాగానున్నదని వేదశాస్త్రములవల్ల తెలియబడినది. అది బ్రహ్మయేఅని తెలుసుకోవలెను.

శ్లో॥ బ్రహ్మ విజ్ఞాన సంపన్నః ప్రతీత మఖిలం జగత్
పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్ ॥ ౭౦॥

తా॥ బ్రహ్మజ్ఞానము కలవారికి జగత్తు భేదముగా అగుపడుచున్నను అంతయు తానును బ్రహ్మాకారము గానే చూచునుగాని తనకన్న జగత్తును వేరుగా జూడరు.

గద్య॥ రాజా; మునే! సర్వం చిద్రూపేణాస్తీత్యుక్తం చిద్రూపంకీదృశమితి. మునిః॥ రాజన్! చిదాకారం శృణు.

తా॥ రాజు అడుగుచున్నాడు హేమునే అంతయు చిన్మయమని శలవిచ్చిరి. చిత్తనగా నెట్టిదో శలవియ్యవలెనని అడగగా మునీశ్వరుడు చెప్పుచున్నాడు.

## — చిద్రూపము —

శ్లో॥ నానందం ననిరానందం నచలం నాచలం స్థిరం
నసన్నాసన్నచే తేషాం మధ్యం జ్ఞాని మనోవిదుః॥ ౭౧॥

తా॥ చిత్తనగా ఆనందముకాదు, ఆనందములేనిదికాదు, చలించేదికాదు స్థిరమును కాదు, వీటిమధ్య నుండేదిన్ని కాదు, ఘటపటాదులవలె అగుపడేదికాదు, వంధ్యా పుత్రుడు, గగనారవిందమువలెను శూన్యమున్ను కాదు. వీటి నన్నిటిని తెలుసుకొనే జ్ఞానమే చిద్రూపము. బ్రహ్మవేత్తల మనస్సువృత్తి రహితమై కేవల చిద్రూపము పరిపూర్ణముగా నుండునని భావము. అది కోటిసూర్యకాంతియు కోటిచంద్ర సీతలము కలిగి ఆద్యంత రహితముగాను సర్వ పరిపూర్ణముగాను ఉండును.

శ్లో॥ యథాసౌక్ష్మ్యాచ్చిదాకాశ్య ఆకాశో నోపలభ్యతే
తథానిరంశ శ్చిద్భావ స్సర్వగోపి నలభ్యతే॥౭౨॥

తా॥ ఆకాశము అతినిర్మలము, అతిసూక్ష్మము కలదై నందున చిత్కలచేత పరిశోధించుచున్నదై చూచుటకు ఎట్లు శక్యముకాకున్నదో ఆరీతినే నిరంశ అయిన చిత్కల మన లోపల పైని అంతటను వ్యాపించి ఉన్నను చూచుటకు శక్యముకానేరదు. అవకాశమే ఆకాశము. శబ్దమువల్ల ఆకాశమున్నదని తెలియుచున్నది. అశబ్దముకూడా లేనిది చిదాకాశమని బ్రహ్మస్వరూపమని తెలుసుకోవలెను. సర్వమందును సత్తారూపముగా నున్నదే చిత్కల అని గ్రహించవలెను. ఈ భూతాకాశమునకు ఆధారముగా నున్నది చిదాకాశము.

శ్లో॥ సర్వసంకల్పరహితా సర్వసంజ్ఞా వివర్జితా
సైషా చిదవినాశాత్మా స్వాత్మే త్యాది కృతాభిధా॥

తా॥ చిత్కలకు నామములేదు రూపము లేదుగదా ఎట్లు భావించవలెనంటివేని చిత్కల అనగా బ్రహ్మవస్థ. అది ఎట్టిదనిన ఎట్టి సంకల్పములేనిది; ఎట్టి సంజ్ఞలు లేనిది, ఆద్యంతములు లేనిది, నాశములేనిది, సకలజనులయందు ఆత్మస్వరూపముగా నున్నది, అది చిత్కల అని బ్రహ్మవస్థఅని పరమాత్మ అని తెలుసుకోవలెను. ప్రతిశరీరమందును ఉండి నేను నాది అని వాడబడుచున్నది. దానిని నామములు శరీర జీవాములనిన్ని బ్రహ్మవేత్తలు సాక్షి అనిన్ని చిత్కల అనిన్ని వాడుచున్నారు. అదేచిదమాత్రముగా నున్నది.

శ్లో॥ ఆకాశ శతభాగాచ్ఛా జ్ఞేషు నిష్కళ రూపిణీ
సకలామల సంసార స్వరూపైకాత్మ దర్శినీ॥౭౮॥

తా॥ మనకు అగుపడే అన్నివస్తువులకన్న ఆకాశము నిర్మలమైనందున అగుపడలేదు. చిత్కల ఆకాశముకన్న నూరు భాగములు అధికనిర్మలమైనది. తెలుసుకుందామనే మనయందు నిరంశగా యున్నది. ఇక చిత్కలకు రూపమేదనిన మనకు అగుపడే సంసారమందుగల సకలరూపములును చిత్కల సత్తావల్లనే ప్రకాసించు చున్నవిగాన సకల ప్రపంచాకారము గలదని భావము. ప్రపంచమందుగల సకల రూపములే చిత్కలకు స్వరూపము.

శ్లో॥ నాస్తమేతి నచోదేతి నోత్తిష్ఠతి నతిష్ఠతి
నచయాతి నచాయాతి నచనేహా నచేతరత్
సైషా చిదమలాకారా నిర్వికల్పా నిరాస్పదా॥౭౯॥

తా॥ చిత్కళలకు ఉదయము అస్తమయము లేవు లేచేది కూర్చునేదికాదు. పోయేది వచ్చేది కాదు. ఇచట వున్నది మరియొకచోట లేనిది కాదు. వికల్పము లేనిది. సకలముకు చిత్కలే ఆధారముకాని చిత్కలకు మరియేదియు ఆధారము లేదు. నిర్మలమైన ఆకారముకలది. అట్టిజ్ఞానమే చిత్కలా స్వరూపమని గ్రహించవలెను.

—♦ సాక్షిస్వరూపము—బ్రహ్మోపనిషతు ♦—

శ్లో॥ కర్తారంచ క్రియాం తద్వ ద్వ్యావృత్త విషయానపి
స్ఫోరయే దేకయత్నేన యోసౌ సాక్ష్యత్ర చిద్వపుః॥౭౬॥

తా॥ నాటకశాలయందున్న దీపము ఏకాకారముగా నుండియు నాటకులను వస్తుసముదాయమును సభికులను ఎట్లు ప్రకాశింపజేయుచున్నదో అట్లులనే మనయందున్న ఆత్మ స్వరూపమైన జ్ఞానము కర్తను కర్మను క్రియలను కూడా ప్రకాసింపజేయుచున్నది. అట్టి చిద్రూపమైన జ్ఞానమే సాక్షి స్వరూపమని భావము.

శ్లో॥ ఏకోదేవస్సర్వ భూతేషుగూఢ స్సర్వ వ్యాపీ సర్వభూ
తాంతరాత్మా। కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాసస్సా
క్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥౭౭॥

తా॥ ప్రకాశమానమైన ఒక పరమాత్మయే సకల భూతములందు గుప్తముగా నుండి బ్రహ్మాండ పిండాండముల పైని లోపల వ్యాపించి ఉన్నాడు. సకల జీవులయందును ప్రాణి రూపముగా (ఆత్మస్వరూపముగా) నున్నాడు. కర్మఫల ముల నిచ్చువాడు. సకలభూతములు స్థానముగా గలవాడు. ఇట్టి

ధర్మములుగల పరమాత్మ సాక్షి అని చిత్తని కేవలుడని నిర్గుణుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ ఏకోవశీ సర్వభూతాంతరాత్మా ఏకంరూపం బహుధాయః కరోతి। తమాత్మస్థం యేనుపశ్యంతి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేత రేషాం॥౭౮॥

తా॥ చిద్రూపమైన ఏపరమాత్మ (ద్వితీయ వస్తువు లేనిది) ఒకడుగా నున్నాడో, ఎవడు సర్వ స్వాతంత్ర్యుడై సకలమును తన స్వాధీనము కలవాడో, ఎవడు సకలభూతములందును జీవస్వరూపముగానున్నాడో, ఎవడు ఒకటిగా నున్న తనరూపమును జలచంద్రులు దర్పణ ప్రతిబింబములవలెను అనేక రూపములుగా చేయుచున్నాడో తమ ఆత్మయందున్న అట్టి సాక్షి తన నిజరూపమని తాము సాక్షిస్వరూపుడని ధైర్యవంతులైన ఏపురుషులు జ్ఞానదృష్టిచేత చూచుచున్నారో వారు శాశ్వత సుఖము బ్రహ్మనందముగలవారై ఉత్తమ లోకములను పొందుదురు. అట్టిజ్ఞానము లేనివారు సుఖమును పొందలేరు. ఇతరులను సుఖమును పొందించలేరు. దుఃఖవంతులే అని భావము.

శ్రు॥ అక్షప్రాబల్యే సత్యేఖిలాత్మా న్నిరస్య
స్వలక్ష్య ధారణం ధీరత్వం॥

తా॥ ఇరువదినాలుగుతత్వములలోను, పంచాశత్ యాబది వర్ణములలోను, నిమిడి సత్తారూపముగా సాక్షి ఉండగా సకలమును విడిచి సత్తారూపమగు పరమాత్మను గ్రహించుట ధీరత్వము. విచారణచేత అనాత్మలైన దేహేంద్రియాదులను

విడచి వాటికి చైతన్యమును సత్తాను కలుగ చేసే సాక్షిని గ్రహించుట ధీరత్వము.

—♦ కైవల్యోపనిషతు ♦—

శ్లో॥ త్రిషుధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చయద్భవేత్।
తేభ్యోవిలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదా శివః॥ ౭౯॥

తా॥ స్థూల సూక్ష్మ కారణ శరీరములందును జాగ్రత్స్వప్న సుషుప్తులయందును అనుభవించేవాడును అనుభవింపబడేది అనుభవరూపమైన భోగము ఈ త్రిపుటికి విలక్షణుడై వేరుగా నున్నవాడు సాక్షి. ఆసాక్షియే నేను, నేనని వ్యవహరించబడుచున్నాడు. అతడే చిత్కళాస్వరూపుడు. అతడే సదా శివుడు అని తెలుసుకోవలెను.

శ్లో॥ సాక్షి భూతే సమే స్వచ్ఛే నిర్వికల్పే చిదాత్మని
నిరిచ్ఛన్ప్రతి బింబంతి జగంతి ముకురేయథా॥ ౮౦॥

తా॥ వికల్పరహితమైన సర్వపరిపూర్ణమైన అతినిర్మలమైన, సాక్షి స్వరూపమైన చిద్రూప పరమాత్మయందు లేని జగత్తులు అద్దమందు ప్రతిబింబమువలెను అగుపడుచున్నవి ప్రత్యక్షముగానివి అసత్యములు గనుక వీటిని తెలుసుకో నక్కరలేదు. జలమందు మత్స్యములువలెను ఆకసమందు పక్షులువలెను చిద్రూపమైన అఖండాకార బ్రహ్మతేజస్సుయందు ప్రపంచమున్నదని భావము. కనుక ఆత్మసంబంధము లేనిది వేరైనది ఏదియులేదు. అంతయు ఆత్మస్వరూపమేను అని భావము.

శ్లో॥ ఏకంబ్రహ్మ చిదాకాశం సర్వాత్మక మఖండ స్థితం
ఇతి భావయయత్నేన చేత శ్చాంచల్య శాంతయే॥౨౧॥

తా॥ మన శరీరమందును ప్రపంచమందును అనేక రూపములు అనేక నామములుగల పదార్థములగుపడుచున్నం దున ఇందులో పరమాత్మ ఏది అనే సంశయము చిత్త చాంచల్యము కలుగుచున్నది. దీని నివృత్తికి ఉపాయము చూపించు చున్నారు. ఆకాశము సర్వపరిపూర్ణమని సర్వానుభవములో నున్నది. చిదాత్మ ఆకాశమువలెనే సర్వవ్యాపకముగలది గనుక ఒకటిగానున్న బ్రహ్మవస్తువు చిదాకాశమను సంజ్ఞకలది. ఆచిదాకాశమందు సకలప్రపంచము ఉన్నది. ఆకాశము శబ్ద గుణముకలది. చిదాకాశమునందు అట్టి శబ్దమున్ను లేదు. కాన సర్వానుభవములోనున్న ఆకాశముకాదు. దాని సంబంధము లేదని, ఇట్లున్న చిదాకాశమును భావనచేసేయెడల చిత్త చాంచల్యము వదలునని చెప్పిరి. చిదాకాశమందు సర్వమూ నున్నందున అంతయు చిన్మయముగానే ఉన్నది. ఎట్లు ఘట మంతయు మృణ్మయమో అట్లే జగత్తు అంతయు చిన్మయ ముగా నున్నదని భావము.

శ్లో॥ సర్వసాక్షిణ మాత్మానం వర్ణాశ్రమ వివర్జితం
బ్రహ్మరూప తయా పశ్యన్ బ్రహ్మైవభవతిస్వయం॥౨౨॥

తా॥ వర్ణభేదము ఆశ్రమభేదము లేనిదియు సకల ప్రాణులందును సాక్షిస్వరూపముగా నున్న ఆత్మయే బ్రహ్మ స్వరూపముగా జ్ఞానదృష్టిచేత చూచినపుడు తానును బ్రహ్మ స్వరూపుడగుచున్నాడు. "శ్రు॥ బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి"

అని తా॥ బ్రహ్మను పూర్తిగా తెలుసుకున్నవాడు బ్రహ్మ స్వరూపుడగుచున్నాడు. "శ్రు॥ బ్రహ్మవిదాప్నోతిపరం" తా॥ బ్రహ్మను తెలుసుకున్నవాడు త్రిగుణాతీతమైన సాక్షి స్వరూపమును పొందుచున్నాడు.

శ్లో॥ అజ్ఞానాంధతమో రూపం ధర్మ కర్మాది లక్షణం
స్వయం ప్రకాశమాత్మానం నైవమాంస్ప్రష్టు మర్హతి॥

తా॥ వరాహస్వరూపుడగు పరమాత్మ చెప్పుచున్నాడు: విధినిషేధ రూపధర్మములు ఆగామిసంచిత ప్రారబ్ధములనే కర్మలక్షణములుగా నున్న అంధతమో రూపమైన అజ్ఞానము స్వప్రకాశమైన ఆత్మస్వరూపుడనగు నన్ను స్పృశించలేదు. శ్రు॥ అసంగోయం పురుషః॥ తా॥ ఈ పరమాత్మ అసంగుడు. అని శ్రుతిప్రమాణము॥ ఏదియు దీనిని అంటనేరదు అని భావము.

శ్లో॥ పరిపూర్ణః పరాత్మాస్మిం దేహే విద్యాధి కారిణీ
బుద్ధే స్సాక్షి తయా స్థిత్వా స్ఫురన్నహ మితీర్యతే॥౨౪॥

తా॥ శుక్లయజుశ్శాఖాంతర్గతమైన బృహదారణ్యకోపనిషదునందుగల "అహం బ్రహ్మాస్మి" అనే మహావాక్యమందుగల అహము అనేపదము సాక్షిస్వరూపమును తెలుపుచున్నది. స్వభావముగా దేశకాల వస్తుభేదము లేక అంతటను నిండియున్న పరమాత్మ మాయాకల్పితమైన జగత్తునందు విద్యాసంపాదన యోగ్యమైన (శ్రవణాదులకు యోగ్యమైన) ఈ మానుషదేహమందు బుద్ధి అనే సూక్ష్మశరీరమునకు సాక్షిగానుండి [అధికారిగానుండి] ప్రకాసించుచు ఆబుద్ధికి

శ్లో॥ ఏకంబ్రహ్మ చిదాకాశం సర్వాత్మక మఖం స్థితం
ఇతి భావయ యత్నేన చేత శ్చాంచల్య శాంతయే॥౨౧॥

తా॥ మన శరీరమందును ప్రపంచమందును అనేక రూపములు అనేక నామములుగల పదార్థములగుపడు చున్నం దున ఇందులో పరమాత్మ ఏది అనే సంశయము చిత్త చాంచ ల్యము కలుగుచున్నది. దీని నివృత్తికి ఉపాయమును చూపించు చున్నారు. ఆకాశము సర్వపరిపూర్ణమని సర్వానుభవములో నున్నది. చిదాత్మ ఆకాశమువలెనే సర్వవ్యాపకముగలది గనుక ఒకటిగానున్న బ్రహ్మవస్తువు చిదాకాశమను సంజ్ఞకలది. ఆచిదాకాశమందు సకలప్రపంచము ఉన్నది. ఆకాశము శబ్ద గుణముకలది. చిదాకాశమునందు అట్టి శబ్దమున్ను లేదు. కాన సర్వానుభవములోనున్న ఆకాశముకాదు. దాని సంబంధము లేదని, ఇట్లున్న చిదాకాశమును భావనచేసేయడల చిత్త చాం చల్యము వదలునని చెప్పిరి. చిదాకాశమందు సర్వమూ నున్నందున అంతయు చిన్మయముగానే ఉన్నది. ఎట్లు ఘట మంతయు మృణ్మయమో అట్లే జగత్తు అంతయు చిన్మయ ముగా నున్నదని భావము.

శ్లో॥ సర్వసాక్షిణ మాత్మానం వర్ణాశ్రమ వివర్జితం
బ్రహ్మరూప తయా పశ్యన్ బ్రహ్మైవభవతిస్వయం॥౨౨॥

తా॥ వర్ణభేదము ఆశ్రమభేదము లేనిదియు సకల ప్రాణులందును సాక్షిస్వరూపముగా నున్న ఆత్మయే బ్రహ్మ స్వరూపముగా జ్ఞానదృష్టిచేత చూచినపుడు తాను బ్రహ్మ స్వరూపుడగుచున్నాడు. "శ్రు॥ బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి"

అని తా॥ బ్రహ్మను పూర్తిగా తెలుసుకున్నవాడు బ్రహ్మ స్వరూపుడగుచున్నాడు. "శ్రు॥ బ్రహ్మవిదాప్నోతిపరం" తా॥ బ్రహ్మను తెలుసుకున్నవాడు త్రిగుణాతీతమైన సాక్షి స్వరూపమును పొందుచున్నాడు.

శ్లో॥ అజ్ఞానాంధతమో రూపం ధర్మ కర్మాది లక్షణం
స్వయం ప్రకాశమాత్మానం నైవమాంస్ప్రష్టు మర్హతి॥

తా॥ వరాహస్వరూపుడగు పరమాత్మ చెప్పుచున్నాడు: విధినిషేధ రూపధర్మములు ఆగామిసంచిత ప్రారబ్ధములనే కర్మలక్షణములుగా నున్న అంధతమో రూపమైన అజ్ఞానము స్వప్రకాశమైన ఆత్మస్వరూపుడనగు నన్ను స్పృశించలేదు. శ్రు॥ అసంగోయం పురుషః॥ తా॥ ఈ పరమాత్మ అసంగుడు. అని శ్రుతిప్రమాణము॥ ఏదియు దీనిని అంటనేరదు అని భావము.

శ్లో॥ పరిపూర్ణః పరాత్మాస్మిం దేహే విద్యాధి కారిణీ
బుద్ధే స్సాక్షి తయా స్థిత్వా స్ఫురన్నహ మితీర్యతే॥౮౪॥

తా॥ శుక్లయజుశ్శాఖాంతర్గతమైన బృహదారణ్యకోపనిషదునందుగల "అహం బ్రహ్మాస్మి" అనే మహావాక్యమందుగల అహమనేపదము సాక్షిస్వరూపమును తెలుపుచున్నది. స్వభావముగా దేశకాల వస్తుభేదము లేక అంతటను నిండియున్న పరమాత్మ మాయాకల్పితమైన జగత్తునందు విద్యాసంపాదన యోగ్యమైన (శ్రవణాదులకు యోగ్యమైన) ఈ మానుషదేహమందు బుద్ధి అనే సూక్ష్మశరీరమునకు సాక్షిగానుండి [అధికారిగానుండి] ప్రకాసించుచు ఆబుద్ధికి

స్ఫురణశక్తిని కలుగజేయుచు అహమని చెప్పబడుచున్నది. బుద్ధికి స్ఫురణశక్తిని గలుగజేసే పరమాత్మయే బుద్ధికి వేరుగా నున్న సాక్షి స్వరూపుడు. అహమని నేను నాది అని వాడబడు చున్నాడు. నేను అనే పదమునకు వాస్తవార్థము తుర్యావస్థాభిమానియగు సాక్షి పరము. స్థూలదేహము నేనని సూక్ష్మదేహము అగు జీవుడు నేననే అభిమానమే అజ్ఞానము. ఇది సాక్షి స్వరూపముగా గ్రహించవలెను. మనయందున్న తెలివియే సాక్షిఅని ఆత్మఅని బ్రహ్మఅని భావము.

—♦ సాక్షిస్థాన వివరణ-అవస్థా భేదకారణమున్ను ♦—

శ్లో॥ నేత్రేజాగరణం విద్యాత్కంఠే స్వప్నం సమావిశేత్
సుషుప్తం హృదయస్థంతు తురీయ్యం మూర్ధ్నిసంస్థితం॥

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయ్యములనే నాలు అవస్తలును మనోబుద్ధుల స్థానభేదమువలన కలుగుచున్నవి. సంకల్ప వికల్పాత్మకము మనస్సు (వృత్తికలుగుట మనస్సని). ॥ఇది॥ విమర్శాంశము శక్తిస్వరూపము బుద్ధిఅని ఆయాస్థానము లందు మనోబుద్ధులు పొందినప్పుడు ఆయా అవస్తలు జీవునికి కల్గుచున్నవి. మనోబుద్ధులు రెండును నేత్రములను పొంది ఉన్నపుడు జాగ్రతావస్త అనియు తదభిమానియగు జీవుడు విశ్వుడని వాడుక. అవి కంఠగతమైనపుడు స్వప్నము; దదభిమానియగు జీవుడు తైజసుడు హృదయగతమైనపుడు సుషుప్తి. తదభిమానియగు జీవుడు ప్రాజ్ఞుడు శిరోమధ్యను పొందినపుడు తురీయ్యము. తదభిమానియగు జీవునికి సాక్షి అని సంజ్ఞ. తురీయ్యము తురీయ్యాతీతము రెండును బ్రహ్మావస్తలు. శివస్వరూ

పములు. జాగ్రత్స్వప్న సుషుప్తులు మూడును ప్రకృతిభాగములు. ఇవిమూడుమాత్రము స్వాజ్ఞానానుభవములో నున్నవి. ముక్తిని గోరువారు పౌరుషప్రయత్నమున తురీయ్య, తురీయ్యాతీతములు, రెండును అభ్యసించవలెను అవుడు నిత్యసుఖము స్వరూపజ్ఞానము సంభవించును గాన ఈ అవస్థాభేదములు ముఖ్యముగా తెలుసుకోతగినవి.

—పంచవిధ భ్రమలు-వీటి పరిహారము—

అన్న పూర్ణోపనిషతు॥ ఋభుడనే మహాఋషి నిదాఘుడనే మహాఋషికి ఉపదేశించినది.

శ్లో॥ భ్రమః పంచవిధోభాతి తదేవేహసముచ్యతే॥౮౬॥

తా॥ భ్రమఅనేది అయిదువిధములుగా నున్నది. అదియే ఇచట స్పష్టముగా చెప్పబడుచున్నది.

శ్లో॥ జీవేశ్వరో భిన్నరూపావితి ప్రాథమికో భ్రమః॥౧॥

బింబ ప్రతిబింబ భావేన భేదభ్రమోనివృత్తః॥౮౭॥

తా॥ జీవేశ్వరులు వేరువేరు స్వరూపములు గలవారం అని ప్రథమభ్రమ

పరిహారము॥ వీరిద్దరున్న బింబ ప్రతిబింబ సమానులుగా నున్నందున వీరికి భేదములేదని తెలుసుకున్నపుడు ఈ భేదభ్రమ నివారణఅయినది. ఈశ్వరుడు ఆకాశమందున్న చంద్రబింబసమానుడు. జీవుడు జలఘటమందున్న చంద్రప్రతిబింబ సమానుడు. వీరు వేరుగా నగుపడినను ప్రతిబింబ చంద్రు

నికి గల చలనాదులు జలసంపర్కముచేత కలిగినవి బింబభూత మైన చంద్రునికి లేవు. అటులనే జీవునికిగల సుఖదుఃఖములు ప్రకృతివల్లకలిగినవి. ఈశ్వరునికిలేవు. సాక్షికిలేవని. గనుక జీవత్వము ప్రతిబింబసమానము గనుక మిథ్యగానున్నది. ఈ దృష్టాంతముచేత భేదభ్రిమ పోయినది.

శ్లో॥ ఆత్మనిష్టం కర్తృగుణం వాస్తవం వాద్వితీయ్యకం ॥౨॥
స్ఫటిక లోహిత దరిశనేన పారమార్థికకర్తృత్వ భ్రమో నివృత్తః ॥౨॥

తా॥ ఆత్మయందారోపించబడిన కర్తృత్వ భోక్తృత్వ ములు నిజమాఅని రెండవభ్రిమ కలిగినది.

పరిహారము॥ నిర్మలమైన తెల్లని స్ఫటికమునందు ఎర్రని మంకెనపుష్ప సంబంధమువలన ఎరుపురంగు అగుపడు చున్నది. ఈరంగు స్ఫటికమునకు వాస్తవముకానట్లు జీవ ధర్మములైన కర్తృత్వ భోక్తృత్వములు ఆత్మకులేవని రెండవ భ్రిమ నివారణమైనది.

శ్లో॥ శరీరత్రియసంయుక్త జీవస్సంగీ తృతీయకః ॥౩॥
ఘట మఠాకాశ దర్శనేన సంగీతీ భ్రిమో నివృత్తిః॥౩॥

తా॥ శరీరత్రియమందున్న జీవునికి వాటితో సంబంధ మున్నదా అని మూడవభ్రిమ॥

పరిహారము॥ మఠాకాశ ఘటాకాశ మహాకాశ దృష్టాంతముచేత శరీరత్రియమందున్న జీవునికి శరీరత్రియ

సంబంధములేదు. ఆత్మకు సుతరామూ సంబంధములేదు అని భావము. బహిరంగముకు మఠము ఘటము అని ఉపాధిభేదమే గాని వాటియందున్న ఆకాశమును భేదములేనట్లు జీవునికి శరీరములనే ఉపాధిని విడచినప్పుడుని వాస్తవమగు స్వరూప జ్ఞానము కలిగినందున పరమాత్మ చిదాకాశ రూపముతో అఖండాకార రూపము గలదిగాని భేదములేదని భావము. భేదజ్ఞానముగల అజ్ఞానికి జన్మ పరంపరా ఉండును. అభేదము. అఖండాకార జ్ఞానము కల జ్ఞాని ముక్తుడగును అని భావము.

శ్లో॥ జగత్కారణ రూపస్య వికారిత్వం చతుర్థకః ॥౯॥

కనకరుచిక దర్శనేన వికారిత్వభ్రమో నివృత్తః ॥౧౦॥

తా॥ జగత్తుకు కారణరూపమైన పరమాత్మకు జగద్రూపమైన వికారత్వము అనగా మార్పుకలదా అనినాలుగో భ్రమ॥

పరిహారము॥ బంగారముచేత చేయుబడిన నగలు అనగా కంకణ హారాద్యాభరణములు మొదలయినవి అనేకరూపములుగానున్నవి. బంగారముచేత చేయుబడి నగలు అనేక భేదములుగా వికారమును పొందిననూ బంగారము యెల్లప్పుడునూ వికారమును పొందనట్లు జగత్తుకే వికారములు మార్పులు గలవుగాని జగత్కారణమయిన ఆత్మకు ఏవికారములునూ లేక సర్వదా ఏకాకారముగనే ఉన్నదని భావము. ఈదృష్టాంతముచే నాలుగోభ్రమ వదలినది.

శ్లో॥ కారణాద్భిన్న జగత స్సత్యత్వం పంచమో భ్రమః ॥౫॥

రజ్జుసర్ప దర్శనేన జగత్సత్యత్వ భ్రమోనివృత్తః॥౧౧

తా॥ ప్రత్యక్షముగానున్న జగత్తు కార్యముగాను పరమాత్మ కారణముగాను ఉండగా కారణస్వరూపమయిన ఆత్మకన్న కార్యరూపమయిన జగత్తు వేరుగానున్నదిగదా జగత్తు నిజమా అని అయిదవభ్రమ కలిగినది.

పరిహారము॥ రజ్జుసర్ప దృష్టాంతముచేత ఈభ్రమ పోయినది. ఎట్లనిన, కాలత్రయమునందునూ ఏకరూపముగానున్న రజ్జువందు అజ్ఞానముచేత సర్పమనిపరంపరగా ప్రసిద్ధి ఆరోపించబడినది. విచారించగా సర్పభ్రమపోయి వాస్తవమైన రజ్జుజ్ఞానము దృఢమైనందున అవుడు సర్పభ్రమ మిథ్యఅయినది. అటులనే ఆత్మానాత్మ విచారణ లేనంతవరకు జగత్తు సత్యముగా దోచును. విచారించిన పైని కార్యరూపమైన జగత్తుయందు కారణవస్తువగు ఆత్మయే అగుపడును. అవుడు జగత్తు అగుపడుచున్ననూ మిథ్యఅని అసత్యమని తోచును.

శ్లో॥ తథాభ్రమతి మచ్చిత్తం బ్రహ్మాకార మభూత్స్వయం
నిదాఘత్వమపీత్థం హి తత్వజ్ఞాన మవాప్నుహి ॥౯౨॥

తా॥ ఓయి నిదాఘా! ఇట్లు పంచవిధభ్రమలు నివారణ అయినతరువాత పూర్వము అనేకభ్రమలుకల నా చిత్తము బ్రహ్మస్వరూపమైనది. అవుడు లోపలను పైని అంతయు పరమాత్మ చిద్రూపముకన్న ఇతరమేమియు నాకు అగపడలేదు. ఇట్లు బ్రహ్మ సాక్షాత్కారమయినది. గనుక నీవున్ను యీరీతిని తత్వజ్ఞానమును పొందుమని ఉపదేశించెను. ఇటుల పంచవిధభ్రమలు నివారణ కాబడినవి.

గ్రంథిత్రియవిచారణ

గద్య॥ బ్రహ్మగ్రంథి ర్విష్ణుగ్రంథిః రుద్రగ్రంథి రితిత్రయో గ్రంథయః। గ్రంథిర్నామ సత్యాసత్య వస్తుద్వయస్య అభేద్యం యథా అన్యోన్య తాదాత్మ్య పన్నత్వంగ్రంథిః ధియం స్వప్రకాశ విమర్శ శక్తిం గ్రథతి మాయా రూపేణాచ్ఛాద్య గృహ్ణాతీతి గ్రంథిః ॥౯౩॥

తా॥ బ్రహ్మగ్రంథి విష్ణుగ్రంథి రుద్రగ్రంథి అని ప్రతి శరీరమందును మూడుగ్రంథులు కలవు. గ్రంథి అనగా సత్యము అసత్యము అనే రెండువస్తువులు పోల్చ శక్యము కాకుండా ఒకదానిరూపమును రెండవది పొందుట గ్రంథి అనిపించుకొనును.

వ్యాఖ్య॥ బ్రహ్మగ్రంథిర్నామ॥ స్వాధిష్ఠాన మణి పూరయోర్మధ్యే, ఐం, హ్రీం; ఇతివాగ్భవ మాయా బీజస్థానే సర్వాధిష్ఠానరూప చిదాత్మానం అవిద్యారూపేణాచ్ఛాద్య అన్నమయకోశ స్థూలదేహాభిమానీ జాగ్రదవస్థాపన్న విశ్వ నామకోజీవః। సత్యరూప రజ్జౌ రజ్జుజ్ఞానం నిరన్య సర్పజ్ఞానవత్. జగతస్సత్యత్వ మాపాదయన్ బింబ ప్రతిబింబో భయాభావ కలుష సత్వతమః ప్రధానప్రకృతిరూప జీవబ్రహ్మణో రన్యోన్యాధ్యాసః, బ్రహ్మగ్రంథి పదేనోచ్యతే. స్థూలశరీరాభి మానత్యాగ ఏవ బ్రహ్మగ్రంథి భేదనమితి॥

తా॥ బ్రహ్మగ్రంథిఅనగా స్వాధిష్ఠాన మణిపూరకమల ముల మధ్యనున్న; ఐం, హ్రీం, అనే వాగ్భవ మాయాబీజ

స్థానమందున్న సర్వాధిష్ఠానమైన చిదాత్మను అవిద్యారూప ముగా ప్రకృతి ఆవరించి అన్నమయకోశమైన స్థూలశరీ రాభిమాని అయిన జాగ్రదవస్థతో కూడిన విశ్వుడనేజీవుడు బ్రహ్మగ్రంథి అనేసంజ్ఞ కలది. రజ్జువందు నిజమయిన రజ్జుజ్ఞానమును మరపించి సర్పజ్ఞానము కలుగజేసినట్లు జగ త్తున్ను శరీరములున్ను సత్యములని తోపించుచు బింబప్రతి బింబములు రెండునులేని కలుషతమస్సు ప్రధానముగల ప్రకృతిరూపమైన జీవబ్రహ్మలయొక్క అన్యోన్యాధ్యాస బ్రహ్మగ్రంథి అనిపించుకొనును. జాగ్రదవస్థలోగల జ్ఞానము జగత్తు తమస్థూలశరీరము నిజమని నమ్మికగల జీవుడువిశ్వు డనేవాడు బ్రహ్మగ్రంథి అనిపించుకొనును. స్థూలశరీరాభి మానత్యాగమే బ్రహ్మగ్రంథిభేదనమని భావము.

## విష్ణుగ్రంథిలక్షణము

వ్యాఖ్య॥ విష్ణుగ్రంథిర్నామ అనాహత విశుద్ధకమల యోర్మధ్యే కామరాజ మాయాబీజస్థానే ప్రాణమయ మనో మయ కోశద్వయరూప తేజోమయ సూక్ష్మశరీరాభిమానీ స్వప్నావస్థాపన్న తైజస నామకోజీవః. మిధ్యా ప్రపంచాను భవః కలుషరజః ప్రధానప్రకృతిః భావాభావరూప ప్రతి బింబ సదృశోజీవబ్రహ్మణో రన్యోన్య తాదాత్మ్యధ్యాసః విష్ణుగ్రంథి పదేనోచ్యతే॥

తా॥ విష్ణుగ్రంథిఅనగా హృదయకంఠములందున్న అనాహత విశుద్ధకమలముల మధ్యనున్న; క్లీం, హ్రీం, అనే

కామరాజ మాయాబీజముల స్థానమందు శ్రీణమయ మనో మయ కోశద్వయ రూపమైన తేజోమయమైన సూక్ష్మశరీరాభిమానియగు స్వప్నావస్థను పొందిన తైజసుడనే జీవుడు మిథ్యాప్రపంచానుభవము గలవాడై కలుషమైన రజోగుణ ప్రధానమైన ప్రకృతిగలవాడై అగుపడీ అగుపడని ప్రతిబింబ సమానుడయిన జీవబ్రహ్మల అన్యోన్యమేళన నిశ్చయము విష్ణుగ్రంథి అనిపించుకొనుచు. జీవత్వభ్రమ నిరసనమే విష్ణుగ్రంథి భేదనమని భావము.

## రుద్రగ్రంథి లక్షణము

వ్యాఖ్య॥ రుద్రగ్రంథిర్నామ ఆజ్ఞాకమలోపరి స్తాః హ్రీమితిశక్తిమాయా బీజస్థానే విజ్ఞానమయ ఆనందమయకోశద్వయరూప సుషుప్త్యవస్థాపన్నప్రాజ్ఞ నామకోజీవః. ప్రతిబింబానంద భుక్కలుషసత్వ ప్రధానప్రకృతిః స్పష్టప్రతిబింబ సదృశః జీవబ్రహ్మణో రన్యోన్యాధ్యాసః రుద్రగ్రంథి పదేనోచ్యతే॥ ౯౨॥

తా॥ రుద్రగ్రంథి అనగా భ్రూమధ్యనున్న ఆజ్ఞాకమలముపైని స్తాః హ్రీమనే శక్తిమాయాబీజ స్థానమందు విజ్ఞానమయ ఆనందమయ కోశద్వయ రూపమైన సుషుప్త్యవస్తను పొందిన ప్రాజ్ఞుడనే జీవుడు ప్రతిబింబానందము ననుభవించుచు కలుషసత్వ ప్రధాన ప్రకృతికలవాడై స్పష్టమైన ప్రతిబింబ సమానుడైన జీవబ్రహ్మల అన్యోన్యమేళనము నిజమునినమ్మక రుద్రగ్రంథి అనిపించుకొనును. సుషు

స్వ్యావస్థలో సుఖము బ్రహ్మానంద ప్రతిబింబము. అదినిజమనే నమ్మిక రుద్రగ్రంథి అనిభావము. కారణ శరీరాభి మాన త్యాగము రుద్రగ్రంథి భేదనమని భావము.

గ్రంథిత్రయపరిహారము

శు॥ భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే ॥౽-౫॥

తా॥ సాధకుని మూలాధారమునుంచి ఆజ్ఞాకమ లోపరిభాగము పర్యంతము ఆరుకమలములు, మూడుగ్రంథులు కలవు. ఆపైని సహస్రార కమలకర్ణికాకారమైన బైందవస్థాన మందున్న చిత్కళల సాక్షిఅని పరమాత్మ అనియు అపరె ఎవరికన్న పైవస్తువు శ్రేష్ఠమైనది లేదో ఎవరు పరాస్వరూ వులో అట్టిసాక్షిఅన నిజరూపమని తెలుసుకున్నవారికి వారిని జ్ఞానదృష్టిచే చూచినవారికి గ్రంధిత్రయము భేదించ బడుచున్నది. సకలసంశయములు వదలును ఆగామిసంచి తము ప్రారబ్ధము అనే కర్మత్రయమునశించును. అని శ్రుతి భావము. వారు బ్రహ్మస్వరూపులు జీవన్ముక్తులు కైవల్య పదవిని పొందినవారున్ను అగుదురు. బ్రహ్మకు ఈ జనన మరణములు లేవుగాన వీరికి పునర్జన్మ బీజము నశించినదని భావము.

తా॥ గ్రంధిత్రయముకు పరిహారము సాధకుని శిరో మధ్యనున్న సహస్రార కమలకర్ణికా కారమైన ద్వాదశాంత మందున్న అమృతమయమైన చంద్రమండలాకారమయిన శివ

శక్తిమేళనస్వరూపమయిన తన నిజరూపమగు చిత్కళను తానని (తన ఆత్మస్వరూపమని) తెలుసుకుని ముందు వివరించబడే తుర్యాతీతదశలోనున్నవాడు పరమాత్మను చూచినవాడు, గ్రంథిత్రియ రూపమైన స్థూలసూక్ష్మ కారణములనే శరీరత్రియాభిమానము.

జాగ్రత్స్వప్నసుషుప్తులనే గ్రంథిత్రయమును భేదించినవాడు అగును. తన నిజమయిన ఆత్మయగు చిత్కళను చూచినపుడు జ్ఞానముచే తెలుసుకున్నపుడు సకలగ్రంథులు భేదించబడినవి. పంచవిధ భ్రమలు పోయినవి. ఆగామిసంచిత ప్రారబ్ధములనే కర్మత్రియము క్షీణించినది అని నమ్మవలెను. వీరు మొదట జాగ్రిదాద్యవస్థలనుదాటితుర్యావస్థనుపొందినవానిభావము. ఇందుకు అనేకప్రమాణములున్నవి. బ్రహ్మసాక్షాత్కారము ప్రత్యక్షముకాని అనుమానశబ్దప్రమాణముమాత్రము కాదు. శ్రద్ధగలిగి ఈగ్రంథవిచారణ చేసినవారికి సిద్ధించును. ఇటుల సర్వసంశయ నివారణము అగునని భావము.

ఇతి శ్రీమత్పదవాక్య ప్రమాణ పారావార పారీణ
ధురీణ సత్యానందనాథ గురు కరకమల సంజాత
జ్ఞానానన్దోపనామక సింహంభట్ల రామమూర్తి
విద్వద్విరచితం బ్రహ్మజ్ఞానసాధనం స్వరూ
పజ్ఞానదర్పణగ్రన్థే తృతీయపాదం
సంపూర్ణం.

---

అథ చతుర్థపాద ప్రారంభః

# అజ్ఞానాది సప్తావస్థల వివరణ



శ్లో॥ అజ్ఞానావృతి విక్షేప ద్వివిధజ్ఞాన తృప్తయః
శోకాపగమ ఇత్యేతే యోజనీయాశ్చిదాత్మని ॥౯౬॥

తా॥ అజ్ఞానము ఆవరణము విక్షేపము పరోక్షజ్ఞానము అపరోక్షజ్ఞానము నిరంకుశమయిన తృప్తి దుఃఖనివృత్తి అని ఈసప్తావస్థలు చిదాభాసుడగు జీవునియందు కల్పించతగినవి. ఇందువలన ఆత్మకు ఎట్టి అవస్థాభేదమును లేదని భావము.

శ్లో॥ సంసారాసక్తచిత్తస్సన్చిదాభాసః కదాచన
స్వయంప్రకాశ కూటస్థం స్వతత్వం నైవవేత్త్యయం ॥౯౭॥

తా॥ ఈచిదాభాసుడగు జీవుడు సర్వదా సంసారమందాసక్తిగలవాడైయుండి ఒకానొకప్పుడైననూ స్వతస్సిద్ధమయిన ప్రకాశతగల సాక్షిస్వరూపుడైన కూటస్థుడు తన నిజరూపమని తెలుసుకొనలేడు. తలంచడు.

శ్లో॥ నభాతి నాస్తికూటస్థ ఇతివక్తి ప్రసంగతః
కర్తా భోక్తాహమస్మీతి విక్షేపం ప్రతిపద్యతే ॥౯౮॥

తా॥ సాక్షి తనస్వరూపమని తెలుసుకోకపోవడమే గాక అజ్ఞానముచే మోహమునుపొంది ఆత్మప్రసంగమందు కూటస్థుడులేడు అగుపడడు అని చెప్పుతున్నాడు. ఆగంతు

కము కల్పితము శూన్యము నగు అహమనే జీవునియందు నేనేకర్తను నేనేభోక్తను అనే నిశ్చయమును పొందుచున్నాడు. ఆత్మ చిదానందస్వరూపుడు. అట్టి తననిజరూపమును మరచి భ్రమనుపొంది ప్రతిబింబసదృశుడగు జీవుడు నేనని కర్తృత్వ భోక్తృత్వములు తనయం దారోపించు కున్నందున సకల దుఃఖములనూ పొందుచున్నాడు.

శ్లో॥ అస్థికూటస్థ ఏవాస్మి త్యేవం వేత్తివిచారతః
కర్తాభోక్తేత్యేవమాది శోకజాలం ప్రముంచతి ॥౯౯॥

తా॥ ఆత్మానాత్మల విచారణవలన కూటస్థుడున్నాడు నేను కూటస్థుడను అని తెలుసుకొనుచున్నాడు. అపుడు ఆత్మ అసంగచిద్రూపుడు గాన నేనుకర్తను భోక్తను అనే మొదలగు సకలదుఃఖములనూ పొందుతున్నవి.

"కృతంకృత్యం ప్రాపణీయ్యం ప్రాప్తమిత్యేవ తుష్యతి"

తా॥ అపుడు తనకు దుర్లభమైన మానుషజన్మ వచ్చినందుకు చేయవలసినది చేసినాను. పొందతగిన ఆత్మస్వరూపమును పొందినాను. అని సంతోషించును. ఇది నిరాతంకమయిన తృప్తి అనిపించుకొనును.

శ్లో॥ అజ్ఞానావృతివిక్షేపః పరోక్షజ్ఞానధీస్తథా
అపరోక్ష జ్ఞానశోక మోక్షస్తృప్తిర్నిరంకుశా ॥౧౦౦॥

తా॥ అజ్ఞానము ఆవరణశక్తి విక్షేపశక్తి పరోక్షజ్ఞానము అపరోక్షజ్ఞానము శోకనివృత్తి నిరంకుశమయినతృప్తి ఇవి సప్తావస్థలు. ఏడుఅవస్థలు.

శ్లో॥ సప్తావస్థా ఇమాస్సంతి చిదాభాసస్యతా స్వియా
బంధమోక్షస్థితో తత్రతిస్రో బద్ధకృత స్మృతాః ॥౧౦౧

తా॥ ఈసప్తావస్థలు చిదాభాసుడైన జీవునకేగాని సాక్షిస్వరూపుడైన పరమాత్మకు ఏఅవస్థయు లేదనియు బంధమోక్షములు రెండును ఈసప్తావస్థలో నిమిడియున్నవనియు అందులో ఆదినున్న మూడుఅవస్థలు జీవునికి బంధమును కలుగజేసేవని భావము. తక్కిన నాలుగవస్థలు మోక్షము నిచ్చేవని భావము.

## ౧ అజ్ఞాన లక్షణము

శ్లో॥ నజానామీ త్యుదాసీన వ్యవహారస్య కారణం
విచారః ప్రాగభావేన యుక్తమజ్ఞాన మీరితం ॥౧౦౨॥

తా॥ అజ్ఞానమనగా వస్తువుయొక్క వాస్తవము తెలియకపోవుట. ఇది అజ్ఞానమని తమస్సని జడమని అనిపించుకొనును. బ్రహ్మవస్తువనేది నాకు తెలియదని ఆత విచారణకు పూర్వము ఉదాసీనముగా ఉండుటకు కారణమే అజ్ఞానమనబడును. రజ్జువందు సర్పమనేభ్రమకు స్థాణువునందు చోరభ్రమకును అంధకారము కారణము. అజ్ఞానము అట్టిది.

## ౨ ఆవరణలక్షణము

శ్లో॥ అమార్గేణ విచార్యాథ నాస్తినోభాతి చేత్యసౌ
విపరీతో వ్యవహృతి రావృతేః కార్యమిష్యతే ॥౧౦౩॥

తా॥ ఆవృతి ఆవరణశక్తి శాస్త్రమును, సజ్జనోపదేశమును, విడచి తనకుతోచినట్లు విచారించి బ్రహ్మవస్తువనేది

లేనేలేదనే విపరీతవ్యవహారము ఆవరణశక్తి. రజ్జువందు సర్పమనేభ్రమ; స్థాణువందు చోరభ్రమవలెను బ్రహ్మమందు జగద్భ్రమ ఆవరణకార్యము.

3 విక్షేపలక్షణము

శ్లో॥ దేహాద్యాయ చిదాభాస రూపో విక్షేప ఈరితః
కర్తృత్వాద్యఖిలశ్శోక సంసారాఖ్యోస్య బంధకః ॥౧౦౪॥

తా॥ ఒకవస్తువును మరియొకవస్తువుగా తెలుసుకొనుట వెనకటి ఆవరణశక్తికార్యము. అట్టిభ్రమను నిశ్చయముగా భావించుట దానినినమ్మి వ్యవహారించుట విక్షేపశక్తి కార్యము. బ్రహ్మాండ పిండాండముల లోపల పైని అంతటా బ్రహ్మవస్తువు నిండియుండగా స్థూలమయిన పాంచభౌతిక శరీరమును సూక్ష్మమయిన జీవత్వము నేననే అభిమానము వలన నేను కర్తననే అభిమానమువలన సంసారమనే సకలదుఃఖములు కలుగుచున్నవి. రజ్జువందుకలిగిన సర్ప భ్రమను నిశ్చయముగా నమ్మినందున భయకంపాదులు కలుగుటయు; స్థాణువును జూచి చోరభ్రాంతివల్ల పలాయ నాదులు ఆచరణలోకి తెచ్చుటయే విక్షేపశక్తి కార్యము. ఈఅవస్థాత్రయము జీవునికి బంధకారణము.

౪ పరోక్షజ్ఞానలక్షణము.

శ్లో॥ ఆత్మావా ఇదమిత్యాదౌ పరోక్షం బ్రహ్మదర్శితం
అస్త్యారో పాపవాదాభ్యాం ప్రజ్ఞానం బ్రహ్మదర్శితం
అవాంతరేణ వాక్యేన పరోక్షం బ్రహ్మదర్శితం ॥౧౦౫॥

శ్రుతి॥ ఆత్మైవా ఇదగ్ సర్వం! అస్తి బ్రహ్మేతి వ్యజా నాత్॥ ఈవాక్యములవల్ల బ్రహ్మకలదని చెప్పినందున పరోక్షజ్ఞాన మనబడును

తా॥ అగుపడుచున్న చరాచరాత్మకమయిన జగత్తు సకలమూ బ్రహ్మస్వరూపమునియు ఇతరవాక్యములచేతనూ బ్రహ్మవస్తువుకలదని తెలియుచున్నది. ఇదియేపరోక్షజ్ఞానము. సర్ప భ్రమయందు రజ్జుజ్ఞాపకము చోరభ్రాంతియందు స్థాణు జ్ఞాపకమువలెను బ్రహ్మకలదనే పరోక్షజ్ఞానమువల్ల లేదనే ఆవరణకార్యము నసించుచున్నది. తన యెదుట గాక స్థలాంతర మందున్న వస్తువును స్మరించుట పరోక్షజ్ఞానమనబడును.

అపరోక్షజ్ఞాన లక్షణము.

శ్లో॥ సర్వత్రైవ మహావాక్య విచారాద పరోక్షధీః!
బ్రహ్మపరోక్షసిద్ధ్యర్థం మహావాక్యానితేరితం॥ ౧౦౬

తా॥ తత్వమస్యా దిగురూపదిష్టములగు మహావాక్యార్థముచేతను, తనయందుగల చిత్స్వరూపుడగు సాక్షియే తన నిజరూపమనియు చిదాభాసుడగు జీవుడు, సాక్షి, ప్రతిబింబము గను; మిథ్యారూపమనియు అహమని వ్యవహరించుచున్న సాక్షియగు తానే బ్రహ్మస్వరూపము అని తెలుపుచున్న మహావాక్యార్థమువలన గలిగినజ్ఞానము అపరోక్షజ్ఞానమనబడును. ఎచటనోనున్నది పరోక్షము. తనయెదుటనున్నది అపరోక్షమము. దేహేంద్రియాదులు స్వతహాగా జడములు. వాటికి శబ్దస్పర్శ రూపరసగంధ గ్రహణశక్తిని గలుగజేసే ప్రజ్ఞానమే

బ్రహ్మస్వరూపముగాన బ్రహ్మసాక్షాత్కారము అపరోక్షజ్ఞానమనబడును. అపరోక్షజ్ఞానము కలిగినందున బ్రహ్మవస్తువు అగుపడదనే విశేషశక్తి నసించును.

శోకనివృత్తి లక్షణము

శ్లో॥ జ్ఞానద్వయేన నష్టేస్మిన్నజ్ఞానే తత్కృతావృతిః । నాభాతి నాస్తి చేత్యేషాద్వి విధాపినస్వ్యతి । పరోక్షజ్ఞానతో నస్యేద సత్వావృతిహేతుతా। అపరోక్షజ్ఞాననాశ్యాహ్య భానావృతిహేతుతా । అభానావరణేనష్టేజీ వత్వారోప సంక్షయాత్ । కర్తృత్వాద్యఖిలశ్లోకః సంసారాఖ్యో నివర్తతే॥

తా॥ వెనకచెప్పిన పరోక్షాపరోక్షజ్ఞానమువలన తన కార్యవర్గమైన ఆవరణ విక్షేపశక్తులతోగూడ అజ్ఞానము నసించినందున జీవత్వారోపణక్షయించినందున కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానము నసించును. సకలదుఃఖములు వదలును. గనుక శోకనివృత్తికలిగినది.

తృప్తి లక్షణము.

శ్లో॥ నివృత్తే సర్వసంసారే । నిత్యముక్తత్వభాసనాత్ ।
నిరజ్కుశాభవేత్తృప్తిః పునశ్శోకానముద్భవాత్॥ ౧౬౦

తా॥ స్థూలశరీర జీవాదులు తాననియు జననమరణ పుణ్య పాప విధి నిషేధకర్మానుగుణ లోకాంతరగమనాది కర్తృత్వ భోక్తృత్వాది సకల సంసార రూపాజ్ఞానమున్ను నసించినందున చిద్రూపుడగు తాను నిత్యముక్తుడననే జ్ఞాన

ముదయించినందున నిరంకుశమైన తృప్తిగలుగుచున్నది. లోక మందుగల తృప్తులు అంతముగలవిగాన నీతృప్తి నిరంకుశమైనది, అడ్డులేనిది, అంతములేనిదని భావము. ఇతిసప్తావస్థాః

దశమోపమానము. [కథ]

ఈఅజ్ఞానాది సప్తావస్థలు మందాధికారులు బోధకొరకు దశమోపమానము చెప్పబడినది. ఆకథయందు ఈసప్తావస్థలు ఇమిడియున్నవి.

ఒక గ్రామమునుంచి పదిమందిజనులు గ్రామాంతరము వెళ్ళుచుండగా మార్గమధ్యమున గొప్పనది ప్రవహించుచున్నది. దానినిచూచి భయమునొంది పదిమంది యు సాధనము లేకయే ఈతపైని దాటదలచి అంతా దిగి పోగా, పోగా ఆవలివడ్డుకు చేరినారు. అంతావచ్చినారా లేదా అని విచారించుటకు; అందరూ వలయాకారముగానుండగా వకడు తన ఎడమ భాగమునుంచి కుడిభాగమువరకు లెక్కించగా తొమ్మండుగురుమాత్రము లెక్కకు అగుపడిరి. తనమనసులో సంశయముకలిగి కుడినుంచి ఎడమకు లెక్కించినను తొమ్మండుగురే అగుపడిరి. తనతోవచ్చిన పదియవవాడు నదిలో మునిగిపోయినాడని తొమ్మండుగురే లెక్కకు వచ్చిరని మిగతావారికి చెప్పగా అంతాకూడి పదియవవానిని గురించి పొరలి మొత్తుకొనుచు విచారించుచుండగా ఒకబాటసారి ఆమార్గమున వచ్చి వీరిస్థితినిచూచి దయకలవాడై వీరు ఎందుకు విచారించుచున్నారో వీరి ఆపదఏమో విచారింతమని వారివద్దకువెళ్ళి

విచారించగా తాము పదిమందిమి వచ్చితిమనియు నదిలో తమ పదియవవాడు లెక్కకు, నదిలో మునిగిపోయెనని, వాని కోసము విచారిస్తున్నామని చెప్పెను.

అతడు విని వారితలలు తనమనసులో లెక్కించి వీరు భ్రమపడిరని తెలుసుకుని మీవాడు లేడని మీకు యెట్లు తెలిసినదని వారినడిగెను.

అయ్యా మేము పదిమంది వచ్చినాము లెక్కించగా తొమ్మండుగ్రేతర్ మగుపడిరని చెప్పిరి. మంచిది విచారించకండి మీపదియవవాడు ఉన్నాడని చెప్పగా సంగారు దుఃఖమును వదలినవారై వీరికి దిగువ నగుపడినాడని నిశ్చయించుకున్నవారై అయ్యా మాపదియవవాడు జీవించి యున్నాడా వానిని మాకు చూపించమని ప్రార్థించిరి.

బాలసారి వారిని ఓదార్చి మీపదియవవాడు లేడని మీకెట్లు తెలిసినదని పూర్వపురీతిగా లెక్కించమనెను, వరుసగానుండి లెక్కించగా తొమ్మండుగ్రు అయినతరువాత నీవు పదియవవాడవని అతను చెప్పెను. సంశయముకలిగి కుడినుంచి లెక్కించగా తాను పదియవవాడనని తెలిసినవాడై అందరికిని తనను కలిగినభ్రమను చెప్పగా అంతా తమబుద్ధి మోసమునకు సిగ్గుపడినవారయిరి.

అయ్యా మీవల్ల మాదుఃఖము పోయినది. మాకు భ్రమకలిగినది తమవల్ల సుఖముకలిగినదని అతనిని స్తుతించిరి. ఎవరితోవ్రవనువారు ఆనందముగా వెళ్ళిరి.

ఈకథయందు సప్తావస్థలు కలవు. ఎట్లనిన లెఖ్ఖలో తననుమరచి తమదశముడు నదిలో మునిగిపోయెననుకోవడము అజ్ఞానము. వాడు లేడనుకోవడము ఆవరణము వానినిగురించి విచారించడము విక్షేపశక్తి. ఆబాటసారి దశముడు ఉన్నాడనగా సగముదుఃఖము తగ్గుట పరోక్షజ్ఞానము. లెక్క చూపించి దశముడున్నాడని చూపించుట అపరోక్షజ్ఞానము. ప్రత్యక్షము. దశముడు కలడనే జ్ఞానము శోకనివృత్తి. తమ భ్రమవల్ల ఈదుఃఖము వచ్చినదని దశముడు పోనూలేదు రానూలేదని తెలియుట నిరంకుశమైన తృప్తికలుగుట.

ఇటులనే అనేకజన్మలనుంచి శరీరము నేనని, జీవుడు నేననేది భ్రమకలిగి తమ నిజరూపము సాక్షి చిన్మయామని మరచుట అజ్ఞానము తనకు పుణ్యాపాపములు, స్వర్గనరకములు, సుఖదుఃఖములు, శత్రుత్వమిత్రత్వములు కలవనేనమ్మకయావరణ శక్తిగానున్నది. దీనినినమ్మి తనపాపమునకు, బాధలకు, దరిద్రమునకు విచారించుటవిక్షేపశక్తి. ఆ బాటసారి గురువు అతను చేసిన బోధ తత్వోపదేశము. పరబ్రహ్మ, పరమాత్మ దేవుడు కలడనేది అట్టి నమ్మికజ్ఞానము. పరోక్షజ్ఞానము. సాధకుని శిరోమధ్యనుండిన చిద్రూపమైన సాక్షి నీ నిజరూపమని అది సకలేంద్రియములందునూ సత్తారూపముగానుండి నీలో బుద్ధిజ్ఞానము అనే స్వరూపము సకలమునూ గ్రహించుచున్నదే బ్రహ్మ పరమాత్మ అని గురువు చెప్పగావిని తన నిజరూపము సాక్షిగాని, శరీరము నేనుకాను జీవుడు నేనుకాను, అని తెలుసుకున్నపుడు సాక్షి పరబ్రహ్మకల

దానికి నాశనము, జననమరణములు లేవు అని తెలుసుకోవడము శోకనివృత్తి. తురియ్యావస్థను తెలుసుకుని నిజమైన బ్రహ్మానందము ననుభవించడము నిరంకుశమైన (అడ్డులేని) తృప్తి.

ఇట్లు ఈకథవల్ల అజ్ఞానాది సప్తావస్థలునూ తెలుసుకున్నవారు బ్రహ్మస్వరూపులగుదురు. వారుజీవన్ముక్తులు అని తెలుసుకోవలెను.

శ్లో॥ పరోక్షాచాపరోక్షేతి విద్యాద్వేధావిచారజా
తత్రాపరోక్షవిద్యాప్తౌ విచారోయం సమాప్యతే॥౧౦౯॥

తా॥ ఈ ఆత్మవిచారణ యంతవరకు చేయవలెననిన ఈ విచారణవలన ముందు పరోక్షజ్ఞానము తరువాత అపరోక్షజ్ఞానము కలుగుచున్నది. అందు అపరోక్షజ్ఞానము కలగడమే ఈ విచారణకు సమాప్తి.

శ్లో॥ అస్తి బ్రహ్మేతిచేద్వేద పరోక్షజ్ఞానమేవతత్
అహం బ్రహ్మేతిచేద్వేద సాక్షాత్కారస్సఉచ్యతే॥౧౧౦

తా॥ బ్రహ్మవస్తువు కలదనేజ్ఞానము పరోక్షజ్ఞానమనబడును. నేను బ్రహ్మస్వరూపుడను, అనే జ్ఞానముదయించుటయే బ్రహ్మసాక్షాత్కార మనిపించుకొనును. అదివరకు అజ్ఞానముచేత బ్రహ్మవస్తువలేదు. అగుపడదు అనే ఆవరణ విక్షేపములు గలవాడు గనుక బద్ధుడుగా నున్నాడు. బ్రహ్మ కలదనే పరోక్షజ్ఞానముంచేత ఆవరణదోషము నశించినది. తాను బ్రహ్మస్వరూపుడననే అపరోక్షజ్ఞానమువలన విక్షేపదోషమునశించును. ఇట్లు తనకార్యవర్గముతో సహా అజ్ఞానము

నశించగా నేను బ్రహ్మస్వరూపుడను ముక్తుడననే జ్ఞానముకలుగును. అదియే తృప్తికలుగుట. విచారణపైన ఉదయించిన జ్ఞానమైనందున నిజమైనదిగనుక తిరిగీ శోక మోహాదులు ఎన్నడూ కలుగనేరవు, కాన నిరంతరమైన తృప్తికలుగును. ఇట్టి సప్తావస్థలను తెలుసుకున్నవారు జీవన్ముక్తులగుదురు. ఇది చాలా ముఖ్యమైనది. సంపూర్ణము.

జ్ఞానభూమికా సప్తకము.

మహోపనిషతు॥

శ్లో॥ ఇమాం సప్తపదాం జ్ఞాన భూమి మాకర్ణయానఘ
నానయాజ్ఞాతయా భూయో మోహపంకేనిమజ్జతి॥

శ్లో॥ వదంతి బహుభేదేన వాదినో యోగభూమికాః
మమత్వభిమతన్నూన మిమామేవశుభప్రదాః॥

శ్లో॥ అవబోధం విదుర్జ్ఞానం తదిదం సాప్తభూమికం
ముక్తిస్తుజ్ఞేయమిత్యుక్తంభూమికాసప్తకాత్పరం ॥౧౧॥

తా॥ ఈ ఉపనిషత్కర్తలు తమశిష్యులైన నిదాఘుడనే ఋషికుమారున కుపదేశించుచున్నారు. ఓ పుణ్యశాలీ ఈ జ్ఞానభూమికాసప్తకమును వినుము. ఇది తెలిసినపైనిజనులు తిరిగీ మోహమనే బురదలోమునగరు. తిరిగీ అజ్ఞానమును పొందరని భావము. బ్రహ్మవేత్తలు ఈ జ్ఞానభూమికలను అనేకవిధములుగా నున్నట్లు వర్ణించిరిగాని నాకు ఈ సప్తవిధముగానే ఉండుటయిష్టము. ఈ ఏడువిధముల భేదముబోధించుటకు తెలుసుకొనుటకు కష్టము. ముక్తిఅనే అవస్థ ఈ ఏడు

అవస్థలనైన తెలుసుకొనుటయే. జ్ఞానమే స్వరూపముగా నున్నది. అదియే స్వరూపజ్ఞాన మనబడుచున్నది.

శ్లో॥ జ్ఞానభూమిశ్శుభేచ్ఛాఖ్యా ప్రథమాసముదాహృతా।
విచారణా ద్వితీయాస్యాత్తు తృతీయాతనుమానసీ।
సత్వాపత్తిశ్చతుర్థీస్యాత్తతోఽసంసక్తినామికా
పదార్థ భావనా షష్ఠీ సప్తమీతుర్యగాస్మృతా
ఆసామంతస్థితా ముక్తిర్యస్యాం భూయోనశోచతి॥
ఏతాసాం భూమికానాం త్వమిదం నిర్వచనం శృణు॥

తా॥ జ్ఞానభూమికలలో ౧ సుఖేచ్ఛ ప్రథమభూమిక. ౨ విచారణ రెండవది. ౩ తనుమానసి మూడవది. ౪ సత్వాపత్తినాల్గవది. ౫ సంసక్తి అయిదు. ౬ పదార్థభావన ఆరవది. ౭ తురీయము ఏడవది. ఎట్టిఅవస్థనుపొందినవారు తిరిగీ అజ్ఞానమును బంధమును పొందరో అట్టి ముక్తావస్థ ఈసప్తావస్థలలో నున్నది. నీవు ఈభూమికల అర్థము భావమును నిశ్చయముగా వినుము.

## ౧ సుఖేచ్ఛ

శ్లో॥ స్థితఃకింమూఢఏవాస్మి ప్రేక్ష్యేహంశాస్త్రసజ్జనైః
వైరాగ్య పూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతేబుధైః॥౧౧౩॥

తా॥ సకలభోగములును అనిత్యములుగా నున్నందున సకలజనులును నానావిధ క్లేశములను పొందుచున్నందునను మాతృగర్భనరకము జననమరణప్రవాహము దుస్తరమైనదని తెలిసినందున ప్రపంచభోగములందు వైరాగ్యముకలిగి నేను మూఢునిగానున్నాను. శాస్త్రములచేతను, సజ్జనులైన గురు

వులచేతను బోధనుపొంది పరమాత్మను చూడగలను. అనే కోరికగలుగుటయే ప్రథమ భూమిక గానున్నది.

౨. విచారణ

శ్లో॥ శాస్త్రసజ్జనసంపర్క వైరాగ్యాభ్యాస పూర్వకం
సదాచార్యప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా॥౧౧౪॥

తా॥ వైరాగ్యాభ్యాసముగలిగి వేదశాస్త్రముల ననుసరించి ఆత్మవేత్తలగు గురువులనాశ్రయించి బ్రహ్మవిచారణ చేయుట గురుకులవాసము విచారణయనబడును ॥ఇది రెండవ భూమిక॥

3. తనుమానసీ॥

శ్లో॥ విచారణా శుభేచ్ఛాభ్యాం ఇన్ద్రియార్థేషు ర
యాత్రిసాతనుతామేతి ప్రోచ్యతేతనుమానసీ॥౧౧౫॥

తా॥ వైరాగ్యము, సుఖేచ్ఛ, విచారణకలిగినందున ఇన్ద్రియ విషయములకు శబ్దస్పర్శాదులందు ఆసక్తి తగుట, మనోవృత్తులు, కోరికలు తగ్గుట, తనుమానసి అనే అవస్థగానున్నది. ఇది మూడవ భూమిక.

౪. సత్వాపత్తి॥

శ్లో॥ భూమికా త్రితయాభ్యాసా చ్చిత్తేతు విరతేర్వశాత్
సత్వాత్మనిస్థితేశుద్ధే సత్వాపత్తిరుదాహృతా॥౧౧౬॥

తా॥ వెనుకటి మూడు భూమికల అభ్యాసమువల్లను, మనస్సు క్షీణించినందున, ఆత్మ నిర్మలమైనదై, పరమాత్మ స్వరూపమైనదై ఉన్నగా, సత్వాపత్తి అని భావము. సద్వస్తువును పొందుటయే సత్వాపత్తి అని తెలుసుకోవలెను. సద్వస్తు

వు ఆత్మ రూపముగా నున్నదని రూఢిగా జ్ఞానము కలుగుట, ఇది నాలుగవ భూమిక.

౫. సంసక్తి॥

శ్లో॥ దశా చతుష్టయాభ్యాసా దసంసర్గఫలాతుయా।
రూఢసత్వ చమత్కారా ప్రోక్తాసంసక్తినామికా॥౧౧౭॥

తా॥ వెనుకటి నాలుగవస్థలయొక్క బలమున్నూ కలిగి ఈ విచారణవలన ఇంకొక ఫలమున్నదని కోరక, తన ఆత్మయే బ్రహ్మస్వరూపమన్న నిశ్చయజ్ఞానమే ఫలము. అందువల్ల [బ్రహ్మాత్వసిద్ధివల్ల] సకలమున్ను సిద్ధించినదిగాన సద్వస్తుస్వరూపుడై రూఢిగా నుండుటయే సంసక్తి అని చెప్పిరి. బ్రహ్మవస్తువుతో పూర్ణమైన అభేదజ్ఞానము కలుగుటయే ఈ భూమికా లక్షణము. ఇది అయిదవభూమిక.

౬. పదార్థాభావన

శ్లో॥ భూమికాపన్చకాభ్యాసాదా త్మారామతయాదృఢా।
అభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్
పరప్రయుక్తేనచిరం ప్రియత్నే నావబోధనం।
పదార్థాభావనానామ షష్టీభవతిభూమికా॥౧౧౮॥

తా॥ వెనుకటి పంచభూమికలు కల్గినందున తనఆత్మయే విశ్రాంతి స్థానముగా గలవారై అంతరంగమందుగల ఇంద్రియాదులు బహిరంగమందున్న వస్తుసమూహము చిన్మయముగా భావించి తన్మయుడైయుండి పరులచే తెలుపబడినపుడుమాత్రము దేహయాత్రకుమాత్రము ప్రపంచజ్ఞానముకల

వారు వేరుభావనలేని అవస్థ పదార్థాభావన అనబడును. ఇది ఆరవభూమి॥

## ౭. తురీయము

శ్లో॥ భూమిషట్కసదాభ్యాసా ద్భేదస్యా నుపలంభనాత్।
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయాతుర్యగా గతిః
ఏషాహి జీవన్ముక్తేషు తుర్యావస్థేహ విద్యతే।
విదేహముక్తివిషయం తుర్యాతీతమతఃపరం॥౧౧౯॥

తా॥ పైనచెప్పిన ఆరుభూమికల అభ్యాసమువలన ద్వైతము పూర్తిగావిడిచి కేవల ఆత్మస్వరూపస్థితి తురీయమన బడును. ఈభూమిక తుర్యావస్థను పొందిన జీవన్ముక్తులయం దున్నది. విదేహముక్తిస్థానము. ఈతురీయముపైది తుర్యాతీతము.

శ్లో॥ హేనిదాఘ మహాభాగ సప్తమీంభూమి మాగతాః।
ఆత్మారామా మహాత్మానః తే మహాపదగామినః॥౧౨౦॥

తా॥ ఓయినిదాఘా! ఎవరు ఈఏడవభూమికయగు తుర్యావస్థను పొందుచున్నారో వారు ఉత్తమస్థానమును పొందినవారు. ఆత్మయందు విశ్రాంతిగలవారు. వారేమహాత్ములు. వారే మహాపదవిని పొందినవారుగా నున్నారు.

శ్లో॥ జీవన్ముక్తా నజీవంతి సుఖదుఃఖ రసస్థితే
ప్రకృతే నార్థకార్యేణ కించిత్కుర్వంతి వానవా
పార్శ్వస్థబోధితాస్సంతః పూర్వాచార క్రమాగతం
ఆచార మాచరంత్యేవ సుప్తబుద్ధ వదుద్ధితాః ॥౧౨౧॥

తా॥ సుఖముదుఃఖము అనే జ్ఞానమును వదలినవారు జీవితకాలమందే ముక్తినిపొందినవారు. వీరు ప్రాకృతకార్యములను చేయనూగలరు చేయనూలేరు. నిద్రించినవాడు మేలుకొనినట్లు దగ్గరనున్నవారిచే బోధితులై శరీరపోషణాదులందు సంచరింతురు. వీరిప్రవర్తన పూర్వాభ్యాసము జరుగును. కార్యములందు మనస్సు వీరికి లేదు.

శ్లో॥ భూమికాసప్తకంచైవ ధీమతా మేవగోచరం
ప్రాప్యజ్ఞాన దశామేతాం పశుమ్లేచ్ఛా దయోపిచ
సదేహా వాప్యదేహావా తే ముక్తా నాత్రసంశయః
జ్ఞప్తిర్హిగ్రంధివిచ్ఛేదస్తస్మి త్సతి విముక్తతా
మృగతృష్ణాంబు బుద్ధ్యాది శాంతిమాత్రాత్మక స్త్వసౌ॥

తా॥ ఈజ్ఞానభూమికా సప్తకము బుద్ధిమంతులకే గోచరమగును. పశుతుల్యులు మ్లేచ్ఛతుల్యులు అజ్ఞానవంతులు దురాచారవంతులు అయిననూ ఈజ్ఞానమార్గమును పొందినయెడల దేహముండగనూ ముక్తులే, దేహాంతమందునూ ముక్తులేయగుదురు. ఎంతమాత్రమూ సంశయములేదు. జ్ఞప్తి అనగా తెలివి. అజ్ఞానము విడిపోవడమే తెలివిఅని. గ్రంధిఅనగా స్థూలశరీరము నేనని సూక్ష్మమగుజీవుడు నేనని భ్రమయేగ్రంధి. ఆత్మ తననిజరూపమని తెలుసుకోవడమే గ్రంధివిచ్ఛేదము. ఆ భ్రాంతి మృగతృష్ణ యెండమావులనుచూచి జలమని భ్రాంతిపొందడమువంటిది. అట్టి జగత్సత్యత్వభ్రాంతి పోవుటయే గ్రంధివిచ్ఛేదము.

జ్ఞప్తి కలుగుట. అంతకన్న కష్టమేమియు లేదు. ఇది జ్ఞాన భూమికా సప్తకము సమాప్తము.

## తురీయ్యాపాదస్వరూపము

ఈ తురీయశబ్దము తురీయ్యుడయిన సాక్షియందును జాగ్రత్స్వప్న సుషుప్తులకు పైగానున్న తుర్యావస్థయందునూ తురీయ్యపాదమందును వర్తించుచున్నది. ఈతురీయ్యపద మంతటనూ బ్రహ్మను బోధించుచున్నది.

## తురీయ్యాపాదలక్షణము

మాండూక్యోపనిషత్॥ శ్లో॥ శబలశుద్ధత్వ భేదేన చతుష్పా
దాంతర్వర్తినో బ్రహ్మణశ్చత్వారి పాదాని। స్థానానిచ,
నాభి హృదయ కంఠ మూర్ధ్నిషు। విశ్వ తైజస ప్రాజ్ఞ
సాక్షిణః పంచపాద బ్రహ్మణో నకించన॥

తా॥ శబలబ్రహ్మమని శుద్ధబ్రహ్మమని రెండువిధములు. సృష్టియందు మాయామిశ్రమము శబలబ్రహ్మమనియు, మాయారహితము శుద్ధబ్రహ్మస్వరూపము. అయిదవ పాదస్వరూపము శుద్ధబ్రహ్మము. అందు ఎట్టిభేదమున్నూ లేదు. సర్వపరిపూర్ణము. అజ్ఞులకు బోధకొరకు సృష్టి ననుసరించి ఈభేదమును చూపించినారు. జాగ్రదాద్యవస్థాత్రయము, సర్వానుభవగోచరముగా నున్నది. ఈ అవస్థాత్రయముకన్న వేరుగా నున్నది తుర్యావస్థ. తదభిమానియగు జీవుడు సాక్షిఅనిపించుకొనును. అదియే తురీయ్యాపాదమని. లోకత్రయము అవిద్యామిశ్రమముగాన బ్రహ్మ

యొక్క పాదత్రియము తురీయ్యపాదము. కేవల ఆత్మస్వరూపము. వినుము.

మాణ్డూక్యే॥ శ్రు॥ నాన్తఃప్రజ్ఞం నబహిప్రజ్ఞం నో భయతః ప్రజ్ఞం। నప్రాజ్ఞానఘనం। నప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్టమవ్యవహార్యమగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్యమైకాత్మ్య ప్రత్యయసారం ప్రపంచోపశమం। శాంతం శివమద్వైతం చతుర్థం మన్యన్తే సఆత్మా సవిజ్ఞేయః॥

తా॥ స్వప్నావస్థలోనున్న జ్ఞానము బ్రహ్మజ్ఞానము కాదు. జాగ్రితలో జ్ఞానమునూకాదు. నిద్రావస్థలో జ్ఞానమును కాదు. ప్రజ్ఞానఘనముకాదు. [ప్రజ్ఞ వున్నదికాదు.] ప్రజ్ఞ లేనిదీకాదు. మరి ఎట్టిదనిన, చూడడముకు అగుపడనిది. ఇట్టిదని వ్యవహరించుటకు శక్యము కానిది. మనోనేత్ర శ్రోత్రములచే గ్రహించ శక్యము లేనిది. ఏ లక్షణములూ లేనిది. ఏ చిహ్నాలూ లేనిది, ఊహించ శక్యము కానిది, చెప్ప శక్యముకానిది, ఆత్మ అనే సంజ్ఞమాత్రము కలది. పన్చభూత వికారములన్నియు శాంతించిన పైని ఉన్నదని తెలుసుకొనవలెను.

స్వయం శాంతస్వరూపము ఆనందస్వరూపము. ద్వితీయ్య వస్తురహితము. ఇట్టిది తురీయ్యపాద స్వరూపము. ఆ తురీయ్యవస్తువుయే ఆత్మగాను పరబ్రహ్మగాను ఉన్నది. అదియే తెలుసుకో తగినది. తురీయ పాదమనిననూ, తుర్యావస్థ అనిననూ ఒకటిగానే ఉన్నది. ఇదియే బ్రహ్మావస్థ. ఈఅవసనుపొందినవారు బ్రహ్మస్వరూ

పులు. తుర్యావస్థాభిమాని సాక్షిగనుక వీరు స్థూలశరీరజీవాదులు నేను అనే సంజ్ఞకలవారుకారని తాను. సాక్షిస్వరూపుడననే జ్ఞానముకలవారని శ్రోతలకు పైనచెప్పిన తురీయలక్షణములవలన బ్రహ్మను గ్రహించుటకు విరుద్ధములుగా నుండును గాని అన్నియు యదార్థములు. వీరికి ప్రపంచజ్ఞానము అభ్యాసమై అనుభవములోనున్నందున తురీయజ్ఞానము లేనందున విరుద్ధముగదోచును. జ్ఞానము నాలుగువిధములు. ౧ గర్భస్థ జంతువందు ఆరుమాసములవరకు జడస్వరూపము. ౨ పుట్టిన శిశువునకుఅజ్ఞానము. 3 అంతటనుంచి ప్రపంచజ్ఞానము, ఇదియు అజ్ఞానములోనిదేను. స్వప్నజాగ్రతలవంటి భేదముకలది. ఈనాలగవజ్ఞానము వాస్తవము. ౪ తురీయజ్ఞానము. ఇదియే బ్రహ్మజ్ఞానమనబడును. నిజమైనవస్తువును తెలుపుతున్నందున సత్యమని, ఈజ్ఞానముగలఅవస్థయే తుర్యావస్థ. ఇదియు విడచి సాక్షీభావముగా స్వరూపస్థితిలోనుండుట తుర్యాతీతమనబడును. ఇది పంచమదశ, తుర్యాతీతమనున్ను. వీరు సకలము చిన్మయముగాచూతురు. బ్రహ్మవస్తువు సత్తారూపముగా జగత్తుయందంతటనూ వ్యాపించి నిర్మలమైనదై పూర్ణముగానున్నందున కంటికి అగుపడదు. సత్తాలేనివస్తువు జడమని సర్వానుభవములోనున్నదిగాన సత్తా అంతటను గలిగియున్నందున ప్రపంచమంతయూ చిన్మయమనిభావము. అట్టిబ్రహ్మను బోధించుటకు జగత్తుయందుదృష్టాంతముగా యేదియునులేదు. అంతనూగ్రహించే తనయందున్నజ్ఞానమే బ్రహ్మస్వరూపము. బాహ్య నేత్రముకు మనో దృష్టి

కారణము. దానికి కారణములేదు. కాన తురీయ్యా జ్ఞానమే ఆత్మ(బ్రహ్మ)అని భావము. అదే తననిజరూపమని గ్రహించవలెను. మధురరసమునకు రూపములేదు. రసనేంద్రియముద్వారా గ్రహించబడుచున్నది. గుడమునందు శర్కర యెట్లిమిడియున్నదో ఇతరపదార్థములందు మధురరస మాగు పడినపుడు వాటియందు గుడముగాని శర్కరగాని మేళన కలిగినట్లు గ్రహించబడుచున్నది. రూపము లేకపోయినను మధురరసమున్నది లేక అని ఎట్లు గ్రహణమగుచున్నదో ఆరీతినే విమర్శ ఉన్నపుడంతటనూ సత్తాస్వరూపముగా ఆత్మ నిండియున్నది అని తెలియుచున్నది. కనుక బ్రహ్మ పరమాత్మ తురీయ్యము అని ఈసంజ్ఞలుగల చిత్కళల ప్రత్యక్షముకాని పరోక్షముకాదు. సుషుప్తినుంచి తుర్యాతీతము వరకూ దశాపంచకము. అయిదుదశలు చెప్పబడినవి.

పంచావస్థలవివరణము - సుషుప్తిలక్షణము

శివసూత్రే॥ అవివేకో మాయాసౌషుప్తమితి
సుఖమహమస్వాప్సం నకించిదవేదిష మితిస్మరణాత్॥

శ్రు॥ యదజ్ఞానం తత్ప్రలీనౌ తౌవిజ్ఞాన మనోమయౌ
తమోహ్వవిలయావసా నిద్రాజ్ఞానంచ సైవహి॥

తా॥ సుప్తావస్థ ప్రకృతియొక్క ప్రథమావస్థగా నున్నది. సుషుప్తి స్వప్నము జాగ్రిత తురీయ్యము తుర్యాతీతములనే ఈఅవస్థాపంచకము ఆరోహణక్రమముగా పృధ్వ్యాది ఆకాశాంతమయిన పంచభూతములధర్మములు. ఆయా

అవస్థయందు ఆయాభూతాంశము అధికము ప్రధానముగా నున్నది. ఈ అవస్థాపన్చకమును ప్రకృతిసంబంధముగలజీవునిదే గాని ఆత్మకు ఎట్టి అవస్థాభేదములేదు. ప్రకృతియొక్కయు, పరమాత్మయొక్కయు, విభాగమును తెలుసుకొనుటకు ఈ అవస్థల విచారణ ఆవశ్యకత కలిగినది. అన్ని అవస్థలు మనోబుద్ధులవల్ల కలుగుచున్నవి. మనస్సు శక్తిభాగము. బుద్ధి శివభాగము. మనోబుద్ధులు రెండును, మేఘాచ్ఛాదితమైన సూర్యమండలమువలెను, హృదయస్థానగతములై తమస్సులో మునిగియున్నపుడు సన్నగిలి యున్నపుడు సుషుప్తి అనబడును. దీనినే అవివేకమని, మాయ అని సుషుప్తి అని శివసూత్రము.

మనోబుద్ధులు రెండును అజ్ఞానమందు లీనమైనపుడు వాటి లయమే నిద్ర అని, అజ్ఞానమని చెప్పబడుచున్నది. అని శ్రుత్యర్థము.

ఈ అవస్థలయందు మనోబుద్ధులు తమోమయములైనందు సుఖము, దుఃఖము, రెండునూ లేనందున సుషుప్తి, సంప్రసాదావస్థ అని వాడుక. స్వప్న జాగ్రతలలో అలసిన జీవుడు ఈ అవస్థయందు విశ్రమించును. జీవుడు ఈ అవస్థను పొందినపుడు ప్రాజ్ఞుడనిపించుకొనును. ఇది పృథ్వీతత్వప్రధానము గనుక జడస్వభావము గలది. ఈ అవస్థాపన్చకము బంధమోక్షముల అనుసంధాన స్వరూపముగనుక ఈ విచారణ బ్రహ్మజిజ్ఞాసకలవారికి ముఖ్యముగా నుండును.

మాతృకా చక్రసంజ్ఞావివేకే, ప్రథమస్కంధే॥

శ్లో॥ జాగ్రత్సుషుప్తి కృతదక్షిణవామపార్శ్వాం
స్వప్నస్వభావ పరిక్లృప్త జఘన్యభాగాం
తుర్యాతి తుర్యఘటితానన హృత్ప్రదేశాం
ప్రాణేశ్వరీం పరశివస్య పరామృశామః॥

తా॥ జాగ్రత్సుషుప్తులచేత కల్పించబడిన కుడి ఎడమ పార్శ్వములు కలిగినట్టియు, స్వభావముచేతనే స్వల్పమయిన స్వప్నావస్థయే కటి ప్రదేశముగలదిన్ని; తురీయ్యము ముఖము గాను తుర్యాతీతము హృదయముగాను ఉన్న పరశివుని ప్రాణతుల్యమయిన భార్యయగు విమర్శరూప పరాశక్తిని భావిస్తున్నామని గ్రంథకర్తలు గ్రంథాదిని ప్రార్థించి నారు. ఇందువల్ల యీపన్చావస్థలు విమర్శశక్తిస్వరూపము లనియు, పరమేశ్వరుడు నామరూపరహితుడు, పూర్ణుడు, శాంతుడు, చిదానందస్వరూపుడనియు, సృష్టిఅంతయు శివ శక్తిమేళన అనియు తెలియబడుచున్నది.

శ్లో॥ పూర్ణేవపూర్తిరవికల్ప పదేసుషుప్తౌ
జాగ్రత్త్వపూర్తిరపి సంస్మృతి ధామ్నితద్వత్
జాగ్రత్సుషుప్తి సమవాయ పదేతురీయే
స్వప్నేచ తాదృశితయో రసమగ్రతైవ॥

తా॥ సృష్టికి శివశక్తులు మాతాపితరులవంటి కారణ స్వరూపులు. సృష్టి ఈపంచావస్థలుగానున్నది. అందు తురీయా తీతము నిర్గుణబ్రహ్మము. సర్వకారణము. తక్కిన నాలుగవస్థలలో

సుషుప్తి. తురీయములు, శివభాగములు, శివుడు బిందుస్వరూపుడు, బిందువు పూర్ణస్వరూపము గాన ఈ రెండవస్థలు పూర్ణత్వము గలవి. స్వప్న - జాగ్రితలు సంసార స్వరూపములు. శక్త్యంశములు, సంతుష్టిలేనిది మనోబుద్ధులు రెండును నేత్రేంద్రియమును పొందినపుడు పూర్ణవికాసత కలిగినపుడు జాగ్రిత అనిపించుకొనును, ఆరెండును హృదయగతమైనపుడు తమస్సులో మునిగి క్షీణించినందున సుషుప్తి నిద్రావస్థగానున్నది. స్వప్నము ఉభయమేళనము. సూక్ష్మనాడులయందు మనోబుద్ధుల సంచారము కేవలమనస్సే రూపము కలది, గాన మిథ్యాస్వరూపముగా నున్నది. తురీయ్యమనగా మనోబుద్ధులు రెండును సిరోమధ్యనుపొంది మనస్సువృత్తిశూన్యమై లయమై బుద్ధిలయించకుండా పూర్ణవికాసత గలిగియుండు నవుడు జాగ్రిత్సుషుప్తుల మేళనావస్థగానున్నది. బుద్ధి నిల్చియున్నందున సుషుప్తికాదు. మనసు లయమైనందున జాగ్రితకాదు. యీ రెంటిటి మేళన తుర్యావస్థయనబడును. ఇది ముందు విరివిగా తెలియబడును. 'బిందువు పూర్ణమును తెలుపుచున్నందున సివాంశలగు సుషుప్తి తురీయ్యములు పూర్ణత్వములుగలవి. శక్త్యంశలగు స్వప్నజాగ్రితలు పూర్తిలేనివనిభావము. తుర్యాతీతము బ్రహ్మస్వరూపము.

శ్లో॥ తస్మాత్ప్రవృత్తి వినివృత్తి మయోభయార్ధస్వప్న
స్సుషిప్తిరవిజాగ్రిద వీతిగోప్యం। భేదా విభేదమయ
జీవసివాజ్ఞకానాం షణ్ణాంవిమిశ్రిణమిదం ప్రకృతిర్దశానాం॥

తా॥ ప్రవృత్తిగల జాగ్రిత, నివృత్తిగల సుషుప్తి. ఉభయ ధర్మములుగల స్వప్నము, ఈ మూడవస్థలు పశుభావ శివభావములను పొందినవారికి దశాక్రమము వేరుగానున్నందున ఇవి ఆరు విధములు. ఈ ఆరువిధములగు దశలయొక్క భేదము ప్రకృతిస్వరూపముగానే ఉన్నది. పరమాత్మకు ఏ భేదమున్ను లేదు. అంతయు చిన్మయము గాన అభేద భావనయే తుర్యాతీత మనబడును-

మాతృకాచక్రే॥ సుప్తిస్కంధము॥

శ్లో॥ మాయాబలాత్ప్రథమ భాసిజడస్వభావం।
విద్యోదయాదథ వికస్వరచిన్మయత్వం॥
సుప్త్యాహ్వయం కిమపి విశ్రమణం విభాతి
చిత్రక్రమం చిద చిదేక రసస్వభావం॥

తా॥ సాధకజనులకు ముందుగా మాయాబలమువలన జడస్వభావముగల సుషుప్తికలుగుచున్నది. తరువాత జ్ఞానోదయమైనందున వికసన స్వభావముగల సకలమూ చిన్మయముగా ప్రకాసించుచున్నది- తుర్యావస్థ లభించుచున్నది. ఈ తుర్యావస్థ సుషుప్తియొక్క అనిర్వాచ్యమైన విశ్రాంతి స్థానముగానున్నది. సుషుప్తి జాగ్రిత్స్వప్నములకు విశ్రాంతి స్థానము. ఆ సుషుప్తికి తురీయ్యము విశ్రాంతిస్థానమని. సుప్తావస్థయందు మనోబుద్ధులు రెండునూ లయమైనందున జ్ఞానశూన్యమై జడముగానున్నది. తురీయ్యమందునూ మనసు లేనందున ద్వైతరూపభేదజ్ఞానరహితముగనుక సుషుప్తితో సమానము. బుద్ధి లయముకాలేదుగాన సకలమూ చిన్మయ

ముగా ప్రకాశజ్ఞానముకలది. అందువల్ల ఈ తుర్యావస్థ శివశక్తిమేళనగానున్నది. ఈశివశక్తి సామరస్యము విచిత్ర మయినది.

## స్వప్న స్వరూపము

శ్లో॥ మనోమాత్ర పదేధ్యక్ష విషయత్వేన విభ్రమాత్
స్పష్టావభాస భావానాం సృష్టిస్స్వప్న పదం మతం॥

తా॥ మనస్సుయందు సకలవిషయములు స్పష్టముగా ప్రకాశించుచు ప్రపంచము విభ్రమించుటవల్ల స్వప్నావస్థ యనబడును. ఈఅవస్థ నిద్రలోనుంచి కలుగుచున్నది. మనో బుద్ధులు జ్ఞానేంద్రియ పంచక సూక్ష్మనాడీ సంచారమన్న జాగ్రతానుభవ ప్రపంచము వాసనారూపముగలిగి నిద్ర యందిమిడియున్నది. ఆవాసన నిరంతరానుసంధానము. స్వప్న మందు కొంచెము ప్రపంచముగా పుట్టును.

## మాతృకాచక్రె

శ్లో॥ విశ్వస్య కారణ దశేతి నిరూపితైవం
కార్యక్రమో భవతి కార్య మిదం విమర్శాత్।
విశ్రాంతమాత్మని పరాహ్వయ వాచి సుప్తౌ
విశ్వం వమ త్యథవి బోధ పదేవిమర్శః॥

తా॥ జాగ్రదవస్థలో కలుగబోయే కార్యరూపమైన ప్రపంచముకు ఈస్వప్నావస్థ కారణదశగానున్నది. పరా స్వరూ పమైన సుషుప్తియందు విశ్రమించియున్న ప్రపంచమును ఈ స్వప్నదశ విమర్శవల్ల పైకి పుట్టించుచున్నది.

శ్లో॥ వాణీపదాఖిలు ఋకార ఌకారరూపా
సంకోచ గంధ సహితా ऽగనేపి సుప్తా ।
సంకోచవేవ చిదచిద్ఘన ఖస్యవాణీ
తద్యోచుసంకుచ తిచ పరిష్కృతా విమర్శే॥

తా॥ పరాస్వరూపమైన వాగ్దేవత ఋ ఌ అనే హ్రస్వ స్వరములకు రూపముగా ముకళీభావముగలదై ఆకాశతత్వమందును సుప్తావస్థయందును ఉంటున్నది. శివశక్తిమేళనస్వరూపమైన ఆకాశతత్వము ఈ స్వప్నావస్థయందు లోపముచేత ఇంకను వాక్కులేదు. స్వప్నప్రపంచము బహిరంగముకానేరదు.

అథ జాగ్రదవస్థాస్వరూప ముచ్యతే
తంత్రరాజే॥

శ్లో॥ సర్వాక్షగోచరత్వేన యాతుబాహ్యతయా స్థితా ।
సృష్టిస్సాధారణీ సర్వ ప్రియాత్మాయం సజాగరః॥

తా॥ బాహ్యప్రపంచము దశేంద్రియములచేతను గ్రహించబడుచున్నది. ఏది సకలజనులకు ప్రియముగా నున్నదో సృష్టిసాధారణమైనదో అది జాగ్రదవస్థ యనబడును.

మాతృకాచక్రే॥

శ్లో॥ ఇత్యన్తరీమదిహ సంకుచితే విమర్శే
సంకోచ మాశ్రయతి బాహ్యపదేప్రగాఢం ।
ప్రత్యేకమేవ కలయన్త్యథ పంచభావం
భూతాని పంచ జగతో నియతఃకలాపః॥

తా॥ వెనకటి స్వప్నావస్థయందు విమర్శశక్తి కొంచము ముకుళీభావమును పొందినది. ఆ విమర్శశక్తి ఈ జాగ్రదవస్థ

యందు పూర్తిగా ముకిళించుచున్నది. సుషుప్తియందు ప్రకృతిమయుమైన ప్రపంచజ్ఞానములేనందున అది సంప్రసాదావస్థగా యున్నది. ఇది ఆత్మకునిజమైన అవస్థ. దీనియందు నిమిడి యున్న ప్రపంచము స్వప్నావస్థయందఙ్కురించి జాగ్రదవస్థలో ప్రత్యక్షమగును. కాని జాగ్రతలో నిజమైన ఆత్మజ్ఞానముపూర్తిగాపోయి ప్రపంచమే నిజమనే విపరీతజ్ఞానముకలిగి ఆత్మలేదనే వ్యవహారముకూడా గలుగుచున్నది. దీనిని వదలించుటకయే ఈ విచారణకలిగినది.

పృథివ్యాది పంచభూతములవలన ఆరోహణక్రమముగా సుషుప్తినుంచి తుర్యాతీతమైన అవస్థాపంచకము ఉత్పన్నమైనది. ఆకాశాది సృష్టిక్రమము. జగత్తంతయూ పంచభూతవికారముగా నున్నది. ఆదిని ఆత్మ ఏకాకారము. సర్వపరిపూర్ణము అందిమిడియున్న మాయాశక్తి ఉద్రేకించినపుడు ఆత్మ రెండు భాగములు అయినది, బిందువు ప్రకాశాంశ శివభాగము. విసర్గ విమర్శాంశము, శక్తిభాగము. బిందుభాగమందు శక్తియు శక్తిభాగమందు బింద్వంశయు కలిగిఉన్నది. శక్తిభాగ ముద్రేకించినపుడు శివభాగము అందులీనమైఉన్నందున అపుడు విమర్శాశూన్యమై ప్రవృత్తిజ్ఞానము గలుగును. అది జాగ్రదవస్థ యనబడును. శివభాగ ముద్రేకించినపుడు శక్తిభాగము దానియందు లీనమైనందున అపుడు వివేకముగలిగి ఆత్మానాత్మ విచారణకలిగి ఆత్మను తెలుసుకొనును. యిదియే తురీయముగానున్నది. సకలమూ శివశక్తిమేళనగా నున్నది. వీరు అనపాయులు. ఒకటి ఉద్రేకించినపుడు రెండవదితగ్గి ఉద్రేకించిన

భాగములను ఇమిడియున్నందున ఇవి జగత్తుకు ప్రధానవస్తువులుగానున్నవి. ఈప్రపంచ స్వరూపమైన అజ్ఞానము వదల వాస్తవజ్ఞానము పొందుటకొరకు శ్రీచక్రమును, అకారాది హకారాంతమైన మాతృకావర్ణములనూ, బ్రహ్మాండమును, శరీరమును, అనుసరించి బోధించుచున్నారు. మాతృకాశ్రీచక్రములకు ఆదివస్తువు బిందువు. బిందువికసనము విసర్గ అని, త్రికోణ చక్రమని. ఈరెండును శివశక్తిభాగములు. బిందువు పరాస్వరూపము. విసర్గపశ్యంతి. అష్టవర్గులు మధ్యమావస్థ. పంచాశద్వర్ణ విభాగము. వైఖరీస్వరూపము, ఇందుకుదృష్టాంతము. బిందువు బీజమువంటిది. వైఖరీవృక్షము వంటిది పత్రశాఖాయుతమైన వృక్షమును చూచినపుడు దీనికికారణమైన బీజముగుపడదు. అందువలన బీజముదీనికి లేదనేవాదము పుట్టవచ్చును. బీజావస్థలో వృక్షమిమిడి యున్నదనియు వృక్షావస్థలో బీజమిమిడి యున్నదనియు ఈహాంశమును తెలుసుకున్నపుడు ఆత్మలేదని అగుపడదనే అజ్ఞానము వదిలిపోవును.

## అథతురీయావస్థా వివరణము

వాక్య॥ పూర్వోక్త సుప్త్యాద్యవస్థాత్రయస్యతద్భోక్తౄణాం చ విభిన్నజ్ఞానజన్య శుద్ధవిద్యోదయాఖ్య శ్చమత్కారస్తుర్యావస్థా. తదుక్తంబ్రహ్మోపనిషది “త్రిషుధామసు యద్భోజ్యం భోక్తాయశ్చ ప్రకీర్తితః, విందాత్తదు భయంయస్తు సభుంజానోన లిప్యతఇతి”॥

తా॥ వెనుక చెప్పిన సుషుప్తి స్వప్న జాగ్రితలయొక్కయుఁ ఆయా అవస్థాభేదమును తెలుసుకుని వాటియందుగల సుఖదుఃఖ్కములననుభవించే ప్రాజ్ఞ, తైజస, విశ్వాలనే, తత్తదభిమానులయొక్కయు వివరమును ఏజ్ఞానమువల్ల తెలియుచున్నదో అట్టిజ్ఞానమే తుర్యావస్థ అనియు, తదభిమాని సాక్షి అనియు చెప్పబడినది.

వరదరాజః

శ్లో॥ తుర్యంనామ పరంధామ తథాభోగశ్చ మత్రిక్రియా
భేదేపి జాగ్రదాదీనాం యోగినస్తస్యసంభవే॥

తా॥ తుర్యావస్థ శ్రేష్ఠమైనది. అది సాధ్యమైనపుడు జాగ్రిదాద్యవస్థా త్రియమందు గలుగడము, చిత్రిమైనది. ఆఅవస్థకలవారు జీవేశ్వర భేదములేనివారు. ఇదియె బ్రిహ్మావస్థగాయున్నది.

శివసూత్రము

వా॥జాగ్రిత్స్వప్న సుషుప్తి భేదేపి తుర్యాభోగసంభవ ఇతి; త్రిషుచతుర్థం తైలవదాసేచ్యం॥
మహాకారణశరీరాభిమానీ జీవస్తుర్యః; సఏవసాక్షీతిప్రసిద్ధః॥

తా॥ జాగ్రిదాది భేదమున్నప్పటికినీ తెలుసుకుని స్వస్వరూపము ఆత్మయని ఏభేదమునులేక లోపలనుపైని అంతయూ చిన్మయమని భావించి యథేచ్ఛగానుండుట తురీయము. ఇదివెనకటి మూడవస్థలయందును జలమందు తైలము వలెను తిలలందు తైలమువలెను మేళనగావ్యాపించి ఉన్నది.

అజ్ఞులు తెలుసుకొనలేరు. ప్రాజ్ఞులకు అనుభవముగా నున్నది.

సర్వకారణమైన పూర్ణబిందు రూపమైన పరమాత్మయే, మహాకారణ శరీరము. దానియందభిమాని సాక్షిఅనబడును. సాధకుని శిరోమధ్యను ద్వాదశాంతమందు సాక్షి స్థానమని తెలియవలెను.

మాతృకాచక్రే

శ్లో॥ అంతర్గపదంభవతి తచ్చతురఙ్గమైక్యా
చ్చిచ్ఛేత్యయోః కరణసీమ్న్యపి భావితైక్యః।
పంచాఙ్గకంభవతి బాహ్యపదం ప్రకృత్యాం।
చిద్వహ్నిగర్భకుహరా దధనిర్గతాయాం॥

తా॥ గర్భములోపలనుంచి చిద్రూపమైన జ్ఞానముదయించగా (విమర్శశక్తి కలిగినపుడు) శ్రీచక్రమందు ఆదినున్న బిందుచతుష్టయము శివశక్తుల ఐక్యమువల్ల లోపలనున్న అంతఃకరణ చతుష్టయము గల సుషుప్తి అగుచున్నది. ఈనాలుగు శక్తికి నాలుగు అవయవములు. అంతఃకరణమందునూ శివశక్తుల ఐక్యము భావించినపుడు బహిరంగమందు సుషుప్త్యాది తుర్యాతీతాంతమైన పంచావస్థలు కలదగుచున్నది. శివభాగము పంచాంగములు కలదని, శ్రీచక్రమందు మధ్యబిందువు, ముక్కోణచక్రమందున్న కోణబిందువులు మూడు కలసి నాలుగు బిందువులు కోణబిందుత్రయము త్రిగుణాత్మకమైన శక్త్యంశము. శివస్వరూపమధ్య బిందువు వలన కలిగినవి. తనలో చిద్రూపమైన జ్ఞానోదయమైనపుడు

శివశక్తుల కభేదజ్ఞానము కలుగును. అపుడు ఆబిందుచతుష్టయము లోపలనున్న అంతఃకరణ చతుష్టయ రూపమున్ను సుషుప్తి స్వరూపముగానుండును. సుషుప్తినుంచి తురీయ పర్యంతమూ చతురంగములు కలది. శక్తిభాగమని, జాగ్రత పంచాంగములు, పంచావస్థలుకలదని భావము. తురీయ్యము వరకూ శక్తిభాగమనియు, శక్తినాలుగంగములు కలదనియు తుర్యాతీతము పంచాగములు కలది, శివభాగమని రహస్యము.

శ్లో॥ జ్ఞానక్రియాత్మక సుషుప్తి నిబోధమధ్య
సస్థాక్షమా వుభయపక్షగ బిందుసర్గౌ ।
తౌవ్యాపకౌ తదుభయస్య తదఙ్గభూతౌ
జాగ్రత్సుషుప్తి సమవాయపదే తురీయః॥

తా॥ పురుష ప్రకృతులు ఆత్మయందుగల సుషుప్తి జాగ్రతల మధ్యనున్న క్షకార మకారములు. ఆఉభయపక్షములను పొంది బిందువిసర్గలుకలవి. క్షకారము శివస్వరూమైన బిందువు. మకారము మాయాస్వరూపమైన శక్త్యంశము. విసర్గరూపము. జాగ్రదవస్థకు కారణమున్ను. ఈక్షకార మకారములు సుషుప్తి జాగ్రతలను పొందించేవిన్ని వాటికి అంగములుగా నున్నవిన్ని; జాగ్రత్సుషుప్తుల మేళనము మద్యావస్థ తురీయమగుచున్నది. మనోబుద్ధులు స్థితితారతమ్యము వలన ఈజాగ్రదాది పంచావస్థలు కలుగుచున్నవి. మనోబుద్ధులు హృదగతమై తమస్సులో లీనమైనపుడు క్షీణించియున్నపుడు సుషుప్తి కలుగుచున్నది. ఆరెండును నేత్రగోళమును పొంది పూర్ణవికాసత కలిగినపుడు

జాగ్రద వస్థగానున్నది. ఆరెంటను కంఠగతమైనపుడు స్వప్నావస్థగానున్నది. ఆమనోబుద్ధులు శిరోమధ్యముపొంది మనస్సులయమై(వృత్తిశూన్యమై) బుద్ధిలీనముకాకుండా నిలిచి నపుడు తుర్యావస్థ అనిపించుకొనును. అపుడు బుద్ధిఉన్నం దున నిద్రకాదు. మనసులేనందున ద్వైతమూలేదు. గనుక జాగ్రతకాదు. సుషుప్తి ధర్మమైన మనోభావము, జాగ్రధర్మ మైనబుద్ధి సద్భావము. ఇట్లు ఉభయధర్మములు గలది తుర్యా వస్థ అనిభావము. ఇదితురీయ్య స్వరూపము.

తురీయ్యాభ్యాసము

శ్లో॥ ప్రాణాయామాదికం త్యక్త్వా స్థూలోపాయం వికల్పకం।
అవికల్పకరూపేణ స్వచిత్తేన స్వసంవిదా।
మనస్తుర్యరసేనాత్ర స్వదేహాదిప్రమాతృతాం।
మజ్జనేనప్రశమయన్ ప్రవిశేతత్సమావిశేత్॥

తా॥ లోకము; పంచభూతములు, గుణత్రయము, పంచావస్థలు వీట్లతో నిండియున్నందున ప్రపంచమని వాడుక కలిగినది.

జాగ్రదాద్యవస్థాత్రయము సర్వానుభవములోనున్నది. తురీయ్య తుర్యాతీతములు రెండును బ్రహ్మవేత్తల అనుభవములో నున్నవి. ఈరెండునూ బ్రహ్మావస్థలుగా నున్నవి. తురీయ్యము జాగ్రతలోనుంచి పొందవలెను. జాగ్రతలో పౌర్ణమీ దృష్టికలిగి (నేత్రములయందు పూర్ణవికాసత కలిగి) అంతఃప్రజ్ఞా బహిర్దృష్టికలవాడై పద్మాసనాసీనుడై ఇతరాసనాది భేదముగాని ముద్రలు ప్రాణాయామాది

కాయిక వికారములు లేక నిశ్చలమైన తనమనసును తనబుద్ధి యందు లయింపజేసి సహస్రారమందున్న చిత్కళను ధ్యానించుచు బుద్ధిలయించకుండా నిలిపి బుద్ధికి అచటనున్న చిత్కళలను ఆలంబనగానిచ్చి, చిద్రూపమందు తన మనో దేహేంద్రియాదులను లయింపజేసి తురీయరూపము, చిద్రూపము, లోపలనూ పైని నిండియున్నదని, లోకమంతయు చిన్మయముగా భావించి, తానునూ చిన్మయమనే భావించుటయే తుర్యావస్థగా నున్నది.

స్మృతి

శ్లో॥ యావద్ధ్యావ దహంకారో విస్మృతోభ్యాసయోగతః।
తావత్తావత్సూక్ష్మ దృష్టేర్నిజానందోనుమీయతే॥
అలీనత్వాన్ననిద్రేషా తతో దేహోపినోపతేత్।
నద్వైతమ్భాసతేనాపి నిద్రాత్రితాస్థితయత్సుఖం।
తద్బ్రహ్మానంద మిత్యాహ భగవానర్జునంప్రతి॥

తా॥ పూర్వోక్త స్థితిగానున్నపుడు బుద్ధి లీనముగాకుండా చిద్వస్తువు ఆలంబనగా యున్నందున నిద్రకాదు. అందువల్ల దేహము పడలేదు. మనస్సువృత్తి శూన్యమై చిత్కళ యందు లయమైనందున ద్వైతప్రపంచము లేనందున జాగ్రతకాదు. నిద్రయూకాదు. ఆకాలమందున్న సుఖము బ్రహ్మానందమని శ్రీకృష్ణులు అర్జునునకు ఉపదేసించిరి.

ఇదియే మాండూక్యమందు చెప్పిన తురీయ్య స్వరూపము. ఇదియే ఛాందోగ్యమందు చెప్పిన భూమా

వస్థగా నున్నది. వీరుస్థితప్రజ్ఞులు గీతలో నాలుగవ అధ్యాయమందు చెప్పినారు.

మహోపనిషతు

శ్లో॥ చిత్తే చేత్యదశాహీనే యాస్థితిః క్షీణచేతసాం।
సోచ్యతేశాంతకలనా జాగ్రత్యేవసుషుప్తతా॥

తా॥ చిత్తము దృశ్యసంబంధమైన వృత్తులలో శూన్యమైయుండగా వృత్తిక్షయమైన వానిస్థితి వాసనారహితమైనదై జాగ్రతయందే సుషుప్తియనిపించుకొనును. పూర్ణజాగ్రతకాను. పూర్ణనిద్రకాదు ఈరెండిటికి మధ్యావస్థ తురీయమని భావము.

శ్లో॥ జడాజడదృశోర్మధ్యే యత్తత్వంపారమార్థికం।
తదేవబహుశః ప్రోక్తం బృహదారణ్యకాదిషు॥

తా॥ దృక్, దృశ్యము, ఈరెండింటి నడుమనున్న అనుభవము ఈరెండిటియందు అనువృత్తమైన చైతన్యము పరమాత్మ స్వరూపమని బృహదారణ్యము మొదలగు శ్రుతులయందు చెప్పబడినది.

జ్ఞానవాసిష్ఠే

శ్లో॥ దృశ్యదర్శనసంబధే యానుభూతిర్నామయా।
తామవష్టభ్య తిష్ఠత్వం సౌషుప్తిం భజతేస్థితిః॥
సైవ తుర్యత్వమాయాతి తస్యాంద్రష్టా తురాఘవ॥

తా॥ దృక్, దృశ్యముల, సంబంధముకలిగినందున గల అనుభూతియే ఆత్మస్వరూపము. ఈరెంటియందు ననుసరించి

యున్న చైతన్యము ననుసరించియుండుము. అది యేతుర్య త్వమును పొందుచున్నది.

శ్లో॥ నాత్మాస్థూలోన చైవాణు ర్నప్రత్యక్షోన చేతరః।
నచేతనో నచ జడో నచైషో సన్న సన్మయః।
నాహం నానోనచై నైకో నవానేకోపిరాఘవ॥

తా॥ ఓ రామచంద్రా ఆత్మస్థూలముకాదు, సూక్ష్మముకాదు, ప్రత్యక్షముకాదు, లేనిదికాదు చేతనముకాదు, జడమున్నూకాదు అగుపడుచున్న ప్రపంచముకాదు, శూన్యముకాదు, నేను అనేదికాదు, నాయందుగల దనేదికాదు, ఏకముకాదు, అనేకముకాదు, మరి ఎట్టిదనిన ఇవియన్నియు దేనియందు కల్పించబడినవో ఏదివాటినన్నిటినీ తెలుసుకుని గ్రహించుచున్నదో అదియే ఆత్మగానున్నది. అనిభావము.

శ్లో॥ యదిదంద్రృశ్యతాం ప్రాప్తం మనష్షష్ఠేంద్రియాశ్రయం।
సర్వాతీతంపరంరామ యన్నకించిదివే హాత్॥

తా॥ దృశ్యప్రపంచముకన్న వేరైనదానిని చెప్పుటకు జగత్తుపనికిరాదు. గాన ఆత్మఉపమాన రహితమైనది. అనిభావము. దృశ్యమంతయూ త్యజించగా మిగిలిన జ్ఞాతయే ఆత్మయని గ్రహించవలెను.

శ్లో॥ ఆత్మన్యతీతెసర్వస్మా త్సర్వరూపేథవాతతే
కోబంధః కస్యవామోక్షో నిర్మూలంమననంకురు॥

తా॥ ఆత్మ దృశ్యమంత కన్నను వేరైనదిగాని అంతయందు అనుస్యూతమైయున్నది. గాని అయినపుడు బంధ

మోక్షములు ఎవరికి? గనుక మనమును నిర్మూలముగా వదల వలెను. వృత్తిరహితమే మనోలయము.

శ్లో॥ అస్వప్నాయా అనంతాయా అజడాయా మహామతే।
యద్రూపం చిరనిద్రాయా స్తద్రూపం పరమాత్మనః॥

తా॥ గొప్పబుద్ధిగల ఓరామా జాగ్రత్స్వప్న సుషుప్తులుగాక తుర్యావస్థయందుగల ఏచిద్రూపముగలదో అది పరమాత్మ స్వరూపమని వసిష్ఠులువారు రాములవారికి ఉపదేశించిరి. ఇదితురీయ స్వరూపము.

తురీయ విఘ్నాని

తదుక్తం జ్ఞానార్ణవే

శ్లో॥ లయే సంబోధయేచ్చిత్తం క్షిప్తం ప్రశమయేత్పునః।
సకషాయం విజానియ్యాత్ తత్ర నాస్వాదయేద్రసం॥

వ్యా॥ అస్యనిర్వికల్ప స్యాఙ్గినో లయవిక్షేప కషాయ రసాస్వాదా శ్చత్వారోవిఘ్నాః;

లయసావదఖండ వస్త్వవలంబనేన చిత్తవృత్తిర్నిద్రా. అఖండ వస్త్వనవలంబనేన చిత్తవృత్తే రన్యావలంబనం విక్షేపానామజాగ్రత్. లయవిక్షేపాభావేపి రాగాది వాసనాయా స్తబ్ధీభావా దఖండవస్త్వ నవలమ్బనం కషాయః; స్వప్నఇతి. త్రయాణామభావే అఖండవస్త్వ నవలంబనేపి చిత్తవృత్తేస్సవికల్పకానంద రసాస్వాదనం రసాస్వాదః. ఏతద్విఘ్నచతుష్టయేన విరహితం చిత్తం నిర్వాతదీపవ దచలం సద ఖండ చైతన్యమాత్రం భవతి. యదాతదా నిర్వికల్పతురీయ మిత్యుచ్యతే. తదేవబ్రహ్మాత్మసిద్ధిః.

తా॥ తుర్యావస్థలో వెనక చెప్పిన ప్రకారము మనో బుద్ధులను స్వాధీనం చేసుకున్ననూ, పూర్వవాసన వలన ఆమనోబుద్ధులకు చలనము కలిగినపుడు ఆయవస్థలని లయ విక్షేప కషాయ రసాస్వాదములని నాలుగు విఘ్నములు గానున్నవని. వాటిని పరిహరించవలెనని చెప్పుచున్నారు.

౧ లయమనగా మనసును వృత్తిశూనముగాచేసి బుద్ధి లయించకుండా నిల్చియున్నపుడు బుద్ధిసద్వస్త్వాలంబనకలిగి యున్నపుడు తురీయమగుచున్నది. అపుడు అఖండవస్తువు, ఆలంబనము దొరకనపుడు బుద్ధికూడ మనసుతోపాటు లయమగును. అదినిద్రఅని అపుడు బుద్ధికి ఆలంబన నివ్వవలెను. బుద్ధిని లేపవలెను.

౨ బుద్ధికి అఖండవస్తువు అలంబన లేనందున ప్రపంచ వస్తువుల ఆలంబనకలదని గ్రహించవలెను. విక్షేపము మనసుకు వృత్తికలుగుట జాగ్రతఅగును. అపుడుదానిని శాంతింప చేయవలెను. వృత్తిరాహిత్యము కావలెను.

3 లయవిక్షేపములు లేకపోయిననూ బుద్ధికి అఖండ వస్త్వాలంబన లేనందున రాగాదివాసన కలుగుట స్తబ్ధీభావము, కషాయమును; ఇదిస్వప్నము. అపుడుదీనిని తెలుసుకునిన మాత్రమున ఇదినసించును, బుద్ధికి సద్వస్త్వాలంబననివ్వవలెను.

౪ లయవిక్షేప కషాయములు లేకపోయిననూ ఆకాలమందు కల్పితమైన సుఖానుభవమున్ను, అఖండవస్తువు ఆలంబనలేక పోవుటయు రసాస్వాదన అనిపించుకొనును. ఇవినాలుగు విఘ్నములు. వీటిని తెలుసుకుని సర్వవ్యాపకమైన స్థూలా

కాశమును ఆధారముగానున్న అఖండాకార చిదాకాశమనే సద్వస్తువుగాని సహస్రారమందున్న బిందుమండలమందు చిత్కళనుగాని, బుద్ధికి ఆలంబనగానిచ్చి, దానియందు తాను ప్రపంచ లయమైనపుడు ఆకాశమందు గాలిలేని స్థలమందున్న దీపమువలెను చిన్మాత్రుడై ప్రకాశించును. అదినిర్వికల్ప తురీయ్యము. దీనిదారుఢ్యము తుర్యాతీతము. కైవల్యము గును.

## తురీయ్యాతీత లక్షణము.

శ్లో॥ తుర్యావస్థంభతో లభ్యం తుర్యాతీతం పరంపదం।

తా॥ తుర్యావస్థయొక్క దారుఢ్యమే తుర్యాతీతమని. రాక పోకలుకలది. రసాస్వాదనకలది. తురీయ్యము అవస్థాత్రియ మందునూ తుర్యానుభవము, తుర్యాతీత మనబడును. ఇది ఉత్తమపదము. దీనిపైని స్థానములేదని భావము. ఈఅవస్థ కలవారు అవధూత లనబడుదురు.

## వరదరాజః

శ్లో॥ తుర్యాభ్యాస ప్రకర్షేణ తుర్యాతీతాత్మకం పదం
సంప్రాప్తవానథక స్సా త్స్వలోకాంత రాత్మనా॥
తుల్యశ్శివేన తన్మాత్రిస్స్వచ్ఛందానంద శాలినేతి॥

తా॥ తుర్యాభ్యాసాధిక్యము చేత తుర్యాతీతమనేది కలుగుచున్నది. వారుసకల ప్రపంచము తనస్వరూపముగాను ఆత్మస్వరూపముగాను చూతురు. వారుపరశివ సమానులు. స్వేఛ్ఛాను సారముగా సంచరించేవారు. ఆనందమే స్వరూపము గాగలవారు.

శివసూత్ర త్రయము.

పంచమదశాపన్నస్య స్వరూపకథనాయ సూత్ర త్రయము క్తం॥ శివసూత్రం॥ శరీరవృత్తిర్వ్రతం॥౧॥

కథాజపః ॥౨॥ దానమాత్మజ్ఞానం ॥౩॥ స్వాత్మానుసంధాన రూప శివపూజా సాధనత్వా చ్ఛరీర ధారణం వ్రతం నతుచ్ఛం॥

శ్లో॥ అంతరుల్లసిత స్వచ్ఛశక్తి పీయూష తోషితం
భవత్పూజోపభోగాయ శరీరమిదమస్తునః॥

తా॥ తుర్యాతీతము అయిదవదశ. ఆ యవస్థను పొందిన వారిస్థితిని శివసూత్రములలో మూడు సూత్రములచేత వివరించినారు. అందు మొదటి సూత్రార్థము. ఆత్మానుసంధాన రూపమైన శివపూజకు సాధనముగు శరీరధారణ మాత్రము కు ప్రవృత్తికలవారు, వారిప్రవృత్తి నివృత్తిగానే యున్నది, అనిభావము. శరీరధారణ తుచ్ఛముకాదు అనివారి భావన.

సూ॥ తచ్చిత్తస్య సత్యగ్రాహిత్వాత్ ఇతిబ్రహ్మసూత్రే
నిర్వికార వైశద్య ధ్యాత్మ ప్రసాదః॥

తా॥ శరీరధారణవలన చిత్తస్థితి చిత్తమువలన సత్య స్వరూపమైన పరమాత్మను గ్రహించుచున్నది, అనిభావము. చిత్తము నిశ్చలతను పొందినపుడు ఆత్మస్ఫురణ కలుగు చున్నది.

రెండవసూత్రము కథాజపః॥ జ్ఞానవాసిష్ఠే। శ్లో॥ సదాసంతోఽభి
గంతవ్యాః యద్యప్యుపదిశంతినో। యాహిస్వైర కథా
లాపా ఉపదేశా భవంతితాః॥

తా॥ వారియొక్క స్వేచ్ఛాపరిసంగమే జపము. జ్ఞాన
మును గోరువారు బ్రహ్మవేత్తల నాశ్రయించవలెను. సర్వ
దా వారివద్దకు వెళ్ళవలెను. వారివద్దచేసిన పరిసంగమంతా
ఉపదేశముగానేఉండును. ఆత్మప్రసంగము తప్ప వేరే పరిసం
గము వారివద్ద వుండదనుఅని భావము.

శివ సూత్రము॥ దానమాత్మజ్ఞానం॥ పరేభ్యో ఆత్మోపదేశం
దానమితి కృష్ణదాసేనోక్తం॥ శ్లో॥ ప్రోక్తం చైతన్యరూ
పస్య సాక్షాత్కరణమాత్మనః। యత్తద్దానం తదేవాస్య
దానం యత్నే నదీయ్యతాం॥

తా॥ వీరు దగ్గిరనున్న శిష్యులకు ఆత్మోపదేశము
చేయడమే దానము. శరీరజీవాదులు నేననే భ్రమగల శిష్యు
లకు తమయందున్న ప్రజ్ఞానమున్ను సాక్షియు స్వస్వరూ
పములని ఆత్మ సాక్షాత్కారము చేయడమే దానము. వీరు
శిష్యులను ముందుగా పిలచి ఉపదేసించెదరు. ప్రియత్న
పూర్వకముగా ఉపదేశము నివ్వవలెను. ఆత్మప్రసంగమే
జపము. ఆత్మోపదేశమే దానము. ఇంతకన్న వేరు ప్రయో
జనములేనివారు పంచమదశను పొందినవారని భావము.
తుర్యావస్థనుపొందినవారు జీవన్ముక్తులు. తుర్యాతీతులు విదే
హముక్తులుగానున్నారు. ఇది తుర్యాతీతలక్షణం.

## —♦ అ వ ధూ త ల క్ష ణం ♦—

శ్లో॥ అగ్రిమత్వాద్వరేణ్యత్వా ధూతసంసార బంధనాత్।
తత్వమస్యార్థలక్ష్యత్వా దవధూత ఇతి స్మృతః॥

తా॥ అవధూత అనే నాలుగక్షరములకు విశేషార్థము కలదని భావము. అది ఎట్లనిన:- అకారమువల్ల జీవన్ముక్తిని పొందినవారనియు, జ్ఞానసంపన్నులనియు, అనేకవిధములగు సుగుణములు గలవారిలో అగ్రగణ్యులని; వకారమువలన మనుష్యులలోనూ జ్ఞానులలోను శ్రేష్ఠులని; ధూ అనే వర్ణమువలన పోయిన సంసారమనే బంధము గలవారని; తకారమువలన తత్వమసిఅనేమహావాక్యార్థమును వీరు లక్ష్యముగా నున్నారని, బ్రహ్మస్వరూపులు; అవధూత శబ్దమందున్న నాలుగువర్ణములవల్లను తెలియుచున్న సంకేతార్థము గల వారుగనుక తుర్యాతీత కైవల్య జీవన్ముక్తదశలను పొందిన వారు అవధూతలని వాడబడుచున్నారు. వీరు జాగ్రతా ద్యవస్థాత్రయమందును తుర్యాతీతమందునే ఉందురు. వీరు వర్ణాశ్రమ భేదము లేనివారు. స్వేచ్ఛా సంచారులుగానున్నా రని భావము.

## —♦ జీవన్ముక్తలక్షణము ♦—

శ్లో॥ యోజీవతి గతస్నేహః సజీవన్ముక్త ఉచ్యతే।
సస్నేహ జీవితోబద్ధః ముక్తఏవ తృతీయకః॥

తా॥ దృశ్యమందు సత్యత్వభ్రమను విడిచి ఆత్మ యందాసక్తి గలిగి తాను ఆత్మస్వరూపుడను అనే జ్ఞానము

గలవాడు ముక్తుడు. దృశ్యమందు స్నేహము గలవాడు బద్ధుడు. దృశ్యమందు స్నేహము లేనివాడు ఆత్మ తాననే వాడు మూడవవాడు. వీరు తుర్యాతీతులు. వీరిది విదేహముక్తిగా నున్నది.

## —* కైవల్యస్వరూపము *—

శ్లో॥ అసంభవతి చేత్తస్మిన్దిగ్వ్యోమ్న్యాకాశ రూపిణీ।
ప్రకాశ్యేయాద్దృశం రూపం ప్రకాశస్యామలంభవేత్।
త్రిజగత్వమహంచేతి దృశ్యే।సత్తాముపాగతే।
ద్రష్టుస్స్యాత్కేవలీభావ స్తాదృశో విమలాత్మనః॥

తా॥ ప్రకాసించబడే ప్రపంచము శూన్యముగా భావించినపుడు ప్రకాశము మిగులును. అది తాననే భావనయే కేవలీభావము. అదియే కైవల్యము. అఖండాకారమైన ఆ బింబముకన్న వేరు ఏమియూ లేనందున యేకవస్తువని భావము.

శ్లో॥ అనాస్థాఖిల శైలాది ప్రతిబింబేహియాదృశీ।
స్యాద్దర్పణేదర్పణతా కేవలాత్మస్వరూపిణీ।
అహం త్వంజగదిత్యాదౌ ప్రశాంతేదృశ్యసంభ్రమే।
స్యాత్తాదృశీ కేవలతా స్థితే ద్రష్టర్యవీక్షణే॥

తా॥ అద్దమందు ప్రతిబింబించిన పర్వతాదుల నుపేక్షించి కేవల అద్దమును మాత్రము గ్రహించినట్లు; ఆత్మయందు ప్రత్యక్షముగానున్న నామరూపాత్మక ప్రపంచము నుపేక్షించి చిన్మయమైన ఆత్మనుమాత్రము గ్రహించుట ముఖ్యముగా కైవల్యము సిద్ధించుటగా నున్నది. ద్రష్ట

ఉన్ననూ ఆత్మకన్న వేరుగా నగుపడకూడదు. దృశ్యమంతయు అణగినపుడు దృష్టమాత్రము మిగులును. అదియే కేవలీ భావమని తాత్పర్యము.

శ్లో॥ అవాసనంస్థిరం ప్రోక్తం మనోధ్యానంతదేవతత్।
సఏవ కేవలీభావ శ్శాంతత్వైవచ తత్సదా।

తా॥ వాసనారహితమయిన మనస్సు స్థిరమయినపుడు అదియే ధ్యానమనబడును. అదియే కైవల్యమని; అది, అట్టి అవస్థ శాంతమని భావము.

శ్లో॥ ఊర్ధ్వబాహుర్విరామ్యేష నచకశ్చిచ్ఛృణోతితత్।
అసంకల్పః పరంశ్రేయో నకిమంతర్న భావ్యతే।
కిల తూష్ణీం స్థితేనైవ తత్పదం ప్రాప్యతేపరం।
పరమం యత్రసామ్రాజ్య మపిరామ తృణాయతే॥

తా॥ ఓరామచంద్రా! నేను చేతులుమీదికి యెత్తి ఇంతకన్న మంచిమార్గము వేరేలేదని దృఢముగా చెప్పగలను. దానిని ఎవరునూ వినరు. ఇంతేగాక ఏమియుస్మరించకుండా ఊరకుండుటయే ఉత్తమమైన శ్రేయస్సు. ఊరికే ఉన్నమాత్రముచేత సామ్రాజ్యపదవికన్న ఉత్తమపదవి దొరుకును. ఇది ఏవిధమైన శ్రమయు లేనిది. అయిననూ నామాటవినరని వసిష్ఠముని రాములవారికి ఉపదేశించెను.

—• రాజదంపతుల సంభాషణ •—

గద్య॥ వైరాగ్యయుక్తంవనమాగతం రాజానం; ఏవమాది ప్రసంగేన కృత్రిమ ఋషిర్బోధయిత్వా తూష్ణీంస్థితః॥

తా॥ వైరాగ్యయుక్తుడై గృహమును రాజ్యమును విడచి వనమునుపొందిన రాజునుచూచి ఆరాజుభార్యయగు విమర్శశక్తి ఋషికుమారరూపముతో భర్తకు జ్ఞానమార్గము సకలము ఉపదేసించి తూష్ణీభావముగ ఊరకుండెను.

—రాజు జీవన్ముక్తావస్థను పొందుట —

గ॥ రాజోవాచ. ధన్యోహం; ధన్యోహం; పునరపి. ధన్యోహం; విస్మృతంజ్ఞాతం;ధన్యోహం; ధన్యోహం;బ్రహ్మత్వాం గుర్వనుగ్రహం లబ్ధ్వా "కృతార్థోస్మి కృతార్థోస్మి కృతకృత్యోస్మిసర్వదా। బ్రహ్మానంద పదం తుర్యాం ప్రాప్యం ప్రాప్తోస్మి. శ్రీగురో!"

తా॥ ఇట్లు గురువు ఉపదేసించినపైని రాజు బ్రహ్మజ్ఞానము స్వస్వరూపజ్ఞానము కలవాడై ;శ్రీ గురువర్యా! మీ కృపవలన కృతార్థుడనైతిని. చేయతగినది చేసితిని. పొందతగినబ్రహ్మానందమును పొందితిని. అని బ్రహ్మానందయుక్తుడై యుండెను.

— విమర్శశక్తి నిజరూపముతోవచ్చుట —

గ॥ తతోరాజపత్నీ, స్వపతిం సంశయవిపర్యయ రహితజ్ఞానసంపన్నం జ్ఞాత్వా స్వస్థానం నేతు ముద్యుక్తా కౌతుకఋషివేషం విహాయ నిజరూపేణ సంబోధ్య నేతవ్య మిత్యంతస్సభావ్య; రాజానం ప్రత్యేవంవక్తి॥

కౌతుకఋషిరువాచ॥

హేరాజన్! యదృచ్ఛయా భవత్సమాగమము భూత్॥ భవన్మనోరథఃసిద్ధః. బహుదినాన్యతీతాని. పితృదర్శనార్థం గమిష్యామీ త్యుక్త్వా, ఖేచరీభూత్వా నిర్యయౌ. సరాజాతుర్యావస్థాయాం ప్రవిష్టః॥

తా॥ ఆరాజుభార్యయగు విమర్శశక్తి తనభర్త నిశ్చయమైన జ్ఞానయుక్తుడైనాడని తెలుసుకుని కృత్రిమఋషి వేషమువిడచి తన నిజరూపముతో రాజునుబోధించి స్వరాజ్యముకు తోడ్చుకువెళ్ళవలయునని తనలోతాను నిశ్చయించుకుని రాజుతో చెప్పుచున్నది. ఓరాజా! చిరకాలమైనది. నేను పితృదర్శనముకు వెళ్లెదను. నీకును మాకును యదృచ్ఛగా సమావేశమైనది. నీమనోరథము తీరినది. అని చెప్పి ఖేచరీగమనము కలవాడై ఆఋషివెళ్ళెను. ఆరాజు తురీయ్యానిష్ఠుడై యుండెను.

గ॥ రాజపత్నీ విమర్శశక్తిః, స్వగృహంప్రాప్యకృత్రిమఋషివేషం విహాయాంతఃపురే స్థాపితం స్వశరీరంప్రాప్య కానిచిద్దినాని రాజ్యకార్యాణివిమృశ్యతతో రాజానమానయామీతి మత్వా స్వస్వరూపేణ పునస్తపోవనం ప్రవిశ్య తుర్యాతీతావస్థాసంపన్నం స్వరూపనిష్ఠం పతిం వీక్ష్య, విస్మితా సమీపేస్థిత్వా, వీణాగానమకరోత్తన్నాదేన సరాజా జాగ్రదవస్థాంప్రాప్య; స్వాగ్రస్థితాం స్వపత్నీందృష్ట్వా ప్రియే! దుర్గమం వనం కథం ప్రాప్తాసి? కిమర్థమాగతా సీత్యవోచత్॥

తా॥ రాజుభార్య తనగృహ మందంతఃపురమందున్న స్వశరీరమునుపొంది కొన్నిరోజులు రాచకార్యములు నిర్వ

తీకొంచి రాజును ఇంటికి తీసుకురాదలంచినదై తన నిజరూప ముతో తిరిగి వనముకు వెళ్ళెను. స్వరూపనిష్ఠుడైయున్న భర్తను చూచి ఆశ్చర్యపడి తపోభంగము కూడదని సమీప మందు చెట్టునీడను కూర్చుని వీణాగాన మారంభించెను. ఆనాదమువలన రాజు జాగ్రదవస్థనుపొంది పురోభాగమం దున్న భార్యనుచూచి ఓప్రియురాలా! అసాధ్యమైన ఈవన ముకు ఏలాగునస్తివి? ఎందుకు వస్తివని అడిగెను.

—— రాజు తిరిగి స్వరాజ్యమును ప్రవేశించుట ——

గ॥ దేవ్యువాచ॥ శ్రీమతాం వనవాసః బహుకాల మభూత్. తపసాసాధితం కిమితిజ్ఞాతు మిచ్ఛయా హ మాగ తాస్మి. రాజాపత్నీంవీక్ష్య; స్వగురూపదిష్టం వక్తుమారబ్ధః. పత్నీ; రాజన్! అలమలం. మయైవ కృత్రిమఋషి రూపేణోప దిష్టం సర్వం; భవంతస్సర్వదా చిద్రూపాఏవ. మాయావినా ఐంద్రజాలికయా వంచితాః, విమోహితాః, స్వస్వరూప విస్మృతింప్రాప్తాః. భవతః; సర్వదా చిద్రూపమేవ స్వరూపం. జ్ఞానినాం, వనం గృహమపి సమమేవ. జనకాదయో విదేహ ముక్తాఅపిరాజ్య పాలనం కుర్వంతిస్మ. తస్మాద్గృహం ప్రత్యా గంతవ్య మితి ప్రార్థితా॥

తా॥ రాజుభార్య చెప్పుచున్నది. రాజన్! తమరు వన వాసముకు వచ్చి చిరకాలమైనది. తపస్సువలన ఏమి సాధిం చితిరని తెలియ కోరివచ్చితినని చెప్పెను. రాజువిని తనకు గురువులుపదేశించిన జ్ఞానకాండనుచెప్ప నారంభించగావిని

రాజుభార్య స్వామీ! నేను; కృత్రిమఋషివేషముతో వచ్చి సకలమూ ఉపదేసించితిని. మీరు ఐంద్రజాలికా స్త్రీచే మోసపోయి తమ నిజరూపమును మరచితిరి. సర్వదా చిద్రూపులు. నిత్యముక్తులు. గాన జ్ఞానికి వనము గృహమూసమానములే. జనకాదులు రాజ్యముపాలించుతూ విదేహముక్తులైరి. గాన స్వరాజ్యమును పరిపాలించమని భార్య ప్రార్థించెను.

గ॥ రాజోవాచ॥ ప్రియే! తపోనిష్ఠాయమహ్యాం గృహవాసః నరోచతేఇతి. భార్యా; రాజన్! శృణు.

తా॥ రాజు; భార్యనచూచి ప్రియే! తపోనిష్ఠులమైన మాకు గృహమందుండుటకు ఇష్టములేదనిచెప్పగా భార్య భర్తకు చెప్పుచున్నది. ఓ రాజా! వినుము.

—♦ జ్ఞానికి వనమూ గృహమూ సమానమని ♦—

శ్లో॥ వ్యవహారీ ప్రబుద్ధోయః ప్రబుద్ధో యోవనేస్థితః।
ద్వావేతౌ సుసమానావ మసందేహ పదంగతౌ॥

తా॥ లోకవ్యవహారము కలవాడై ఆత్మజ్ఞానము కలవాడును, ఆత్మవేత్తఅయి వనమందున్నవాడును ఈఇద్దరునూ నిశ్చయమైన పదవిన్ని, బ్రహ్మజ్ఞానము స్వరూపజ్ఞానమూ, కలవారుగనుక పూర్ణముగా సమానులనిపించుకుందురు.

శ్లో॥ గృహమేవ గృహస్థానాం సుసమాహిత చేతసాం।
శాంతాహం కృతి దోషాణాం విజనావన భూమయః॥

తా॥ పూర్తిగా స్వాధీనమయిన మనస్సుగల శాంతించిన అహంకారమనే దోషముగల గృహస్థులకు గృహములే జనరహితమయిన వనములుగానున్నవి.

శ్లో॥ అంతర్ముఖ మనా నిత్యం సుప్తో బుద్ధో వ్రజ న్నటన్।
పురం జనపదం గ్రామ మరణ్యమివ పశ్యతి॥

తా॥ సర్వదా అంతర్ముఖమైన మనస్సు గలవారు నిద్రలోనూ జాగ్రతలోనూ నడచుచున్నపుడు తిరుగుచున్నపుడును పల్లెలు గ్రామములు పట్టణములు వనములు వీరికి సమానములు.

శ్లో॥ అంత శ్శీతలతాయాంతు లబ్ధాయం శీతలం జగత్।
అంత స్తృష్ణోప తప్తానాం దావదాహ మయంజగత్॥

తా॥ అంతఃకరణ చాంచల్య రహితమయినపుడు శీతలత్వము కలదగును. అపుడు జగత్తంతయు చల్లగనేయుండును, అంతఃకరణ తృష్ణచే దహిస్తున్నపుడు జగత్తంతయు దావాగ్నిమయముగా నుండును అని భావము.

—♦ రాజుకు స్వరాజ్యప్రాప్తి ♦—

గ॥ ఇతి భార్యయా సరాజా బోధితస్సన్; అజ్ఞానినాం వనమపి గృహతుల్యమేవ, ప్రాజ్ఞానాం గృహమపి వనతుల్యం మత్వా, భార్యయా సాకం స్వపురం ప్రవిశ్య, రాజ్యం పాలయన్. స్వస్వరూపానందే రాజదంపతీ విహరతః జీవన్ముక్తౌ విదేహముక్త పదం గతౌ విత్యాఖ్యాయికాం త్రికాలవేదీ ఋషివర్యో ఘనప్రజ్ఞ నామానం ఋషికుమార మవోచత్॥

తా॥ ఆ స్వయంప్రకాశుడనేరాజు విమర్శశక్తి అనే తనభార్యచేత బోధించబడి అజ్ఞానికి వనమైననూ గృహముతో సమానమనియు జ్ఞానికి గృహమైననూ వనముతో సమానమని తెలుసుకుని తనభార్యతోసహా తమ స్వస్థానమునుపొంది స్వరాజ్యపరిపాలన చేయుచుండిరే ఆరాజదంపతులు జీవన్ముక్త విదేహముక్త కైవల్యపదవులనుపొందిరని ఋషికుమారునికి త్రికాలవేది చెప్పెను.

గురుః॥ శ్లో॥ స్వయంప్రకాశ రాజస్య పరాశక్తేః ప్రభావజాం
మాయావిజృంభణంచైవ పరస్య ప్రాకృతత్వతా॥
విచారణాత్స్వస్వరూప ప్రాప్తిర్మోక్షాఖ్య సంపదః
సృష్టేరాద్యంతసంయుక్తం చరితం కథితం మయా॥
తన్మాయా వశగా స్సర్వే భ్రామ్యంతి భవసాగరే।
స్వరూపజ్ఞానలాభేన తరంతి క్షణమాత్రతః॥
ఏవముక్త్వా గురుశ్శ్రీమాన్ విరరామ ముదాన్వితః॥

తా॥ గురువు వెనకచెప్పిన స్వయంప్రకాశుడనే రాజుయొక్కయు పరాశక్తిఅనే విమర్శశక్తియొక్కయు ప్రభావమువల్ల కలిగిన మాయాశక్తి చూపించిన ఇంద్రజాలికము సచ్చిదానంద స్వరూపుడయిన పరమాత్మ చిత్కలస్వరూపుడగు ఆరాజు మాయావశుడై [ఆవరించబడి] కేవల పామరుడగుటయు తిరిగి అతనికి ఆత్మానాత్మ విచారణవల్ల స్వస్వరూపజ్ఞానము కలుగుటయు మోక్షసామ్రాజ్యమును పొందుటయు ప్రపంచము సృష్టియొక్క ఆద్యంతములతో కూడిన

చిత్రము చాచే చెప్పబడినది. సకలజీవులూ ఇంద్రజాలికా స్త్రీ అనే మాయాశక్తిచే ఆవరించబడినవారై స్వ పరము లనే భేదజ్ఞానము కలవారై సంసారమనే సాగరమందు జనన మరణములను పొందుచున్నారు. అట్టి అజ్ఞానులైననూ తమ పూర్వరూపము చిద్రూపమని శరీరజీవాదులు నే ననే అభి మానము మాయచేతనే కల్పించబడినదని తెలుసుకొని నపుడు క్షణమాత్రములో దీపమూ సూర్యుడు రాగానే గొప్పచీకటి పోయినట్లు అజ్ఞానము భ్రమపోయి ఈసంసార సాగరమును దాటగలవారగుదురు అని చెప్పినవారై బ్రహ్మా నందము కలవారై విరమించి ఊరకుండెను.

గురువును ఋషికుమారుడు మహావాక్యోపదేమును
కోరుట

బాలః॥ శ్లో॥ చరితం పావనంశ్రుత్వా మత్వా విస్మిత మానసః
ఆనందబాష్పాకులిత లోచనో బ్రహ్మభావనః
పునః ప్రోవాచ గురవే వచనం నమ్రభావవాన్॥

తా॥ ఆ ఋషికుమారుడు సకలపాపములనూ అజ్ఞాన మునూ పోగొట్టే ఈ రాజచరిత్రను విని ఇదంతయు పరసివ పరాశక్తుల చరిత్రఅనియు; ఇంద్రజాలికా స్త్రీ మూలప్రకృతి అనియు; ఇది పరాశక్తి చ్ఛాయఅని మాయాశక్తి అని సచ్చి దానంద స్వరూపమైన పరమాత్మకల మాయచేత ఆవరించ బడి జీవుడనే సంజ్ఞనుపొంది శరీరము నేననే భ్రమను పొంది లోకమందు సకలదుఃఖముల ననుభవించుచున్నారని; తెలుసు కుని ఆనందబాష్పములు కలవాడై జ్ఞానముకలిగి తాను

పొందిన వెనకటి అజ్ఞానావస్థను స్మరించి ఆశ్చర్యపడినవాడై నమ్రతకలిగి తిరిగి గురువులను అడుగుచున్నాడు.

ఘనప్రజ్ఞః॥ గద్య॥ శ్రీ గురో! రాజ చారిత్ర శ్రవణేన స్మారితోస్మి॥ అజ్ఞానాన్మయా విస్మృతం పూర్వరూపం చిన్మయమితి॥ "తథాపి బాలభావేన ప్రష్టుకామోస్మి కించిత్। మహావాక్యోపదేశంతు పారంపర్య క్రమాగతం। పరోక్షం చాపరోక్షంచ జ్ఞానద్వయ సమన్వితం। దత్వా మాం తారయ స్వేతి ప్రోవాచవినయాన్వితః॥" ఓమిత్యాజ్ఞీకృత్వా; విద్యాగురుప దేష్టు ముపచక్రమే॥ "చతుర్వేద సముద్భూత మహావాక్య చతుష్టయం। సాధకం స్మరణాదేవ జ్ఞానద్వయ ఫలప్రదం। ఉపదిశ్య తతో బ్రూయా దిమం జ్ఞాన ద్వయాన్వితం। పారంపర్యక్రమేణైవ గ్రాహ్యం నగ్రంథతోన్యథా। ఇత్యాజ్ఞప్య పునః ప్రాహ వత్సం వాత్సల్యమానసః॥"

తా॥ ఘనప్రజ్ఞుడనే ఋషికుమారుడు అడుగుచున్నాడు ఓగురుస్వామీ! నేను అజ్ఞానముచేతను అఖండ మండలాకారమయిన చిదూపము, నానిజరూపమని మరచినాను. మీరు ఉపదేశించిన రాజు చరిత్రవలన నానిజరూపము తిరుగా జ్ఞాపకమువచ్చినది. తెలుసుకున్నాను. అయిననూ బాలభావముచేత కొంచెము అడగవలసినదికలదు. పరోక్షా పరోక్షములనే జ్ఞానద్వయముగల మహావాక్యోపదేశము గురుపరంపరాగా పొందతగినది. దానిని నాకు ఉపదేశించుమని ప్రార్థించెను.

గురువువిని॥ ఓం; అని అంగీకరించి ఉపదేశించుటకారంభించెను. నాలుగువేదములలో సారభూతమైనది. వాటి అర్థవిచారణచేతను పరోక్షాపరోక్షజ్ఞానములుకలిగే నాలుగువాక్యములునూ వాటిఅర్థమును ఉపదేసించి; ఓయీ! ఈ మహావాక్యములనే బ్రహ్మవిద్య ఉపదేశ పరంపరగా ప్రాప్తించవలెనుగాని గ్రంథములవలనగాని మరియొకరీతినిగాని పొందకూడదని శాసించెను. తిరిగి శిష్యునియందు ప్రేమకలిగి చెప్పనారంభించెను.

హే వత్స! అయంప్రపంచః ఆత్మానాఽత్మేతి ద్విప్రకారః॥ ఆత్మాసచ్చిదానందరూపః॥ అనాత్మానః, దేహేంద్రియాదయః. తచ్చ;వ్యష్టి సమిష్టి భేదేన ద్వివిధః॥ దేహత్రియా, వస్థాత్రయ, విలక్షణాస్సాక్షిజ్ఞానేన బ్రహ్మాహమస్మీతి జ్ఞానం జాయతే। సఏవకృతకృత్యః, సజీవన్ముక్తః॥

తా॥ ఓ వత్సా! వినుము. ఈప్రపంచము ఆత్మ అని అనాత్మఅని రెండువిధములుకలది- అందు ఆత్మచేతనము సత్తాస్వరూపము.అనాత్మలు అచేతనములు, దేహేంద్రియాదులు, జడములు. అందువల్ల చేతనమైన బ్రహ్మ వకడే; బిమ్బప్రతిబింబములవలెను అనేక రూపములుగా నగుపడుచున్నాడు. దేహత్రియ, అవస్థాత్రయమును, తెలుసుకునేది; వాటికి విలక్షణమైన ప్రజ్ఞానమే సాక్షి. అది తన నిజరూపమనే జ్ఞానముచేతను, నేను బ్రహ్మస్వరూపుడను అయితిననే జ్ఞానము కలుగును. బ్రహ్మకు జనన మరణాదులు లేనందున వారు ముక్తులు, కృతకృత్యులు అని చెప్పిరి.

## సచ్చిదానందస్వరూపము

ప్రశ్న॥ సచ్చిదానందపదే పదత్రియ భేదఃకుతః?
అభేదజ్ఞానం కథం జాయతే?ఇతి॥

తా॥ స్వామీ! సచ్చిదానంద స్వరూపము బ్రహ్మ అని అద్వైతమని శలవిచ్చిరి. సచ్చిదానంద పదమందు మూడుపదములున్నవి. అభేదమెందుకు కలిగినదని అడిగెను.

### ప్రశ్నకు ఉత్తరువు

గ॥ ఆత్మాత్రివిధ పరిచ్ఛేదరహితః, దేశతః కాలతో వస్తుతః॥ సచ్చిదానంద పదానాంభిన్నార్థత్వాత్ । హస్త కర పాణివత్ పర్యాయపదత్వాత్॥ త్రైః పదైః ప్రతిపాద్యః ఆత్మనః వృక్షంపత్రిశాఖా ఫలపుష్ప రూపేణ వర్తత ఇతివత్ । లోహితోష్ణః ప్రకాశః దీపఇత్యర్థే యథా స్వగత భేదోనాస్తి; ఏవం సచ్చిదానందః నిరూపితః॥

తా॥ ప్రశ్నకు ఉత్తరువు॥ ఆత్మ త్రివిధభేదములేని. దేశతః కాలతః వస్తుతః సచ్చిదానందపదములు వేరు, వేరు అర్థములు కలవైనను; చేతికి హస్తమని, కరమని, పాణి యనిపర్యాయపదములు కలవు. వస్తువు ఒకటిగానే యున్నది.

వృక్షమనగా శాఖా పత్రి పుష్ప ఫలములు కలసి వృక్షమైనది. ప్రకాశత, ఎరుపు, వేడి,కలది దీపము. అటులనే సత్ [ఉన్నది]చిత్ ప్రకాశతగలది, ఆనందం నిరతిశయ సుఖ

స్వరూపముగలది; ఆత్మ, బ్రహ్మ, అని ఏకవస్తు పర్యాయముగా నున్నది.

కారణశరీరంనామ॥ శ్లో॥ అనాద్య విద్యా నిర్వాచ్యా కారణోపాధిరుచ్యతే। ఉపాధిత్రితయా దన్య మాత్మాన మవధారయేత్॥

తా॥ అనాదిఅయిన అవిద్యా అజ్ఞానమే కారణశరీరమని. స్థూలసూక్ష్మ శరీరములకు కారణముగనుక కారణశరీరమని భావము. స్థూలసూక్ష్మ కారణశరీరములకన్న వేరైనది వీటిని తెలుసుకునే ప్రజ్ఞానమే ఆత్మ (బ్రహ్మ) అని తెలుసుకొనవలెను.

—♦ ముంజాదృష్టాంతము ♦—

శ్లో॥ యథాముంజాదిషీకైవ మాత్మాయుక్త్యా సముద్ధరేత్।

తా॥ రెల్లుకట్టను నింపాదిగా పొరలు రేకులుతీసి లోపలనున్న మృదువైన లేతమొవ్వును తీసి గ్రహించినట్లు యిరువదినాలుగు తత్వములలోనూ నిమిడియున్న ఆత్మను తెలుసుకోవలెను.

శ్లో॥ పంచకోశ పరిత్యాగే సాక్షిబోధావ శేషతః।
స్వస్వరూపం సఏవస్యా చ్ఛూన్యత్వం తస్యదుర్ఘటం॥

తా॥ పంచకోశములనూ విచారించి వీటికి సత్తాలేదని తోసివేయగా ఏది విచారించినదో అదియే ప్రజ్ఞానము, సాక్షి. అదియే ఆత్మఅని గ్రహించవలెను. ఆత్మలేదనుటకు

విలులేదు. కనపడకపోయినను ఏది ఏజ్ఞానము వీటినివిచారించినదో అదే ఆత్మగానున్నదని భావము.

—♦ కదళీదృష్టాంతము ♦—

గ॥ వాక్యము॥ కదళీగర్భవ దసారం సంసారం॥

తా॥ అరటిచెట్టు డిప్పలన్నియుకలసి ఉన్నపుడు చెట్టు అని పేరుగలదు. ఆడిప్పలన్నియు విడదీయడంతోనే లోపల యేమియులేదు. అటులనే దేహము సంసారము కదళీ గర్భమువంటిది. విచారించితే లోపల యేమియులేదు.

—♦ ఊర్ణనాభిదృష్టాంతము ♦—

వా॥ ఊర్ణనాభివత్ జీవః స్వకర్మణాబద్ధో భవతి॥

తా॥ కోశనకాయలోపురుగు తనవల్లపుట్టిన దారము చేతనే పట్టునిర్మించి క్రమముగా రాకపోకల ద్వారము కూడా కప్పివేసి దానిలోచిక్కి పైకిరావడమునకు మార్గము లేక లోపలనే చచ్చును. అటులనే జీవుడు జ్ఞానములేక కర్మలుచేయుచు వాటివల్లనే బద్ధుడగుచున్నాడు. కాని వీడిని ఎవరూ బంధించలేదు. తనఅజ్ఞానమే తనకు బంధకారణము అగుచున్నది. తిరిగి తనవిచారణవల్ల తాను ముక్తుడు కాగలడు.

—♦ ఆత్మ అసంగుడని ♦—

శ్రు॥ అసంగోయంపురుషః

తా॥ ఈపురుషుడు, ఆత్మ, దేహత్రియ మందున్ననూ; సంసారమందున్ననూ; ఆత్మజ్ఞానము కలిగినపుడు వానిని

సంసారము అంటనేరదు. పద్మసాలిపురుగు చక్రాకారముగా పట్టుపెట్టి తాను అందు ఒకచోటనివసించి ఉండును. ఈగలు మొదలగునవి సంచరించుచుండగా ఆపట్టు తగలగానే దాని యందున్న జిగురు రెక్కలుకు తగిలి పోలేక కొట్టుకొనుచుండగా పట్టుపెట్టిన ఆసాలిపురుగు ఆపట్టుమీదనుంచి అతివేగముగావచ్చి దానిని భక్షించును. ఆపట్టుయందున్న జిగురు అన్నిటికీ అంటును గాని దానికి అంటనేరదు. ఆపట్టుమీద అతిసూక్ష్మముగా బరువైన అది అతివేగముగా నడచును. దానికి భంగములేదు. అటులనే ఆత్మ తన మాయాశక్తి చేత కల్పించిన ప్రపంచమందున్నను ఆత్మకు ప్రపంచసంబంధము లేదనిభావము.

వా॥ యథావృక్షో వనస్పతిః తథాబ్రహ్మైవజీవః॥

తా॥ వృక్షమే వనస్పతి ఏలాగు అగునో అటులనే జీవుడనేదే పరమాత్మ, బ్రహ్మవస్తువగుచున్నది. జీవుడు వేరుగాను ఆత్మ వేరుగాను రెండువస్తువులు లేవనిభావము.

వా॥ హేపుత్ర! శాస్త్ర గురుముఖపురస్సరేణైవ పరోక్షాపరోక్ష జ్ఞానయుక్తః శృతి యుక్తి అనుభవైః॥

త్రివిధ శరీరాదన్య మాత్మానం జ్ఞాత్వా యస్సుఖేన విహారతి; సఃగృహస్థోపి; కుటీచక, బహూదక, సన్యాసిభ్యః; అగ్రిమ్రాజ్యోభవతి॥ సజీవన్ముక్తః సః పరమహంస ఇతినిశ్చిత్య త్వమపి ఆత్మానం సమ్యక్ శ్రుత్వా, మత్వా; జ్ఞాత్వా, ధ్యాత్వా, సాక్షాత్కృత్య; నిత్య శుద్ధ ముక్త సత్య పరమానందా ద్వయ బ్రహ్మరూపేణతిష్ఠ॥

ఏతావదేవ ఆచార్యేణ వక్తవ్యం; శిష్యేణశ్రోతవ్యం; ఇతిశివం॥

తా॥ ఓఋషికుమారా! వినుము. శాస్త్రము గురుముఖముగా పరోక్షా పరోక్షజ్ఞానము కలవాడై శ్రుతి యుక్తి అనుభవములచేత స్థిరమై సిద్ధముగానున్న బ్రహ్మను తెలుసుకుని సుఖముగా యెవరుయుందురో వారు; కుటీచక, బహూదక, సన్యాసులకన్న అగ్రపూజ్యులు. వారే పరమహంసలు అని నీవు నిశ్చయించుకుని; నీవున్న ఆత్మను పూర్ణముగా తెలుసుకుని మననముచేసి ధ్యానించి దానియందు లయముపొంది ఆత్మ సాక్షాత్కారము గలవాడవై; నిత్య శుద్ధ ముక్త పరమానందాద్వయ బ్రహ్మరూపముతో నుండుము. గురువులచేత ఇంతమాత్రము చెప్పతగినది. శిష్యులు వినతగినదిన్ని. ఆపైని శిష్యుడు స్వానుభవముచేత జీవన్ముక్తుడగుచున్నాడు.

## —♦ గ్రంథముయొక్క ఫలశ్రుతి ♦—

శ్లో॥ త్రికాలవేదీ బ్రహ్మఋషిః ఘనప్రజ్ఞం ముదాన్వితం।
విదిత్వా జ్ఞానసంపన్నం బ్రహ్మానంద పదంగతం॥
తుర్యాతీత స్వరూపంచ కైవల్యపదగామినం।
జ్ఞాత్వా ప్రోవాచముదితో లోకానుగ్రహ కాంక్షయా॥

తా॥ గురువగు త్రికాలవేది అనే మహాఋషి తన శిష్యుడయిన ఘనప్రజ్ఞుడనే ఋషికుమారుడు సంతోషము గలవాడును జ్ఞానసంపత్తిగలవాడును బ్రహ్మానందస్వరూపు

డును తుర్యాతీతము కైవల్యములనే స్థానములను పొందిన వాడును అయినాడని తెలుసుకుని ఇతనికి ఉపదేశించినక్రమము ఉభయుల సంవాదము లోకమందు ప్రచురమయినయెడల ఈ గ్రంథమువలన లోకములో అనేకులు ముక్తులగుదురని లోకమందు అనుగ్రహము గలవారై గురువులు ఇట్లుపలికిరి.

శ్లో॥ శృణువత్స మయాప్రోక్తం జ్ఞానవిజ్ఞాన సాధనం।
స్వరూపజ్ఞాన నామాయం గ్రంథో లోకోపకారకః।
ప్రకాశం యతుసర్వత్ర యధాభాతి దివాకరః॥

తా॥ ఓవత్స! నాచేతనీకొరకు చెప్పబడిన స్వరూపజ్ఞాన దర్పణ మనే ఈ గ్రంథము జ్ఞానమును కోరే జనులకు ఉపకారమై ప్రపంచమందు బ్రహ్మజ్ఞానమునకునూ సాధనమై లోకమందు సూర్యకాంతి సర్వత్రా ఎట్లు ప్రకాశించుచున్నదో అట్లు వ్యాపకమై లోకమంతటనూ ప్రకాశించుగాక. వ్యాపింపజేయుము.

శ్లో॥ నిర్వికార పరంబ్రహ్మ సంకల్పః సృష్టికారణం।
విమర్శశక్తే రుత్పత్తిః మాయాశక్తే ర్విజృంభణ ।
ఇందిజాలప్రభావంచ సృష్టి స్త్రైలోక్యసంభవః।
చితేర్జీవత్వసంప్రాప్తిః మోహజాలేన బంధతా।
అహం మమేతి మిథ్యాభినివేశేనవివశోనరః।
సంసారార్ణవమగ్నత్వం ప్రాప్తో జన్మపరంపరాం॥

తా॥ ఓయీ! ఈగ్రంథమందు వివరించిన రాజదంపతుల చరిత్రయందుగల రహస్యార్థమును వివరించుచున్నాము.

స్వయంప్రకాశుడనే ఆరాజు సృష్ట్యాదినున్న అసంగ చిద్రూపుడగు పరమాత్మ కలడనియు, అతను సత్వాది గుణత్రయ సంబంధమునూ లేనివాడు. ఏవికార్యమూ లేని వాడు సృష్ట్యావిర్భావకాలము తటస్థించినపుడు తనయందున్న మాయాశక్తి విజృంభణవలన అతనియందు సృష్టికావలెననే సంకల్పముకలిగినదనియు; సృష్టికృత్యము; శక్త్యధీనముగనుక ప్రకాశరూప పరమాత్మ రెండుభాగములై; వామభాగము విమర్శశక్తిగాను, దక్షిణభాగము ప్రకాశాంశము, పురుషుడుగాను విభాగము పొందిన దనియు; విమర్శశక్తి ప్రకాశాంశను ఆశ్రయించియుండి సృష్టినిమిత్తము తనచ్ఛాయను త్రిగుణాత్మకమైన మాయాశక్తిని కల్పించినదనియు; స్వయంప్రకాశుడు పురుషుడుగాను; విమర్శ, జ్ఞానశక్తిగాను; మాయాశక్తి, మూలప్రకృతిగాను; ఉన్నదనియు ఆపురుషునకు వీరిరువురునూ భార్యలుగాను ఆపురుషుడు ప్రకృతితో కూడినపుడు ప్రవృత్తియు బహిర్ముఖమును; విమర్శయుక్తుడైనపుడు నివృత్తియు అంతర్ముఖత్వమును; స్వాభిముఖతయు; గలుగుచున్నవనియు, ఇట్లు రెండుశక్తులు ఉత్పత్తియు మాయాప్రభావముచేత ఇంద్రజాలకాస్త్రీచేత మిధ్యాజగన్నిర్మాణము అయినది.

చిద్రూపుడయినపరమాత్మకుజీవత్వప్రాప్తియు; మోహమనే వలలోచిక్కి నేను నాది, అనే భేదజ్ఞానముగలిగి శరీరజీవాదులందు నేననే భ్రమకలిగి ప్రకృతికి స్వాధీనుడై అస్వతంత్రుడై తమతమ కర్మల ననుసరించి సంసారసముద్రమందు పడి మునిగి అనేకజన్మలను పొందుచున్నాడనియు; క్రీడాకందు

కము (బంతి) ఘటీయంత్రము, (యేతము) వలెను పుట్టుచు చచ్చుచు క్రిందికి మీదికి పోవుచూ చచ్చుచూ రథచక్రము కులాలచక్రములవలెను విరామములేక తిరుగుతూయున్నాడు. ఇట్లు చిదూ్రపుడయిన పరమాత్మకలకే తనసంకల్పముచేతనే బంధత్వము కలిగినదని భావము.

శ్లో॥ కాలాంతరేణ విరమో వైరాగ్యస్య విజృంభణం।
ఈశ్వరానుగ్రహాచ్చైవ గుర్వనుగ్రహ సంభవః॥
గురురూప పరాశక్తే రుపదేశాదికం తతః
జీవచిత్తాదికం సర్వం మాయేతిజ్ఞాన సంస్మృతిః॥
చిత్తవిశ్రాంతి సంసిద్ధి స్స్వరూపజ్ఞాన బోధనం।
తుర్య తుర్యాతీతపదం కైవల్యపద సంభవః॥
జీవన్ముక్త పదప్రాప్తిః స్వారాజ్యప్రాప్తి రేవచ
ఏవమాది కథాయుక్తో స్వరూపజ్ఞాన దర్పణం॥

తా॥ కొంతకాలముకు అనేకజన్మ పుణ్య పుంజ పరిపాకముచేత సంసారభోగములందు విరక్తికలిగి దేవతాభక్తి గలుగును. ఈశ్వరానుగ్రహామున బ్రహ్మవేత్తలగు గురువుల అనుగ్రహాము గలుగుటయు తరువాత జ్ఞానస్వరూపియగు పరాశక్తి గురురూపముగావచ్చి తనపూర్వస్థితిని; నీవు అసంగ చిదూ్రపుడవని జీవచిత్త శరీరాదులు మాయాకల్పితములని మహావాక్యార్థమును ఉపదేశించుటయు అందువల్ల జగత్తు సంసారము శరీరజీవాదులు మాయాకల్పితములనియు, తన నిజరూపము చిన్మాత్రమని పరమాత్మ అఖండాకారముగా అంతటనూ సత్తారూపముగా ప్రకాశించుచున్నదనియు, మిగి

లిన నామరూపములు మిథ్యలు జడములనియు తెలిసి చిత్తము విశ్రాంతినిపొంది స్వస్వరూపజ్ఞానసిద్ధి అతనికి కలుగుటయు జీవన్ముక్త విదేహముక్త పదవులు తురీయ్యా తుర్యాతీత కైవల్య పదప్రాప్తియు, పురుషునికి స్వరాజ్యప్రాప్తియు కలుగుననే మొదలయిన కథలతో గలది, ఈస్వరూపజ్ఞానదర్పణమనే ఈగ్రంథము రచించబడినది.

శ్లో॥ సర్వోపనిషదాంసారం పూర్వాచార్యై ర్వినిశ్చితం।
గ్రంధమాయుష్కరం పుణ్యం సద్యః కలివినాశనం॥
శివశక్తి సమాయోగ చారిత్రం పావనం శుభం।
యఃపఠే చ్ఛ్రావయేద్వాపి శృణోతి సుసమాహితః॥
తస్యపుణ్యఫలం వక్తుం నశక్తం శివపవసః।
తృప్తిర్నిరంకుశాచైవ అభయంశాశ్వతంపరం॥
అక్షయ్యా సుఖసంప్రాప్తిః బ్రహ్మత్వంప్రాప్యతేనరైః।
సఏవ బ్రాహ్మణః ప్రోక్తః మానుషాకార శంకరః॥

తా॥ ఈగ్రంథము సకలోపనిషతుల సారము. పూర్వము వశిష్టాది మహాఋషుల అనుభవ నిశ్చయముగా అయి ఉన్నది. ప్రత్యక్ష ప్రమాణసిద్ధము. ఆయుర్వృద్ధికరము. జ్ఞానప్రదము. సకలకలిదోషములను సకలపాపములను నశింప జేసేదియు శివశక్తుల సామరస్యమును తెలిపేదియు పవిత్రమైనదియు. సకలశుభముల నిచ్చేదియు, అగు ఈగ్రంథమును ఎవరుపఠిస్తారో; పరులకు ఏపుణ్యపురుషులు వినిపించుతారో, ఎవరు వినువారో; ఎవరు స్థిరచిత్తులై గ్రహింతురో; వారి పుణ్యమును చెప్పశక్యముగాదు. వారు ప్రత్యక్షమైన మానుష

రూపముగల శంకరులు. శివస్వరూపులుగానున్నారు. వారికి అడ్డులేని తృప్తికలుగును. వారు బ్రహ్మత్వమును పొందిన వారు. జీవన్ముక్తులు. ఇహమందునూ పరమందునూ భయము లేనివారు. అజ్ఞానము నసించినవారు. శాశ్వతసుఖమునుపొందిన వారు. వారే నిజమైనబ్రాహ్మణులు. మానుషరూపముగల ఈశ్వర స్వరూపులు.

శ్లో॥ గ్రంధోయం యేన వాధీతః సంపూర్ణం ప్రవిచారితః
సఏవజీవన్ముక్తశ్చ తుర్యాతీతపదంగతః।
తస్యస్యాత్కేవలీభావోసాక్షిభూత స్సఏవహి
కృతకృత్యశ్చ ముక్తశ్చ ప్రాప్య ప్రాప్తోనసంశయః ।
సయత్రయత్ర చగతి తద్దేశం పావనంస్మృతం।
తశ్యదర్శనమాత్రేణ పూతోభవతిమానవః॥

తా॥ ఈగ్రంధము ఎవరిచేత పూర్తిగా పఠించబడు చున్నదో దీని తాత్పర్యమును పూర్తిగా యెవరు విచారింతురో వారే జీవన్ముక్తులు. తురీయ్య తురీయ్యాతీతములను కైవల్యపదమును పొందినవారు. వారు సాక్షిస్వరూపులు. చేయతగినదానిని చేసినవారు. జన్మ కలిగినందుకు పొందతగిన పదవిని పొందినవారు. ఇందుకు యేమియు సంశయము లేదు. వారు యేయే స్థలములయందు సంచరింతురో ఆయాస్థలములు పవిత్రమగుచున్నవి. మనుష్యులు వారి దర్శనమాత్రముచేత సకలపాపక్షయమై పవిత్రులగుదురు.

శ్లో॥ తస్యవంశే స్థిరాలక్ష్మీః జ్ఞానసంపత్తి రేవచ
సుఖజీవన సంపత్తిః జీవన్ముక్తాశ్చ రంతితే।

యోవిప్రో బ్రహ్మవేత్తా స్యాత్ సబ్రహ్మత్వ పదంగతః।
తద్వంశజాశ్చ పితర స్సర్వే బ్రహ్మ పదంగతాః
తారితాస్తే న సందేహ స్సర్వే బ్రహ్మత్వ మాగతాః
సర్వవ్యాపిన మాత్మానం భావయన్ స్వేచ్ఛాచారిణః॥
ఆత్మోపదేశం కుర్వంతో। చరంతి బ్రహ్మవాదినః॥

తా॥ ఈగ్రంథార్థమును గ్రహించి ఆచరణగలవారి వంశమందు లక్ష్మి స్థిరముగానుండును. జ్ఞానసంపత్తిగలుగును. సుఖమైనజీవనము కలుగును. వారి పితృదేవతలు బ్రహ్మత్వ మునుపొందినవారు, లోకత్రయమును దాటినవారు, అగుదురు. పరమాత్మ అంతటనూ వ్యాపించి సత్తారూపముగా నున్నదని భావించి తాము బ్రహ్మస్వరూపులై వారు అంతటనూ ఆత్మోపదేశముచేయుచు స్వేచ్ఛా సంచారులుగానుందురు.

శ్లో॥ నానేనసదృశోగ్రంథో న భూతో నభవిష్యతి।
వక్తుం శ్రోతుం జనానాంహి నకించిదవశిష్యతే॥
సర్వముత్సృజ్య యత్నేన కుర్యా దాత్మవిచారణం।
విదిత్వా స్వాత్మనోరూపం చరే ద్యాదృచ్ఛికం తతః॥

తా॥ జ్ఞాన కాండలో ఈగ్రంథముతో సమానము గాని అధికముగాని గలది ఇతర గ్రంథము ఇదివరకుఉన్న వాటిలోలేదు. ముందునూ పుట్టబోదు. జ్ఞానమును కోరే మను ష్యులకు ఈగ్రంథమందున్న హంశములకన్న ఎక్కువహంశ ములు ఎక్కడనూ ఏగ్రంథమందును దొరక్కనేరవు. మిగిలినది చెప్పడమునకునూ వినడమునకునూ అవశిష్టమూలేదు. వీరికి

పూర్ణభావమును పొంది మౌనముగా ఉండుటకన్న చేయ వలసినది లేదని భావము.

ఎట్టి వ్యాపకము కార్యములనైనా విడచి ముఖ్యముగా తాను ఎవరనే తన విచారణ చేయవలెను. అందువల్ల క్రమముగా తాను బ్రహ్మస్వరూపుడను అనే జ్ఞాన ముదయించును. గనుక పూర్ణముగా తనస్వరూపమును తెలుసుకుని తరువాత తాను ఏప్రవృత్తిలో నున్ననూ లోపములేదు. తాను బ్రహ్మస్వరూపుడైనందుననూ బ్రహ్మకు జననమరణములు లేనందుననూ పూర్ణముగా ఆత్మవిచారణ చేసిన సిద్ధపురుషులకు ప్రవృత్తివల్ల వినిపాతము లేదనియు వారి ప్రవృత్తి నివృత్తియే అనియు భావము.

ఘనప్రజ్ఞుడనే ఋషికుమారుడు గుర్వనుజ్ఞనుపొంది
స్వాశ్రమమును పొందుట.

శ్లో॥ ఇత్యుక్త్వా విరరామాథ త్రికాలజ్ఞో మునీశ్వరః।
ఋషిపుత్రోఽపి తచ్ఛ్రుత్వా బ్రహ్మానంద పదంగతః॥
ఆనందబాష్పకలిత లోచనద్వయ సంయుతః।
పూర్ణచంద్ర సమానాస్యః కథాంస్స్మృత్వా తి విస్మితః॥
అహోశాస్త్ర మహాశాస్త్ర మహాగురు రహోగురుః॥
ప్రకాశరూపో భగవాన్ సచ్చిదానంద లక్షణః।
విమర్శ రూపిణీశక్తిః జ్ఞానరూపా మహేశ్వరీ॥
ప్రపంచమాతా పితరౌ తయోరన్యం నకించన।
ఇంద్రజాల ప్రభావేణ సర్వేభావాః ప్రకల్పితాః॥

సర్వంబ్రహ్మేతి విజ్ఞానం ఏతావద్విస్మృతం గయా।
ధన్యోస్మి కృతకృత్యోస్మి అహం బ్రహ్మాస్మి సర్వదా
ఇతి నిశ్చిత్య సంపూర్ణః సర్వలోకాంతరాత్మనా॥
సర్వంబ్రహ్మేతి సస్మార కైవల్యపద వైభవం।
గురుం ప్రణమ్య లబ్ధాజ్ఞో స్వాశ్రమం ప్రాప్యసుస్థితః॥
సర్వసంశయవిచ్ఛిన్నో విపర్యాసవివర్జితః
స్వాత్మారామః సుఖీభూత్వా జీవన్ముక్తో బభూవసః॥

తా॥ ఈరీతిని ఘనప్రజ్ఞునికి గాజదంపతుల చరిత్రయు, ఇంద్రజాల ప్రభావము, ప్రపంచ సృష్టిక్రమమునూ, బ్రహ్మజ్ఞానమును, గురువు ఉపదేశించి సర్వగతమైన పరమాత్మను స్మరించుతూ ఊరుకొనెను. తరువాత ఋషికుమారుడు సర్వమును గ్రహించి బ్రహ్మానందమునుపొందినవాడై ఆనందబాష్పములతో నిండిన నేత్రములుగలవాడై పూర్ణచంద్రునివలె వికసించిన ముఖముకలవాడై గురువుచెప్పిన కథలను స్మరించుచు ఈజ్ఞానశాస్త్రమందు గొప్ప మహిమగలదు. ఈ గురువులు బ్రహ్మస్వరూపులు, అని ఆశ్చర్యపడుచూ, స్వయం ప్రకాశుడు పరబ్రహ్మము విమర్శశక్తియు బ్రహ్మశక్తిగానే యున్నది. త్రైలోక్యము మాయాకల్పితము. సకలమూ బహ్మస్వరూపముగానున్నది. ఇంతవరకూ నాకు మాయచేత నిజము తెలియలేదు. నేను బ్రహ్మస్వరూపుడనైనాను. గుర్వనుగ్రహముచేత ధన్యుడనైతిని. నాకు ఈజన్మ కలిగినందుకు చేయవలసిన బ్రహ్మవిచారణ చేసినాను. పొందవలసిన బ్రహ్మత్వమును పొందినాను. అని తనలోతానునిశ్చ

యించుకుని పరమాత్మ అంతటనూ వ్యాపించి సత్తాస్వరూప ముగా నున్నందున తానును బ్రహ్మస్వరూపుడుగా భావించి గురువులకు వందనములుజేసి వారి అనుజ్ఞనుపొంది తన ఆశ్ర మముకు వెళ్ళెను. సకల సంశయములు వదలినవాడై తిరిగి మాయకు లోబడనివాడై అంతర్ముఖత్వము గలవాడై జీవన్ముక్తుడై స్వేచ్ఛగా విహరించుచుండెను.

—— అవ॥ గ్రంథకర్తల వాసస్థానాది వివరణము ——

శ్లో॥ త్రైలింగ్య విఖ్యాత కలింగ దేశే
విద్వజ్జనా వాస వరం సురమ్యం।
సద్వేదశాస్త్రై రభిశోభితంచ
నామ్నా విశిష్టం జయపత్తణం తత్॥

తా॥ శ్రీశైలపర్వతము మహేంద్రపర్వతము వింధ్యపర్వ తములనే మూడులింగముల మధ్యదేశముగనుక త్రైలింగ్య దేశము. కళింగదేశమనే నామాంతరముగల ఆంధ్రదేశ మందు విద్వజ్జనులకు నివాసయోగ్యమైన రమ్యమైన వేద వేదాంగములతో ప్రకాశించుచున్న విజయనగరమనే పట్టణము రాజధాని గ్రంథకర్త ప్రాచీన నివాసస్థానము. తదుపరి వర్తమానమందు

అవ॥ జగత్ప్రసిద్ధములు ముక్తిక్షేత్రములగు కాశీ, ప్రయాగలనే క్షేత్రద్వయము పరమాత్మ స్వరూపిణియగు శ్రీదేవి విరాడ్రూపమందునూ, సూక్ష్మరూపమగు పిండాండ మందునూ కూడ గలవు. ఆ వివరము చెప్పబడుచున్నది.

మూ॥ పరమాత్మాపరాకాశే చంద్రమండల మధ్యగః।
కాశ్యతేయత్రసాకాశీతత్ర వాసోవిముక్తతా॥

అవ॥ పిండాండమందు కాశీక్షేత్రమును నిరూపించబడు చున్నది. తా॥ శ్రు॥ తైత్తిరీయ్య॥ సత్యం జ్ఞానమనంతం
బ్రహ్మయోవేదనిహితం గుహాయాంపరమేవ్యోమన్॥

తా॥ పంచకోశాంతర్వర్తిగుహ. అట్టి గుహాలోపల పరాకాశము ద్వాదశాంతము శిరోమధ్యను శిఖాస్థానము పరాకాశమని. అచట సత్యము, జ్ఞానము, ఆనందము, ఈ మూడులక్షణములుగల చిద్రూపమైన పరమాత్మకల ప్రకాసించుచున్నది. దానిని తెలుసుకున్నవారు బ్రహ్మస్వరూపులని శ్రుత్యర్థము. గనక పరాకాశమై ద్వాదశాంతమునందు సాక్షి స్వరూపముగా ప్రకాసించుచున్నందున అది కాశీక్షేత్రమని పించుకొనును. అచట ఎవరు నివాసముగా నుందురో సాక్షి స్వరూపము తానని స్థూలశరీరజీవాదులుఅసత్యములనేజ్ఞానము కలవారుజీవన్ముక్తులని భావము. వారుకాశీవాసులుగానున్నారు.

మూ॥ గంగా యమున యోస్సంగం యత్రగుప్తా స్సరస్వతీ
త్రిపుటీభ్రుకుటీ మధ్యంప్రయాగ క్షేత్రము చ్యతే॥

అవ॥ ప్రయాగక్షేత్రమును నిరూపిస్తున్నారు.

తా॥ గంగా యమునా నదుల సంగమము. సరస్వతి గుప్తముగా ప్రవహించి కలియుచుండుట ఎచటకలదో అది ప్రయాగ అని, స్థూలరూపమందు ప్రసిద్ధముగానున్నది. సూక్ష్మమగు శరీరపక్షమందు ఇడా పింగళలనే నాడీద్వయము

గంగాయమునలు. బ్రిహ్మనాడియగు సుషుమ్నానాడి సరస్వతీ. యీమూఁడునదుల సంగమస్థానము భృకుటీ మధ్యమగాన అది ప్రియాగ క్షేత్రిముగా నున్నదని భావము. ఆజ్ఞా కమలము ప్రయాగక్షేత్రమని భావము.

శ్లో॥ స్థూలవిశ్వాంతదీశస్తు విశ్వేశ ఇతికథ్యతే।
అన్నపూర్ణా త్రితత్వాత్మా జ్ఞానగంగాపరాఽస్మృతా॥

అవ॥ కాశీప్రయాగలని క్షేత్రములు చెప్పిరిగాని అచటనున్న దేవతలున్నారా? అనే శంకకు సమాధానము.

తా॥ బ్రహ్మాండము స్థూలరూపము విశ్వమనియు స్థూల శరీరమునునూ వర్తిస్తున్నదిగాన బ్రహ్మాండాధిపతి స్థూలశరీరాధిపతియు విశ్వేశ్వరుడు. సత్వరజస్తమోగుణ స్వరూపమైన ఆదిలక్ష్మి అన్నపూర్ణగాను; పరానాడియే జ్ఞానస్వరూపమైన గంగానదిగానున్నది.

మూ॥ స్థూలాకారేప్రసిద్ధం హి క్షేత్రద్వయముదీరితం।
సూక్ష్మేతత్వాత్మ నిప్రోక్తౌ ప్రయాగకాశి విముక్తకం॥

తా॥ బ్రహ్మాండమందు ప్రయాగ కాశీక్షేత్రములు ప్రసిద్ధముగానున్నవి. సూక్ష్మమైన శరీరమునందునూ ఈక్షేత్రములు రెండునూ చూపించబడినవి.

మూ॥ స్థూలేసూక్ష్మేచవాసోస్య గ్రంథకర్తావిరాజతే॥

తా॥ ఈ గ్రంథకర్త స్థూల సూక్ష్మములందున్న కాశీ ప్రయాగ క్షేత్రిములందు ఉభయపక్షమునూ నివాసము గలవారని భావము.

మూ॥ సింహాంభట్ల సువంశ్యేన రామమూర్తిమనీషిణా।
రచితంవిదుషాం ప్రీత్యై స్వరూపజ్ఞానదర్పణం॥

తా॥ సింహాంభట్ల రామమూర్తిశాస్త్రిచే విద్వజ్జన ప్రీతికొరకు ఈ స్వరూపజ్ఞాన దర్పణము సతాత్పర్యముగా మూలగ్రంథముతో రచించబడినది.

మూ॥ శాలివాహశకే నేత్ర భూతవస్వింధువత్సరే।
ప్రమోదూతాశ్వియుజ్మాసే శుక్లేచదశమీతిథౌ।
గురువారేశారదాయాః స్వరూపజ్ఞానదర్పణం
సతాత్పర్యంతు సంపూర్య పరాశక్త్యైసమర్పితం॥

తా॥ శాలివాహనశకం ౧౮౫౨ సరియగు చాంద్రమాన ప్రమోదూత నామసంవత్సరాశ్వియుజ శుద్ధ విజయదశమీ గురువారముకు ఈ గ్రంథము తాత్పర్యసహితముగా రచించి శ్రీ శారదాస్వరూపమైన పరాశక్తికి సమర్పించబడినది.

మూ॥ సతాం మోదాయరచితం స్వరూపజ్ఞానదర్పణం।
మోక్షలక్ష్మ్యై ద్వారభూతం సద్యోముక్తిప్రదంనృణాం॥

తా॥ ఇది సత్పురుషులకు తమ తమ నిజరూపమును తెలుపుటకు అద్దమువంటిది. దీనిని చూచినపుడే ముక్తిని కలుగజేసేదిన్ని మోక్షలక్ష్మిని పొందుటకు ద్వారమువంటిది. సాధకజన సంతోషార్థము రచించబడినది.

మూ॥ చతురాశ్రమ నిష్ఠానామావశ్యక మిదం స్తవం।
స్త్రీభిర్వా పురుషైర్వాపి సకృదభ్యాసయోగతః।
అంతరర్ధానుసంధానా న్మాయా జాలంవిముంచతి॥

తా॥ ఈగ్రంథము అభ్యసించుట నాలుగాశ్రమముల వారికిని ఆవశ్యకముగానున్నది. స్త్రీలుగాని పురుషులుగాని ఈ రాజ దంపతుల కథయందున్న రహస్యార్థమును గ్రహించిన యెడల వారికి అజ్ఞానమనే వల లేక తెరనశించును.

మూ॥ అనేనతుష్టా శ్రీదేవీ వరానిష్టాన్ దదాతివై।
సర్వాన్కామానవాప్యే హ జీవన్ముక్తపదంగతాః॥

తా॥ ఈగ్రంథము శ్రీ దేవి చరిత్రగానున్నందున నభ్యసించినవారికి సకలవరముల నిచ్చును. ఇహమందు సుఖము లనుభవించి జీవన్ముక్తులగుదురు.

స్వరూపజ్ఞానము బ్రహ్మజ్ఞానముగానున్నందున బ్రహ్మను తెలుసుకున్న వారు బ్రహ్మస్వరూపులని శృతిసిద్ధముగనుక బ్రహ్మత్వమును పొందుదురని భావము.



ఇతి శ్రీమత్పదవాక్య ప్రమాణ పారావార పారీణ శ్రీ పరా
భట్టారికా రాజరాజేశ్వరీ ప్రసాద లబ్ధ ప్రతిభాసమేత సత్యా
నందనాథ గురు కరకమల సంజాతులును సింహాంభట్ల
సువంశజ కౌశిక సగోత్రులును లక్ష్మీదేవ్యంబా అప్పల
నరసింహేశ్వర ప్రపౌత్రులును వెంకట లక్ష్మ్యంబా
నరసింహేశ్వర పౌత్రులును లక్ష్మీనరసమాంబా
భాగీరథీరామేశ్వర పుత్రులును జ్ఞానానంద
నాథేత్యుపనామ విరాజితులగు సింహాంభట్ల
రామమూర్తిశాస్త్రిచే స్వరూపజ్ఞానదర్పణ
మనే బ్రహ్మజ్ఞాన సాధనమైన వేదాంత
గ్రంథము తాత్పర్య సహితముగా
సంపూర్ణముగా రచించబడినది.

జ య త్వ తి త రాం.

స్వ స్త్య స్తు.

శ్రీ

# తప్పు ఒప్పుల పట్టిక

## స్వరూపజ్ఞానదర్పణము

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 16 | బ్రహ్మజ్ఞానముగురించి | బ్రహ్మజ్ఞానమునగురించి |
| 23 | 24 | మిధామనుచూపించి | మిథ్యాప్రపంచమను చూపించి |
| 26 | 23 | రెన తాళపుచిప్పలు | రెండు తాళపుచిప్పలు |
| 27 | 9 | పక్షిద్వయంభూత్వా | పక్షిద్వయంభూత్వా |
| 37 | 6 | రాజపుత్త్రకాముడగుట | రాజపుత్రికాముడగుట |
| 41 | 23 | జన్మపరాంపరం | జన్మపరంపరాం |
| 45 | 9 | వ్యక్తిచేత | వృత్తిచేత |
| ,, | 20 | చోక్తవాన్రాజా | చోక్తవాన్సరాజాశ్రుత్వా |
| 46 | 18 | విప్రంత్వంకరిష్యామి | విప్రంత్వాంకరిష్యామి |
| 51 | 15 | పత్యక్షము | ప్రత్యక్షము |
| 56 | 13 | తాసంరాజానం | తాపసంరాజానం |
| 58 | 2 | హృదయపలక్ష్యతే | హృదయవల్లక్ష్యతే |
| 59 | 4 | స్వరూపజానబోధాయ | స్వరూపజ్ఞానబోధా[య |
| ,, | 5 | స్వేచ్ఛయాంపశిష్టం | స్వేచ్ఛయావశిష్టం |
| ,, | ,, | మానసపుత్రి | మానసపుత్రిం |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 10 | బ్రిహ్మాజ్ఞాన | బ్రిహ్మజ్ఞాన |
| 63 | 6 | నీజనిరూపము | నీనిజరూపము |
| 64 | 15 | గృష్ట్వా | దృష్ట్వా |
| ,, | 17 | ఏతావతాతవస్సిద్ధిః | ఏతావతా తవసిద్ధిః |
| 80 | 3 | సూరునివలన | సూర్యునివలన |
| 88 | 3 | నాస్తిభాజ్యం | నాస్తిభోజ్యం |
| 91 | 23 | ప్రాశిరూపముగా | ప్రాణిరూపముగా |
| 99 | 7 | పరంపరాలుండును | జన్మపరంపరలుండును |
| 104 | 12 | అట్టిసాక్షిఅన | అట్టిసాక్షితన |
| 107 | 12 | దుఃఖములనూపోంను తుచున్నవి | సకలదుఃఖములనుపోవు చున్నవి |
| 108 | 14 | ఆతవిచారణకు | ఆత్మవిచారణకు |
| ,, | 19 | నోభూతి | నోభాతి |
| 110 | 21 | అపరోక్షమము | అపరోక్షము |
| 111 | 3 | విశేషశక్తి | విక్షేపశక్తి |
| 113 | 3 | పోయెనవికోసము | పోయెననివానికోసము |
| ,, | 9 | సంగారు | నందరునూ |
| 122 | 11 | తైజసప్రాసాక్షిణః | తైజసప్రాజ్ఞసాక్షిణః |
| 123 | 23 | ఈఅవసను | ఈఅవస్థను |
| 128 | 22 | సుషుప్తిరవి | సుషుప్తిరపి |
| 131 | 1 | వాణీపరాఖలు | వాణీపరాఖలు |
| ,, | 6 | స్వరముకు- | స్వరములు- |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 131 | 1 | మాకళీ | ముకుళీభావము |
| 134 | 10 | శ్రేష్ఠమైనది | శ్రేష్ఠమైనది |
| 139 | 14 | యంనవృత్తమైన | యందుననువృత్తమైన |
| 141 | 15 | లయసావదఖండ | లయస్తావదఖండ |
| 142 | 5 | వాటినిపరిరించవలెనని | వాటినిపరిశీలించ |
| 143 | 13 | దీనిపై నిసానము లేదని | దీనిపై నిస్త్రానము లేదని |
| ,, | ,, | భావము | భావము |
| ,, | 17 | సాధకస్సాత్సర్వ | సాధకస్సాక్షాత్సర్వ |
| 145 | 10 | ప్రోక్తంచైతన్య | ప్రోక్తచైతన్య |
| 149 | 9 | సర్వదా | సర్వధా |
| ,, | 12 | కలవాడై | కలవాడనై |
| 163 | 8 | ప్రకాశంయతు | ప్రకాశయతు |

# ప్రకటన పత్రిక

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య బ్రహ్మ విద్వరిష్ఠ
శ్రీమత్ జ్ఞానానందతీర్థ తురీయ్యావధూత స్వాములవారిచే
రచింపబడిన వేదాంతగ్రంథములు.

౧ మహావాక్య రత్నావళి—ఆంధ్రభాషా తాత్పర్యము.
౨ స్వరూపజ్ఞానదర్పణము—తాత్పర్యసహితము.
౩ శారదాచతుశ్శ్లోకీ— తాత్పర్యసహితము.

వీరు పూర్వాశ్రమమునందు రచించినవి.
(బ్రహ్మశ్రీ సింహంభట్ల రామమూర్తి శాస్త్రిలవారు)

౪ కామకలాసూత్రములకు తాత్పర్యము.

౫ శ్రీ లలితాసహస్రనామములకు తాత్పర్యము.

౬ మాతృకాచక్రవివేకమునకు తాత్పర్యము.

౭ సుభగోదయమునకు తాత్పర్యము.

౮ సదాచారదీపిక విద్యారణ్యముని కృతమునకు తాత్పర్యము.

ఈ గ్రంథములు వలయువారు ఈ దిగువఅడ్రసునకు వ్రాసిపొందగలరు.

(1) బ్రహ్మశ్రీ బొట్టు విశ్వనాథశాస్త్రిలవారు,
విజయనగరం సంస్థానపండితులు,
విజయనగరం, కస్పా.

(౨) బ్రహ్మశ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిలవారు,
మద్రాసు.